

'మాలపిల్ల' 'బాలనాగమ్మ'ల నాటితార నేడు 'నర్తనశాల'లో తిరిగి అగుపిస్తున్నది.









రాజ్యం పిక్చర్స్—

# నర్తనశాల

(విరాట పర్వము)

మాటలు:సముద్రాల పాటలు:సముద్రాల,కొసరాజు,శ్రీశ్రీ కెమెరా:రెహమాన్

కళ:టి.వి.యస్.శర్మ సంగీతం:సుసర్ల దక్షిణామూర్తి నృత్యం:వెంపటి—

ప్రొడ్యూసర్స్:శ్రీధరరావు-రాజ్యం : డైరెక్షన్:కె.కామేశ్వరరావు బి.ఎ.

నవయుగ

NVKR

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఈ వారం (8—11—63 తేది) సంచిక ముఖచిత్రం తార జానకి చాలా బాగుంది. మీకు చాలా థాంక్స్ చెప్పాల్సి ఉంది, ఇలాంటి చిత్రం ప్రచురించినందుకు.

మరొక ముఖ్య విషయమండోయ్! చాలా కాలంగా మన పత్రికలో వెలువడుతూన్న కార్టూన్లు చాలా బాగుంటున్నాయ్ శ్రీ ఊమెన్‌గారి కార్టూన్లు మన పత్రిక కొక హైలైట్.

యమ్మార్. పట్నాయక్ (యానంపేట)

*　*　*

8—11—'63 తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రికయందు ముఖ చిత్రంగా వేసిన "జానకి" ప్రత్యేక చిత్రం ఆకర్షణీయముగా ఉన్నది. మొదట నేను ఆ చిత్రం చూసి జానకి కాదని అనుకున్నాను. తర్వాత పేజీ తిరగేసి చూశాక జానకే అని తెలిసింది.

గుండుమళ్ళ వెంకట రామారావు (శ్రీకాకుళం)

## కథ

'శర్వాణి'గారి వంచిత కథ చాల బాగుంది. మా మిత్రుల హృదయాలను నిజంగా కలచి వేసిందనే చెప్పాలి. కథలో సుమిత్ర పాత్ర, మాతోబాటు సోదర, సోదరీ పాఠకులందరి సానుభూతి పొంది తీరుతుంది. ఇటువంటి ఘటనలు నేటి మన సమాజంలో లేకపోలేదు. చక్కని కథను పాఠక లోకానికి అందజేసిన, రచించిన శర్వాణిగారికి మా హృదయ పూర్వక అభినందనలు.

మిత్రబృందం (సామర్లకోట)

## సందేహం

రచయిత శ్రీ ఆరుద్ర సతీమణిపేరు కె. రామలక్ష్మి అని ఉన్నది. కాని వారి ఇంటిపేరు 'ఆరుద్ర' గదా ?

రాఘవేంద్రరావు (ముమ్మలనేనివారిపాలెం)

కాదు.

## న్యూఢిల్లీ లేఖ

సైనిక శక్తిని విపరీతంగా పెంచుకున్న, మన ప్రక్కనున్న దేశాలు—పాకిస్తాన్, బర్మాలలో ప్రజాస్వామ్యానికి జరిగిన మానభంగం శ్రీ కృష్ణ గారు గమనించలేదా? మన ప్రధానమంత్రివంటి ప్రజా స్వామికవాది ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకునే, సైనిక పాటవాన్ని పెంచడానికి ఇష్టపడలేదేమో! ఈ విషయాలు శ్రీ కృష్ణగారికి చెప్పవలసిన అవసరం కలిగిందంటే, పాపం ఆయన స్థితికి ఎంతఅయినా జాలి కలుగుతూంది. మన దేశంలో కూడా సైనిక శక్తే ప్రభుత్వాన్ని నడిపిస్తే శ్రీ కృష్ణగారు ఇలాగ తన అభిప్రాయాల వెల్లడి చేయగలిగేవారా? ఆలోచించమనండి.

ఎం. ఎస్. రామశేషు (విజయవాడ)

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 22—11—63
శోభకృన్నామ సం॥ర నిజకార్తిక మార్గశీర్ష శుద్ధ షష్ఠి
సంపుటము . 56 సంచిక : 12

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకులు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

•

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వార (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

•

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1





# మనలోమాట

కొలంబా ఈ వారంతో అయిపోతోంది. ఈ నవల ఫ్రెంచి నుంచి అనువాదం : పేర్ల విషయంలో కొంచెం 'స్వాతంత్రం' తీసుకున్నట్లు అనువాదకుడు చెబుతున్నాడు. కార్సికన్ పేర్లకు సైతం కొంచెం ఫ్రెంచి ఉచ్ఛారణ ఇవ్వటం జరిగింది.....

* * *

'తమిళ దేశంలో వీధినాటకాలు' ఫొటోలు, వ్యాసంపంపిన శ్రీ రామకృష్ణ కోయంబత్తూరులో ఉంటున్నారు.

* * *

'వెజిటబుల్ పలావ్' ఎలా తయారు చెయ్యాలో తెలిపే వ్యాసం ప్రచురించమంటూ ఎందరో వ్రాశారు. అటువంటి వ్యాసం వేసే అవకాశం ఇప్పటికి గాని కలుగలేదు....

* * *

పైవారంతో మరొక సీరియల్ 'ప్రేమకు పగ్గాలు' అయిపోతుంది.— సీరియల్ అనుకుంటే, క్రిస్టీన్ కీలర్ ని గురించి జాన్ హోగన్ చెప్పిన కథ కూడా పైవారమే ముగిసిపోతుంది...

త్వరలోనే కొత్త సీరియల్ ఏదయినా మరొకటి ప్రారంభిస్తాము.

# లోకంపోకడ



"మరేం! యీయన కామ్రేడ్ సోమసుందరంగారే ... కాని యీ మధ్య మాస్కో సందర్శనానంతరం యిలా కాస్త లావుగానూ, దర్జాగానూ మారిపోయారు. అంతే."

# విషయానుక్రమణిక



మంత్రి వర్గీయులు
వ్యతిరేక వర్గీయులు
ఉత్తరప్రదేశ్‌లో
బాధ్యత
సాయం! సాయం!! కావాలి!
రాజాజీ
ద్రవిడస్థాన్
మేత ఎక్కువ పాడి తక్కువ
మూడో ప్రణాళిక
వ్యయం కోట్లలో

# జయపూర్ కాంగ్రెస్ విశేషాలు!

శ్రీకృష్ణ

ఈవారం పలుగురూ మాట్లాడుకుంటున్న విషయం జయపూర్‌లో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం. చాలా విషయాలలో అభివృద్ధిని ఈ సమావేశం బయల్పరచింది! అన్నిట్లోను మొట్టమొదటిది కాంగ్రెస్ ఇంకా నినాదాల మీదనే నిలుస్తోందనే విషయం! ప్రజాస్వామ్యం సామ్యవాదాలమీద వచ్చిన ప్రతిపాదనను కాంగ్రెస్ కార్యవర్గం ఆమోదించింది. ఇంకో ప్రక్క మన ప్రధానమంత్రి రాష్ట్ర మంత్రివర్గాలను, కాంగ్రెస్ అధిష్ఠానవర్గం ఎన్నికచేయటాన్ని సమర్థించారు. వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెస్ శాసనసభా పక్షాలలోని అభిప్రాయాలన్నిటిని అధిష్ఠానవర్గం ఆకళింపు చేసుకోటమే ఈ ఎన్నిక చేయటానికి హక్కుగా సమర్థించారు. నిజం చెప్పాలంటే "హైకమాండ్" అనే పదానికి సామ్యవాదం, ప్రజాస్వామ్యాలకు సంబంధం ఏమీలేదు. ఈ 'హైకమాండ్' అనేది పూర్వం యుద్ధం రోజులలో యుద్ధాన్ని నడిపించే ఒక నిర్వాహక మండలికి సూచకంగా పాశ్చాత్యులు పెట్టుకున్న పేరు. బ్రిటిష్ సింహాసనంతో కాంగ్రెస్ పోరాటం సాగిస్తున్న రోజుల్లో పత్రికలన్నీ కలిపి కాంగ్రెసుకు ఈ బిరుదు ప్రసాదించాయి. ఈ రోజుల్లో అంటే ప్రస్తుతం కాంగ్రెస్ పనిచేస్తున్న పద్ధతులలో ఆ పదాన్ని ఉపయోగించుకునే అవకాశమే లేదు.

ప్రజాస్వామ్యం అనేదానికి రెండు ముఖ్యమైన ఆయువుపట్లు ఉన్నాయి. సుశిక్షితం, సుసంఘటితమైన రాజకీయపక్షం. ఏకాభిప్రాయ మంత్రివర్గం. కాని, భారత ప్రజాస్వామ్యంలో ఉన్న బలహీనతల్లా ఒక్కచోటే. ప్రభుత్వాన్ని చేపట్టి నడిపించగల సుశిక్షిత ప్రతిపక్షం ఒక్కటి కూడా దేశంలో లేదు.

ఇంక ఏకాభిమత మంత్రివర్గం విషయం చూద్దాం. కాంగ్రెస్‌లో ముఠాతత్వం ప్రవేశించక ముందు ఏకాభిమతమే మంత్రివర్గానికి అవసరమైన అర్హతగా ఉండేది. ఇప్పటిరోజుల్లో ముఠా, వర్గతత్వాల అధిష్టానవర్గం ప్రోత్సాహం, మద్దతులు కూడా పొందుతూ ఉన్నాయి. 'విభజించి పాలించమనే' రోమన్ సిద్ధాంతాన్ని అనుసరించేందుకని కాంగ్రెస్ ముఠాతత్వాలను పెంపొందిస్తున్నంత కాలం, కాంగ్రెస్‌లో ముఠా తత్వా లున్నాయని, వాని నిర్మూలించాలని గోలపెట్టటం వృథా!

పార్టీలోని వివిధ వర్గాల వ్యక్తులతో రాష్ట్ర మంత్రిమండలులను అధిష్ఠానవర్గం ఎన్నుకునే పద్ధతికి ప్రధానమంత్రి మద్దతునిస్తూ ఇందుకుగాను గాంధీజీ సూక్తులు కొన్ని ఉదహరించుకున్నారు కూడా. అంటే శ్రీ నెహ్రూ మహాశయులు పార్టీలో ముఠాతత్వాలను గుర్తించటమే గాక బాహాటంగా సమర్థిస్తున్నారన్నమాట. అయితే ముఖ్య ప్రశ్న ఏమిటంటే తమ మంత్రివర్గాన్ని ఎన్నుకున్నప్పుడు కూడా ప్రధానమంత్రి మహాత్మాగాంధీ సూచనను ఎందుకు పాటించి పాలించలేదా అని? కాంగ్రెస్ యంత్రాన్ని అభివృద్ధిచేసే మిషతో తనమాట కెదురు తిరుగుతారనుకున్న వాళ్లందర్నీ మంత్రివర్గంలోంచి ఎందుకు గెంటివేస్తున్నట్లు? కాంగ్రెస్ పార్లమెంటరీ పక్షంకు విశ్వాసం లేకపోయినా, తనమాట వినేవాళ్లని, కొత్త మంత్రివర్గంలో ఎందుకు చేర్చుకున్నట్లు?

శ్రీ లాలా గుల్జారీలాల్ నందాకు పెద్ద బలమేం లేదు. అలాగే సర్దార్ స్వరణ్ సింగ్, దాసప్ప, ఎ. కె. సేన్, సత్యనారాయణసిన్హా, హుమయూన్ కబీర్, సుబ్రహ్మణ్యం, చవన్, చాగ్లాల స్థితి అంతే. మరి ప్రధానమంత్రి తనను విమర్శించే హనుమంతయ్య, మహావీర్‌త్యాగి, హరికృష్ణ మెహతాబ్‌ల వంటి వాళ్లను కూడా తమ మంత్రివర్గంలో చేర్చుకుని ఉండాల్సింది. మరుపు మానవసహజంట! ఒకప్పుడు కార్యనిర్వాహక వర్గాన్ని అఖిలభారత కాంగ్రెస్ సమావేశంలో ఎన్నుకున్నారు. ఒకప్పుడు కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉన్నప్పుడు ఈ ప్రధానమంత్రే, కాంగ్రెస్ కార్యవర్గాన్ని ఎన్నకునే పూర్తి అధికారం పూర్తిగా తమకే ఉండాలని వాదించారు మరి. అది సహజమూ, సరైంది కూడా.

శ్రీ నెహ్రూని గురించి బాధపడదగ్గ విషయం ఏమిటంటే ఆయన తాము ఒక అద్దాలమేడలో వున్నట్లు భావిస్తున్నారు. అందుకే ఆయన ఏ పక్కకు తిరిగినా తమ ప్రతిరూపమే కన్పిస్తుంటుంది.

ఈ ప్రపంచంలో తమకి తెలిసినంత ఎవరికీ తెలియదని ఆయన నమ్మకం మరి. ఈ సంవత్సరం మొదట తనను విమర్శించే వాళ్ళను "రక్షణ అంటే అసలు ఏమిటో తెలుసా!" అని కూడా అడిగేశారు. పాపం వాళ్లు మాత్రం ఏం చేస్తారు! రక్షణమంటే తమకేమీ తెలియదని ఒప్పుకుంటూనే అసలు మీకు తెలిసిందేమిటో చెప్పని నిలవేసి అడిగారు! చివరకు తేలిందేమిటి? రక్షణన్ని గూర్చి వాళ్ళ కెంత తెలుసో ఆయన క్కూడా అంతే తెలుసు!

గాంధేయ మార్గాల పేరిట కాంగ్రెస్ అధిష్ఠానవర్గం రాష్ట్రాల మంత్రిమండలుల నియామకాల్లో జోక్యం కలిగించుకునే హక్కును వినియోగించుకుంటుంటే, ఇటు ప్రధానమంత్రి 'కాంగ్రెస్ కార్యవర్గ నిర్ణయాలను, చర్యలను ప్రజాస్వామ్యం పేరిట కొందరు వ్యక్తులు ఎదిరించటం విడ్డూరంగా ఉంది' అంటున్నారు. అంతేకాదు, "ఈ ఎదిరించేవాళ్లంతా అసలు ప్రజాస్వామ్యమంటే ఏమిటో మొదట అర్థం చేసుకోవాలి. అధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ననుసరించే ప్రతివాడు నడుచుకోవాల్సిందే! అలా అని ప్రతిరోజు ప్రతి వ్యక్తినీ కలుసుకుంటూ ఉండాలని అర్థం కాదు. శాసనసపక్షంలో అధిక సంఖ్యాబలం తోటుతో ఒక వ్యక్తి ఎన్నికయ్యాడు, తనకు యుక్తమని తోచినదాన్ని చేశాడు. తన పనిని ఆమోదించమని రోజూ ప్రజలందరి వద్దకూ పోయి అడగటంలేదే! అసలు కాంగ్రెస్ తన అధికార వర్గాలలో క్రమశిక్షణను పెంపొందింపజేయాలి. కొన్ని కొన్ని సందర్భాలలో ఖచ్చితంగా, నిర్మొహమాటంగా చర్యలు తీసుకోవలసి ఉంటుంది."

ఇక్కడే చాలా సందేహాలు, ప్రశ్నలు ఏర్పడుతున్నాయి. శాసనసభకు ఎన్నికైన వ్యక్తి ప్రతి తడవా నియోజకవర్గంలోని వ్యక్తి దగ్గరకు పోయి, తన నిర్ణయాల మంచి చెడులను చెప్పమని అడగటం లేదనే మాట నిజమే. ఒక తడవ శాసనసభలకు ఎన్నికైన తర్వాత, అతడు దైనందిన కార్యక్రమాల విషయంలో స్వతంత్రుడని ప్రధానమంత్రి చెప్పటం సరైన సంగతే. అంతేకాదు, తనను ఎన్నుకున్న రాజకీయపక్షాన్ని వదలివేసి తన ఇష్టం వచ్చిన పక్షం చేరేందుక్కూడా అతని కవకాశం ఉంది! కాని 'తనకు యుక్తమని తోచింది చేసే' అవకాశం అతనికుందా అనేదే ఇప్పుడు ప్రశ్న! కాంగ్రెస్ తన "అధికార వర్గాల్లో ఇంకా ఎక్కువ క్రమశిక్షణ అలవరచాలని" ఒక ప్రక్క ప్రధానమంత్రే చెబుతున్నారు గదా. అంటే స్వతంత్ర సభ్యుడైతే తప్ప అతనికి కళ్ళు చేతులు కట్టేసి, పార్టీవిప్ అదుపులో వుంచేస్తారన్నమాట. పార్టీలో వ్యక్తి తన యుక్తాయుక్త విచక్షణననుసరించవచ్చని ప్రధాన మంత్రి అంటున్నారంటే ఆయన తమకు ప్రజాస్వామ్యంలో ఉన్న విజ్ఞతనంతా ప్రదర్శించటం లేదనే అనాల్సి వస్తుంది. శ్రీ ఎస్. కె. పాటిల్ తమ విచక్షణనుపయోగించి నడుచుకోవా లనుకున్నారు. ఆయన్ను పైకెత్తి నోరు మూయించేశారు. అదలా ఉంచండి. దేశంలో ఎవరి అధికారం అదుపుల్లోను లేని ఒక పదిమంది పెద్దల సంఘం చట్టరీత్యా ఎన్నికైన పార్లమెంటరీ పార్టీ నాయకుడు తన సహచరులను ఎన్నుకుందుకు రాజ్యాంగం ఇచ్చిన అవకాశంలో జోక్యం కల్గించుకోగల అధికారం ఉంటుందని ప్రధానమంత్రి ఏ ప్రజాస్వామ్య నీతిలో నేర్చుకున్నార్టా? ప్రధానమంత్రి ఒక ప్రశ్నవేసి, సమాధానంగా కాబినెట్ మంత్రి మండలి నిర్మాణంలో ప్రజాస్వామ్య సూత్రాలను నిర్వచించుకుంటూ

51వ పేజీ చూడండి

# తమిళ నాడు వీధి నాటకాలు

ఎస్. రామకృష్ణ

"తెరుకూత్తు"



కాళితో పోరుకు బయల్దేరిన గంగాదేవి

పండుగలు పర్వాలు జరపటంలో దక్షిణ భారతదేశం అందులోనూ ముఖ్యంగా తమిళనాడు చెప్పుకో దగ్గది. పండుగల రోజులలో పనిపాటల ప్రజలు సాధారణంగా కులాసాగా వేడుకలు జరుపుకోవాలను కుంటారు అలాంటి వేడుకల్లో ఒకటి వీధినాటక ప్రదర్శనలు. వీటిని ఇక్కడ 'తెరుకూత్తు' అనిపిలుస్తారు.



సౌగంధీ పుష్పాపహరణం కోసం బయల్దేరిన భీముడు మణిమాన్ అనే రాక్షసునితో పోరాడుట.

కారణ మేమిటంటే పల్లెల్లో నాలుగు రోడ్డులు కలిసేచోట ఒక పందిరి వేసి లేక ఇతర్త్రా ఏర్పాటు లతో ఈ నాటక ప్రదర్శనలు ఏర్పాటుచేస్తారు. మనం సీనరీ అనే వాటికి బదులుగా ఏవో అలంకృతమైన తెరలు వాడ్తారు. అవి లేనిచోట మామూలుగా గోడనే వెనుక తెరగా ఉపయోగించటం జరుగుతుంది. నటీనటులు మామూలు పద్ధతుల్లోనే ముదురు రంగులతో అలంకరించుకుంటారు. ఎవరికి వాళ్ళే వేషధారణమూ చేస్తారు. అంటే వేరే 'మేకప్‌మాన్' ఉండడన్నమాట.

ఏవైనా పురాణ కథలు ప్రదర్శించాల్సి వచ్చినప్పుడు, ఆయా పాత్రల స్వభావాన్ని వ్యక్తంచేసే బొమ్మలను బురఖాగా ధరించి ఆడేవారు. ఈ పురాణ కథలు సాధారణంగా రామాయణం, మహాభారతంల నుంచే ఎన్నుకోవటం జరుగుతుంది.

ఈ 'తెరుకూతు' (నాటకాల)లో పాల్గొనే వాళ్ళందరు కిరాయి నటులే. అంటే అదే వృత్తిగా పెట్టుకున్నవాళ్ళన్నమాట. అప్పుడప్పుడు ఆడవాళ్ళు కూడా పాల్గొనటం కద్దు. వాళ్ళు లేకపోతే పురుషులే స్త్రీ పాత్రలు ధరిస్తారు. అందుకని ఈ నటులకు స్త్రీపాత్రల నభినయించటంలో శిక్షణ నిస్తారు. స్త్రీ పాత్రలు ధరించినప్పుడు ఆయా పాత్రల ముఖ్య లక్షణాలతో పురుషులు ఆహార్యాన్ని సమకూర్చుకుంటారు.

ఈ 'కూతు' ప్రదర్శనాలు సాధారణంగా రాత్రి తొమ్మిది ఆ తర్వాతనే ప్రారంభమౌతాయి. ముగిసేటప్పటికి కోడి కూస్తుంది. మరీ పెద్ద కథలు

## "ఈ వీధి నాటకాలలో నేపథ్య గాయకులు వుంటారు."

ప్రదర్శించాల్సి వస్తే క్రితం రాత్రి ఆగిన ఘట్టం నుంచి ఆ రాత్రి ప్రదర్శనం ప్రారంభిస్తారు. ఇలా ఒక్కొక్క తడవ ఈ వీధినాటకాలు వారం రోజుల దాకా పట్టటం కద్దు. ఒక్కొక్కప్పుడు విడివిడి ప్రదర్శనాలు కూడా వారందాకానూ ఉంటాయంటే ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. సాధారణంగా పల్లెల లలో వినోదాలు, వేడుకలూ పది రోజులదాకా సాగు తాయి.

ఒక ఊళ్లో విద్యుచ్ఛక్తి లేదనుకోండి! అలాంటి చోట్ల యీ వీధి నాటకాలు పెట్రొమాక్సు దీపాల సహాయంతో కొనసాగిస్తారు. ఈ ప్రదర్శనాలకు ఊరు ఊరే కదిలివస్తుంది. పిల్లా పాప చిన్నా పెద్దా అందర్నీ ఈ ప్రదర్శనాలు బాగా ఆకర్షిస్తాయి. ఈ నాటకాలలో ఉపయోగించే కొంచెం మొరటరకం హాస్యం వాళ్లందరికి అర్థమౌతుంది గనుక చాలా బాగా ఆనందిస్తారు. ఇందులోని పాటలు, పద్యాలకు తెరవెనుక ఉండే గాయకులు పాడ్తారు. నటులు కూడా వాటికి తగ్గట్టు నోరు మెదుపుతూ అభినయిస్తారు. ★



నరసింహుని ప్రహ్లాదుడు స్తుతించుట.

## కళాకారులూ విద్యార్థులే

కళాకారులైన సినిమా నటులు ఎంత పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొన్నవారయినప్పటికీ, విద్యార్థులే నని ప్రతినిత్యమూ వారు కళామతల్లికి సేవలు చేస్తూ నేర్చుకోవలసింది, ఏదో కొంత ఉంటుం దని నటులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారు చెప్పారు.

అలా విశ్వసించినవాడే ఉత్తమమైన ఫలితాలు సాధించి, మానసికంగాను, వైజ్ఞానికంగాను ప్రాపంచి కంగాను పతాక స్థాయిని అందుకోగలరని కూడా ఆయన అన్నారు.

నిజాం కళాశాల, సాలార్‌జంగ్ హాలులో జరి గిన సమావేశంలో తెలుగు సారస్వత సమితికి శ్రీ గుమ్మడి ప్రారంభోత్సవం చేశారు.

వెనుక బెంచీలమీద కూర్చున్న విద్యార్థుల మధ్య మధ్యలో—అంటే అమ్మాయిలు ప్రైజులు అందుకొంటున్నప్పుడు కొంత చప్పట్ల సంగీతం వినిపించినా, మొత్తంమీద సభ హుందాగానే జరి గింది.

గుమ్మడి వెంకటేశ్వరరావు దాదాపు 40 నిమి షాలు ప్రసంగించారు. ఈ నలభై నిమిషాలసేపు ఒక్కరూ కూడా కిక్కురుమనలేదు కాని, విశేషం ఏమంటే గుమ్మడి తమ ప్రసంగంలో కొన్ని జీవి తానుభవాలను, వాస్తవిక దృక్పథంలోనుంచి ఉల్లే

## హైదరాబాద్ సినిమా వార్తలు

ఖించారు. చివరకు అవి ''విట్స్''గా మారి అక్కడ ఉన్న అందరి హృదయాలను ''హిట్'' చేశాయి. గుమ్మడి మాత్రం స్థైర్యమూ, ధైర్యమూ కోల్పో లేదు. ఆయినా, అలా కోల్పోతే వారు ''గుమ్మడి'' ఎందుకవుతారు?

ఈ సమావేశం ఇంత హుందాగా జరగటానికి కేవలం నారాయణరెడ్డిగారే కారణం. చిత్ర పరి శ్రమలో కవులుగా, రచయితగా పేరొందిన సి. నారా యణరెడ్డిగారు ఇక్కడ తెలుగు శాఖలో 'రీడర్'గా పని చేస్తున్నారు.

'అన్నపూర్ణ', 'ఆరాధన' లాంటి అత్యుత్తమ చిత్రాలను ప్రేక్షక లోకానికి అందించి, పత్రికల చేత, ప్రజలచేత మన్ననలను పొందిన జగపతి పిక్చర్సు వారు మరో చిత్రాన్ని హైదరాబాదులోనే తీస్తు న్నారు.

ఆంధ్రుల రాజధాని నగరంలో తెలుగు చిత్ర పరిశ్రమ బాగా అభివృద్ధి చెందాలని కోరుకొనే వారిలో జగపతి పిక్చర్సు వారు కూడా ఒకరన్నది విన్నదేవాం.

ఔట్—డోర్ దృశ్యాలను చిత్రీకరించేందుకు మొన్ననే ఊటీ వెళ్లొచ్చారు. వెన్నెలరాజా లాంటి కథా నాయకుడు అక్కినేని నాగేశ్వరరావు, కలువల రాణిలాంటి నాయిక బి. సరోజాదేవి ఈ చిత్రానికి కొత్త వెలుగును చేకూరుస్తున్నారు.

ఔట్—డోర్ (ఊటీ) లో తీసిన రెండు 'ప్రేమ ఘట్టాలను' మొన్ననే తెరమీద ప్రత్యేకంగా చూచే అవకాశం లభించింది. నిర్మాత శ్రీ రాజేంద్రప్రసాద్ మా విలేఖరిని తీసుకెళ్లి ఈ రెండు ఘట్టాలను తెరమీదవేసి చూపించారు.

అందంగా ఉంటూ, ఆహ్లాదాన్ని, ఆనందాన్ని కలిగించే ఊటీలో ఈ దృశ్యాలను చిత్రీకరిం చటం ఈ కొత్త చిత్రానికి నూతన శోభను చేకూర్చగలదు.

కలువరేకుల్లాంటి రెండు కన్నులలో శతకోటి అందాలను దాచుకొన్న బి. సరోజాదేవి, మళ్లీ వెన్నెల రాజైన శ్రీ నాగేశ్వరరావుతో నటించటం— అందు లోనూ హృదయ రంజకమైన ప్రేమ ఘట్టా లలో, ఇరువురి హృదయాలు ఏకమయిపోవటం— మళ్లీ ప్రేక్షకులకు 'పెళ్లికానుక' దృశ్యాలను జ్ఞప్తికి తెస్తాయి.



"కలవారి కోడళ్ళు"లో గీతాంజలి.

# హైదరాబాద్ సినిమా

ఇంతవరకు మొత్తం 11½ రీళ్లను చిత్రీకరించారు. మళ్లీ నవంబరు 19 నుంచి సారథీ స్టూడియోస్‌లో షూటింగ్ ప్రారంభం అవుతున్నది.

అక్కినేని, సరోజాదేవి గారలు నాయకా, నాయికల పాత్రలను పోషిస్తున్నారు. వీరుగాక, జగ్గయ్య, రేలంగి, రమణారెడ్డి, కన్నాంబ, గిరిజ, సూర్యకాంతం, నాగయ్య, గుమ్మడి (గెస్టు ఆర్టిస్టు), హేమలత, కుటుంబరావు ప్రభృతులునటిస్తున్నారు.

పాటలు, మాటలు ఆత్రేయగారు వ్రాస్తున్నారు. బినోద్ ఛటర్జీగారి బెంగాలీ చిత్రం—అగ్ని సంస్కార్‌ను ఆధారం చేసికొని, తెలుగులో నిర్మిస్తున్నారు. దేశవ్యాప్తంగా హక్కులను జగపతి వారే పొందారు.

శ్రీ వి. మధుసూధనరావు దర్శకత్వం వహిస్తున్నారు.

* * *

సారథీ స్టూడియోస్ ఆవరణలో ఒక అందమైన అమ్మాయి 'బ్యాడ్మింటన్' ఆడుతుండగా అక్కడికి వెళ్లాను.

అసలే అందమైన అమ్మాయి .... చేతిలో అందమైన 'రాకెట్' .... అంతేకాదు, ఆ అమ్మాయి అందమైన పంజాబీ దుస్తుల్లో ఉన్నది. ఇన్ని రకాల అందచందాలు కలిసేసరికి సారథీ స్టుడియోస్ అందమే అవధులు దాటిపోయింది.

అప్పుడే షూటింగు అయిపోయింది ''కొంచెం 'రిలాక్సింగ్' మంచిదని ఆడుతున్నాం'' అన్నది ఆ అమ్మాయి నవ్వుతూ.

ఆ నవ్వు ఇంకా అందంగా ఉన్నది. ప్రబంధాలలో వర్ణించిన 'పద్మినీ' జాతి స్త్రీలను స్ఫురణకు తెచ్చింది ఆ నవ్వు. లక్ష 'మెర్క్యురీ' లైట్లను వెలిగించినట్లున్నది..... ''మరో రెండురోజు లుంటున్నారా'' అని అడిగాను. ''ఎక్కడి రెండురోజా అండీ .... మరో గంటలోనే బొంబాయి ప్రయాణము. ఎనిమిది గంటలకే విమానం బయలుదేరుతుంది'' అన్నదా అమ్మాయి.

ఆ మర్నాడే బొంబాయిలో హిందీ పిక్చరు షూటింగు ప్రారంభ మవుతున్నదట. చిత్రంపేరు ''బేటీ—బేటే''. తెలుగు చిత్రం ''సంతానం'', హిందీలో తీస్తున్నారు. అందులో ఈ అమ్మాయికి 'టైటిల్' కారెక్టరు ఉన్నదట. ఇంకా బి. సరోజాదేవి, సునీల్‌దత్, సుధేశ్‌కుమార్ ప్రభృతులు నటిస్తున్నారు. అందుకే ఆ అమ్మాయి బొంబాయి ప్రయాణం.

ఔదార్యానికి కూడా పెట్టింది పేరు ఆ అమ్మాయి. పోయిన నెలలో అస్తమించిన ఒక కళాకారుని కుటుంబానికి 25 వేల రూపాయిలను విరాళంగా యిచ్చింది ఆ అమ్మాయి.

అసలే అందమైన అమ్మాయి. అందులోను అందమైన పంజాబీ దుస్తులలో, అందమైన మహానగరం బొంబాయికి వెళుతున్నది. ప్రస్తుతం మూడు భాషల చిత్రాలలో నటిస్తున్నది.

ఆ అమ్మాయి—సారీ—ఆ నటీమణి మనమంతా ప్రతిరోజూ సినిమాల్లో చూస్తున్న ''కుమారి జమున'' అని ఎంతమంది పాఠకులు ఊహించగలిగారు ?

వాశిరాజు ప్రకాశం. ★

# సరాగమాల

## వి ఎ కె రంగారావు

క్రిందటిమారు తిరుపతి వెళ్ళినప్పుడు ఒక చక్కని శాస్త్రీయ సంగీత కార్యక్రమం వినడానికీ, ఒక సంగీత విద్వాంసుని కలుసుకోనడానికీ అవకాశం కలిగింది.

సంగీత కార్యక్రమం పశు భర్తృక శాఖవారి కళాశాల వసతి గృహంలో ఏర్పాటు చేయబడినది. పాల్గొన్నవారు డి. పశుపతి గాత్రం, పాల్ఘాట్ కృష్ణన్ మృదంగం. వీరిరువురి మేళవింపు సుమారు ఒక గంటసేపు తమ శాస్త్ర ప్రదర్శనతో ప్రేక్షకులను అందులో పశువైద్య విద్యార్థులను సమ్మోహ పరచిందంటే అతిశయోక్తి లేదు. సర్వసాధారణంగా జంగ్లీ పాటలు మెచ్చుకొనే యువకులతో సెభాసనిపించుకున్నారంటే పశుపతిగారి గాత్ర మహిమ మీరే ఊహించుకోండి.

పశుపతి కళాక్షేత్రంలో కీర్తిశేషులు మైసూరు వాసుదేవాచార్ వారి దగ్గర సంగీతం అభ్యసించారు. వీరే వారి ప్రథమ శిష్యులని కూడ చెప్పవచ్చును. ఆ తరువాత వీణా వాద్యాన్ని కూడ నేర్చుకున్నారు. రుక్మిణీదేవి నృత్య ప్రదర్శనలకు పాడి అటువంటి పాటలు పాడటంలో విశేషానుభవం, అశేష ప్రజ్ఞ సంపాదించుకున్నారు. ఇప్పుడు శ్రీ వెంకటేశ్వర సంగీత కళాశాలలో సంగీతోపాధ్యాయునిగా ఉన్నారు.

ఆనాడు పశుపతి పాడిన మొదటిది హంసధ్వనిలో వినాయక స్తుతి. దురితకాలంలో చివర నాలుగు సంగతులు వేసేసరికి శ్రోతలు ఆవురావురుమని కూర్చున్నారు. వెంటనే ఆలాపన ప్రసక్తి లేకుండా బహుదారిలో "బ్రోవ భారమా" యెత్తుకొని మరొకసారి వీనుల విందొనర్చారు. ఆ తరువాత ఖరహరప్రియలో "పక్కల నిలబడి" పాడినా విజయశ్రీలో "వరనారద" పాడిన విన్నవారికి ఒకే సమ్మోహనరాగం వినిపించింది. గాత్రంలో కేవలం శాస్త్ర ప్రదర్శనం, పాండితీ ప్రకర్షలే లేదు. వీటన్నిటికీ మించిన హాయి ఉన్నది.

ఆ పిమ్మట నృత్య ప్రదర్శనకు వారు పాడిన ఆనందభైరవి పదం "మంచి దినాము నేడే" సురటి తిల్లానా పైవిధగా మెప్పించటమే గాక శాస్త్రంకన్న శృంగారమే ఎక్కువగా ఉన్న నృత్యానికి ఒక అంతస్తు నిచ్చాయి. పై గానానికి సమయానికి తగినట్లు ఒకచో మృదువుగా మరొకచోట మందరంగా నేర్పుతో మృదంగం వాయించారు పాల్ఘాట్ కృష్ణన్.

*　　*　　*

ఎన్నాళ్ళనుండో కలుసుకోవా లనుకుంటున్న శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి పరిచయభాగ్యం కుమారి కాంచనమాల (నృత్యోపాధ్యాయురాలు, ఎస్వీ సంగీత కళాశాల, తిరుపతి) వలన కలిగింది. వీరితో ఉన్న గంటసేపులోను ఎన్నో విషయాలను తెలిపారు. మరెన్నో సంగతులు విడమరచి చెప్పారు.

మధుర తిరుమల నాయకుని కొలువులోని ఘనం శీనయ్య వ్రాసిన కురంజి రాగ పదం "శివదీక్షా పరురాలనురా" అందరికీ తెలిసినదే. ఇంత ప్రచారంలేని మరొక పదం, శీనయ్య కృతమే, "ఎన్నడు లేనట్టి చిన్న పనులను చేసియున్న దానను కానమ్మా" అన్నది (నాట కురంజి త్రిపుట చాపు) పాడి వినిపించారు. వీరి ఉద్దేశంలో తెలుగు పదాలలో లభ్యమైన వాటిలో అతి ప్రాచీనమైనవి అన్నమాచార్యుల వారివే. పురందరదాసు కన్నడ భాషలో రచించిన దేవర నామాలూ ఈ సంగీత పద్ధతికే చెందుతవని వీరి అభిప్రాయం తెలుగు పదాల్లో భావశృంగారం దేవరనామాల్లో భావం, ఆధ్యాత్మిక భక్తి అన్న సంగతిని వారే వక్కాణించారు.

పురందరదాసు, అన్నమయ్య, వారి వారి గురువులైన వ్యాసరాయలు, శ్రీపాద రామస్వామి సమకాలికులు కావచ్చును. వారివారి సంగీత రచనలలో పోలిక లుండటం పరస్పరానుకరణ అనటానికి సాధ్యం కాదు గాని అనాటి దేశీయ సంగీత రీతుల అనుసరణ మాత్రం తప్పక అయి ఉంటుందని అన్నారు.

కీర్తనలకు, పదాలకు రాగ ప్రస్తారంలో తేడా ఏమాత్రం ఉంటుందని అడిగితే ఈవిధంగా అన్నారు: ఒకే రాగంలో ఉన్న నాలుగు త్యాగరాజ కీర్తనలు ఒకే తాళంలో ఉన్నా సరే, ఒకే మాదిరి ఉంటాయనటానికి వీల్లేదు. మనకు తెలిసిన కొద్దిపాటి కీర్తనలను బట్టి అలా ఉండవనటానికే ఎక్కువ అవకాశం ఉంది. కాని పదాలలో అలా కాదు. ఏ రాగంలో పదం ఉన్నా, అది సాగే క్రమం చాలమట్టుకు ఒకే పద్ధతిలో ఉంటుంది. ఒక క్రొత్త పదం యిచ్చి రాగం చెప్పితే ముందు నెమకలు ఊహించుకొని వరస వేయవచ్చును. ఆ వరస ఆ పదకర్త అనుకున్నదానికి చాలా దగ్గరగానే ఉంటుంది.

*　　*　　*

ఆ తడవ తిరుపతి నుంచి వచ్చేటప్పుడు శ్రీమతి ఇ. ఇం. తెడాబారమ్మగారితో కలిసి రావటం సంభవించింది. వీరు ఒకప్పుడు రేడియోలో వీణ కచ్చేరీలు చేస్తుండేవారు. తిరిగి వచ్చేటప్పుడు శహనా రాగంలో మువ్వ గోపాల పదం "అత్తవారూరికి అంపేరు మావారు" పాడి వినిపించారు. ఇంతకుముందు ఎప్పుడో, పదిహేన్నేళ్ళ క్రితం వీరి పాట విన్నాను. మళ్ళీ ఇదే వినటం. భలే సరదా వేసింది.

*　　*　　*

ఈ నెల మొదటివారంలో మద్రాసు సౌందర్య మహాల్లో శ్రీ కృష్ణతులాభారం నాటకం వేశారు. శ్రీయుతులు పృథ్వి, సి. రామచంద్రశర్మ, వి. వెంకటేశ్వరరావ్, కృష్ణ, నారద, వసంతక పాత్రలు, శ్రీమతులు కృష్ణకుమారి, సక్కుబాయి సత్యభామ, రుక్మిణి వేషాలు ధరించారు. అందరూ బాగానే పాడారు, నటించారు. కాని నాటకం మాత్రం చాల అసంతృప్తి కలిగించింది.

దీనికి ఒకే ఒక కారణం. ఇన్నేళ్ళుగా ఈ నాటకం చూస్తూ, ఆనందిస్తూ వచ్చిన పాటలు ఆనాటి ప్రదర్శనలో లేకపోవటం, కొత్తవి ఉండటం వాటి స్థానే యింకా బాధ కలిగించింది.

కొత్త పాటలను వ్రాసింది పీటూరి, కోట సత్య రంగయ్య శాస్త్రి. వీరి రచనలు బాగానే ఉన్నవి. వాటికి డి. బాబూరావు ఏర్పరచిన వరసలూ బాగానే ఉన్నాయి. కాని, ఫలానా పాటలను పాతవే కానిండి, విందామని వెళ్ళేవారికి కొత్త పాటలు వింటే చిరాగ్గానే ఉంది మరి. వసంతకుడు పాడవలసిన "ఎవరికి తరవా" లేనేలేదు. దాని బదులు నళినితో సినిమా పద్ధతిని ఒక యుగళగీతం. నళిని పాత్రధారిణి కుమారి లీలారాణి చలాకీతనం కొన్ని కమ్ముకుపోయింది గాని ఈ పాటలో లేది వెళ్ళేవారు కొంతమందైనా. చివరన ఉండవలసిన "నాథుడే జగన్నాథుడే" లేదు. పడగ్గదిలో కృష్ణుడు పాడవలసిన అనునయగీతం లేదు. పోనీ ఇన్ని పాత పాటలు తీసివేసి ఇన్ని కొత్త పాటలు పెట్టారుగదా, ధైతా గోపాలం మనోహర సృష్టి "నందగోపాలుడే తనవాడైతే" పెట్టారా ? లేదు. ఇంకెందుకా కొత్త పాటలు ?



పాల్ఘాట్ కృష్ణన్ మృదంగం
డి. పశుపతి గాత్రం

ఫలానా నాటకం వేస్తున్నారంటే ఆ నాటకంలో ప్రసిద్ధికెక్కిన అన్ని పాటలు ఉండాలి. లేకపోతే ఆ పాటలు లేవు మా తెలివిని ఉపయోగించి కొత్తవి వ్రాయించుకున్నామోహో అని ప్రకటనలైనా చేయించాలి. అటువంటప్పుడే నావంటివారు వెళ్ళటం నిరుత్సాహపడటం నిప్పులు చెరగటం, అన్నీ తప్పేది!

★

# రాజధాని కబుర్లు

సప్తాహాలు, స్మారక దినోత్సవాలు, సమ్మెలు, హర్తాళ్లు, ఊరేగింపులు, ఉపన్యాసాలు, నలహాలు, నిరసన ప్రకటనలు, వీటితో విశాలమైన హైదరాబాదు ఆవరించుకుపోయింది. ఎన్నడో గతించిన సర్దార్ వల్లభాయ్ పటేల్‌ను మళ్లీ సంస్మరించుకున్నాం. మానవునికి మరుపు శక్తి ఎంతైనా ఉంది. ఇట్టే ఎన్ని విషయాలైనా మరిచిపోగలుగుతాం. నిజానికి మరుపు శక్తే లేకపోతే గతంలో పడ్డ బాధలన్నింటినీ గుర్తుకు తెచ్చుకుంటూ, జీవితమంతా అంధకార బంధురమయి పోవాల్సిందే! అయితే సర్దార్ పటేల్ స్మృతిపథంలో అడుక్కుపోవాల్సిన వ్యక్తి కాదు. ఆయన పేరు ఉచ్చరిస్తేనే, నూతనోత్తేజం కలుగుతుంది. పూర్వపు హైదరాబాదు రాష్ట్ర ప్రజలకు అత్యంత సన్నిహితుడు. ఆయన జన్మదినోత్సవ సందర్భంగా లాంఛనప్రాయంగానే సమావేశాలు జరిపారు. ఆయనపట్ల భక్తి శ్రద్ధలు ప్రకటించుకోవటానికి కేవలం భారీఎత్తున ఊరేగింపులు, ఉపన్యాసాలు జరిపినంతమాత్రాన బాధ్యతలు తీరినాయని కాదు. ఇంతకంటే ఉదాత్తమైన సంస్మరణ అవసరం.



హైదరాబాదు అమెరికన్ సంస్కృతీకేంద్రం
కొత్త ఆఫీసర్ డొనల్డ్ మేతెస్

సరే, సహకార సప్తాహాలు ఉండనే ఉన్నాయి. ఏటేటా జాతీయ సహకారోత్సవాలు జరపటం ఈ వారంలో సహకారోద్యమాన్ని గురించి కొండంతలుగా చెప్పుకొనటం పరిపాటే! ఈ ఏడు ఈ సప్తాహంలో కొన్ని విసురులు వచ్చిపడ్డాయి. ప్రతిపక్ష పార్టీలు కొన్ని సహకారం అనే పేరట ఏరకంగా ఈ ఉద్యమం వెర్రి తలలు వేసుకుపోతోందో, దానికి ప్రభుత్వంవారు ప్రత్యక్షంగాను, పరోక్షంగానూ ఎంతవరకు బాధ్యులో ఏకరువు పెడుతూనే ఉన్నాయి. నిజమయినప్పుడు మనం మాత్రం వెనుకంజ వేయుట మెందుకని కొంతమంది కాంగ్రెసు పెద్దలే నిశిత విమర్శలకు పూనుకున్నారు. ఈ సప్తాహోత్సవం ప్రారంభిస్తూ శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారే సహకార వ్యవసాయం యొక్క సిద్ధాంతాల్ని గురించి తన అనుమానాల్ని వెల్లడించారు. మన దేశ పరిస్థితులకు అలాంటిది ప్రయోజనకారి కాదనే సందేహాన్ని వెలిబుచ్చారు. తన అనుభవంలో ఇది జయప్రదం కాలేదని కూడా స్పష్టపరిచారు.

ఇన్ని సంవత్సరాల్నుంచి సహకారోద్యమం దేశంలో ప్రబలంగా ఉన్నప్పటికీ, సామాన్య రైతు ఈనాటికి కూడా తన అవసరాలకు, ఎక్కువ వడ్డీమీద, కాబూలివాళ్లమీద ఆధారపడుతున్నాడే గాని, ప్రభుత్వమువారు అలాంటివారికి తక్కువ వడ్డీతో అప్పు యిచ్చే పద్ధతులను సక్రమంగానూ, సమర్థవంతంగానూ అమలుపరచలేక పోతున్నారు. అనుకున్నంతగా ఈ ఉద్యమం పెరగకపోగా ప్రజల్లో ఈ ఉద్యమం పట్ల విశ్వాసం సన్నగిలిపోతోంది. పాలపిండి, ఎరువులు కొన్నిచోట్ల ధాన్యం కూడా సహకార సంస్థల ద్వారా, చౌకగా ప్రజానీకానికి అందకపోగా చీకటి బజార్లోకి ధారాళంగా వెడుతున్న సందర్భాలు అనేకం ఉన్నాయి. ప్రభుత్వంవారు అతి శోచనీయంగా, వీటిని అదుపులో పెట్టలేని స్థితిలో ఉండిపోయారు. ఈ మాటలన్నీ అన్నది ఎవ్వరో కాదు. ఖాదీ గ్రామీణ పరిశ్రమల బోర్డు అధ్యక్షులు శ్రీ పి. తిమ్మారెడ్డిగారే!

సహకార సంస్థల తీరు తెన్నులు యిట్లా ఉన్నాయి. కాంగ్రెసు పెద్దలు మహాసభల్లోనూ, ఇతరత్రానూ 'సోషలిజం' సోషలిజం అని ఒకటే అరుపులు. కాని వారు తీర్మానించుకున్న సోషలిజంలో చేనేత పరిశ్రమలకు ఇతర కుటీర పరిశ్రమలకు తగిన స్థానం లేనేలేదు. నాలుగు కోట్ల జనాభా ఆధారపడి ఉన్న యీ పరిశ్రమలను చిన్నచూపు చూడటాన్ని నిశితంగా విమర్శించారు. దీనికి తార్కాణంగా ఎన్నో లెక్కలు కూడా చూపించారు. ఆంధ్ర చేనేత కాంగ్రెసువారు ఈమధ్య యిక్కడ కలుసుకున్నప్పుడు వ్యక్తపరచిన అభిప్రాయాలు.

భూమిమీద ఇన్ని విమర్శలు వచ్చిపడుతున్నా కాంగ్రెస్‌వారికి చీమ కుట్టినట్టయినా ఉండదు. పైపెచ్చున రాష్ట్ర ప్రభుత్వంవారు ఆకాశంలోకి ఎగిరిపోవాలని ఆలోచనలు చేస్తున్నారు. రెండున్నర లక్షలు ఖర్చుపెట్టి, అయిదుగురు కూర్చోటానికి వీలైన ఒక విమానాన్ని కొనటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారు. తక్కువ వ్యవధిలో ఎక్కువ స్థలాలకు వెళ్లి స్వయంగా పర్యవేక్షించవలసినవి పూర్తిచేసుకోవచ్చు. ఇంకా వరదలు వచ్చినప్పుడు పైనుంచి నిర్భయంగా నష్టపడిన ప్రదేశాన్ని చూడచ్చు. ప్రభుత్వం అధిపతులకు అవసరం లేనప్పుడు యితర పెద్దమనుషులకు కూడా ఈ విమానాన్ని యిస్తారుట. బాగానే ఉంది.

హైదరాబాద్ పురపాలక సంఘంవారు మురికివాడలను నిర్మూలించటానికి గట్టి ప్రయత్నమే చేస్తున్నారు. చిక్కడపల్లి, నారాయణగూడా, హిమాయత్ నగర్ ఇంకా ఇతరచోట్ల ఈ మురికివాడలు చాలా ప్రబలంగా ఉండిపోయినాయి. అనుమతి లేందే కట్టిన ఈ తాత్కాలికపు కట్టడాలను తీసెయ్యాల్సిందని నోటీసులు యిస్తే దీన్ని ప్రతిఘటించడానికి మురికివాడల నాయకుడు తీవ్రమైన ఆక్షేపణ తెలియజేస్తూ ఒక ప్రకటన జేశాడు. మొత్తంమీద రాజధాని నగరంలో ఎనభై వేల దాకా సుమారు ఈ మురికివాడల్లో నివసిసున్నవారున్నారు. ఈ నోటీసుల వలన వాళ్లందరికీ ఇళ్లూ, వాకిళ్లూ లేకుండా పోతాయి. ఇది అక్రమం, అన్యాయం అని వాళ్ల వాదన.

ఇలాంటి సంఘర్షణలు చాలా జరుగుతూనే ఉన్నాయి, ఒకరినొకరు అర్థంచేసుకోక పోవటం వలన ఒకరికొకరు బద్ధ వైరులని అనుకోవటంవలన ఇలాంటివే తీవ్రరూపం కూడా దాలుస్తున్నాయి. కుల,మత,భాష, ప్రాంతీయ తగాదాలుండనే ఉన్నాయి. వర్గ పోరాటాలనేవి అన్నిటికంటె నికృష్టమైనవే. ఈ వర్గాలు కూడా చాల చిత్ర విచిత్రంగా ఏర్పడుతున్నాయి. చార్‌మినార్ నుంచి వస్తున్న బస్సులో యిద్దరు కుర్రాళ్లు అమాంతం ఎక్కారే అనుకోండి, అది కూడా బస్సు నడుస్తున్నప్పుడు! అంతమాత్రం చేత కండక్టరు బస్సును ఆపేసి వాళ్లను దిగమంటే ఒకవిధంగా ప్రతీకార చర్యగానే కనబడుతుంది. తప్పొప్పుల నిర్ణయం అటుంచి ఆ యువకులు, కండక్టరు ముష్టియుద్ధం చెయ్యటము వలన నగరంలో ఉన్న బస్సులన్నీ ఆగిపోవాల్సిందేనా! కండక్టరుకు దెబ్బలు తగిలినమాట వాస్తవమయితే తగిన చర్య వాళ్లిద్దరిమీదా తీసుకుంటే సరిపోయేదే! అట్లా జరగలేదే! రాజధాని నగరం మొత్తంమీద నడుస్తున్న బస్సులన్నీ సమ్మె చేసినాయి. ఇంత హఠాత్తుగా, నగరంలోని బస్సులన్నీ ఆగిపోవటంవలన బస్సు కండక్టర్లు, డ్రైవర్లు ఎంత కలిసి కట్టుగా ఉన్నారో వ్యక్తం కావచ్చు. కాని ఇది క్రమశిక్షణకు పూర్తి విరుద్ధం. పైగా ఇద్దరు ప్రయాణీకు లెవరో అవ్యక్తంగానూ, అక్రమంగానూ ప్రవర్తించారనే మిషతో బస్సు కండక్టర్లు, డ్రైవర్లు అందరి ప్రయాణీకులమీద కక్ష పూనటం దారుణం. ఇలాంటి మనస్తత్వాన్ని ఎవరూ హర్షించరాదు. సహించరాదు. చట్టాన్ని ఉల్లంఘించినవారిని శిక్షించటానికి సహాయపడాలి. ఎలాంటి చర్యలు తీసుకున్నా అలాంటి దానికి దోహదకారిగా ఉండాలి. అర గంటలపైపు బస్సు నడక స్తంభించిపోయేటప్పటికి ఉద్యోగస్థులకు, బడిపిల్లలకు ఇంకా ఇతరులకు ఎంత ఇబ్బంది కలిగిందో ఊహించటం కష్టం. పైగా ఈ సమ్మె హఠాత్తుగా వచ్చిపడిందేను. ఏమైనా రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ వారు ఈ సంఘటన గూర్చి దర్యాప్తు చేస్తామన్నారు!

—ఐ. ఎల్. ఎన్.★

వనితాలోకం

# వెజిటబుల్ పలావ్

చల్లా సావిత్రి

వెజిటబుల్ పలావు అంటే కేవలం కాయగూరలతో తయారుచేసే పలావన్నమాట. కాబట్టి దీనికి కావలసినవి ముఖ్యంగా కేరట్, బీట్‌రూట్, బంగాళాదుంపలు : ఇవిగాక ఇంకా చాలా రకాల కాయగూరలు ఉపయోగించుతారేమో ? నాకు తెలీదు ! కాని మన కందుబాటులో నుండే ఈ మూడు రకాల దుంపలతో గూడా కమ్మటి కాయగూరల బిరియానీ తయారు చేసుకో వచ్చును! 1. శేరు బియ్యం బిరియానీ తయారయ్యేందుకు, కావలసిన వస్తువులు, కొలతలు ఇస్తాను. దీన్నిబట్టి, కొలతలు మార్చి, చేసుకోవచ్చు.

1. శేరు బియ్యం. నాల్గు కేరెట్ దుంపలు. నాల్గు బీట్‌రూటులు. పావుపిస్సెగ్గాని రెండు సేర్లు గాని బంగాళాదుంపలు. మీకు తేలిగ్గా అర్థమయేందుకు, ఈ కొలతలు ఇచ్చానుగాని, వీటిల్లో ఓ మంప తక్కువ ఎక్కువలైనా మరే ప్రమాదమూ ఉండదు. ఇక మసాలా దినుసులు : ½ తులం లవంగాలు. ½ తులం యాలకులు ½ తులం దాల్చిన చెక్క. ఒక అణావి గసగసాలు ఒక అణావి ధనియాలు ఓ అణా అల్లం రెండు చిన్న ఉల్లిపాయలు (తెల్లగడ్డలు, లేక వెల్లుల్లి), రెండు శేర్లు ఎర్రగడ్డలు (నీరుల్లిపాయలు) ఎనిమిది లేక పది పచ్చిమిరపకాయలు. నాల్గణాలది జీడిపప్పు. నాల్గణాల నాన్‌రొట్టె (బన్) 1. పావు నెయ్యి లేక డాల్డా.

మూడురకాల దుంపలూ శుభ్రం చేసుకొని పెద్ద నిమ్మకాయంత సైజులో ముక్కలు కోసుకొని వారగా పెట్టుకోవాలి. ఆ చేత్తోనే ఒక శేరు నీరుల్లిపాయల్ని పచ్చిమెరప కాయల్ని సన్నగా, నిలువుగా కోసి ఉంచుకోవాలి.

లవంగాలు, యాలక్కాయలు, దాల్చిన చెక్క ఇవి మూడూ అరతులమేసి తెప్పించాం గదూ ! వీటిల్లో కాసిని అంటే ఓ ఎనిమిది లవంగాలు, ఎనిమిది యాలకులు సన్నగా ఉండేటివో నాల్గు చెక్క బద్దలు తీసుకొని కాసిని నీళ్లలో వేసి నానపెట్టాలి.

గసాలు, అల్లమూ, ధనియాలు, వెల్లుల్లి ముక్కలు తరగ్గా మిగిలిన నీరుల్లి, లవంగ చెక్క, యాలకు బుట్టలు ఇవన్నీ వేటికవి విడివిడిగా, వేసి, నున్నగా నూరి అట్టె బెట్టుకోవాలి. నాన్ రొట్టె తీసుకొని, దుంప ముక్కలంతేసి ముక్కలుగా చేసి ఓ ప్లేటులో పెట్టుకొని ఉంచాలి.

ఇహ ఇప్పుడు పొయ్యి అంటించి ఎసురు బెట్టి మామూలుగా మనం అన్నం చేసుకొనేటటట్లే శేరు బియ్యమూ అన్నం చేసి ఓ పక్కగా పెట్టుకోవాలి. ఉడికేటప్పుడు అన్నానికి సరిపడా ఉప్పు గూడా వేసేయాలి !

కళాయి పాత్రనోటి పొయ్యిమీద పెట్టి నెయ్యి వేసి నాన్ రొట్టె ముక్కలు వేసి గోధుమ రంగు వచ్చేవరకూ వేయించి తీసి వేరేఉంచాలి. అదే పాత్రలో మరింత నెయ్యివేసి కాగిన తరువాత జీడిపప్పు నీటిలో నానవేసిన మసాలా దినుసులు వేసి ఓనిముషం వేగనివ్వాలి. తరిగి పెట్టుకొన్న దుంప ముక్కల్లో మసాలా ముద్దలూ, కాస్త ఉప్పువేసి బాగా కలిపి పెట్టుకోవాలి. జీడిపప్పు, నానిన లవంగం చెక్కా యాలికలూ వేగిన తరువాత తరిగుంచుకొన్న ఉల్లి మిరపకాయ ముక్కల్ని గూడా దాంట్లో వేసేసి బాగా వేగనివ్వాలి. ఇప్పుడు మసాలా ముద్దల్తో సమ్మేళనమైన దుంపముక్కల్ని పాత్రలోవేసి అడుగంటకుండా బాగా కలుపుతూ ఉండాలి. వేగిన మసాలా వాసన వస్తూన్నప్పుడు ముక్కలు మునిగేలా నీరుపోసి మూత పెట్టాలి. పది నిముషాలకి వేసిన నీరంతా ఇరిగిపోయి చేత్తో నొక్కితే ముక్క చిదిగిపోతుంది. ఇప్పుడు కూర తయారైందన్నమాట !

వండి వార్చిన అన్నాన్ని ఓ పెద్ద పళ్ళెం (తట్ట) లోనికి గుమ్మరించుకొని . దానిలో వెజిటబుల్‌తో తయారైన మసాలా కూర, వేయించిన నాన్ రొట్టె ముక్కలు వేసి అన్నమంతా కూర పట్టేటట్లుగా కలుపుకోవాలి. ఇలా అని పిసికేసూ కలుపగూడదు.. అతి సున్నితంగా కలుపాలన్నమాట. అన్నం కూరతో మిశ్రమమైం తరువాత, ఈ మిశ్రమాన్ని ఓ కళాయి పాత్రలో కెత్తుకొన్ని దానిపై మిగిలి ఉన్న నెయ్యిపోసి (పావు నెయ్యికూరలో వేయగా మిగిలి ఉంటేనే) పాత్రపై పరిపడా పళ్ళెం మూతవేసి పళ్ళెంపై నాల్గు నిప్పులు గనుక వేస్తే మన మెప్పుడు భోజనానిక్కూర్చున్నా పలావ్ వేడివేడిగా ఉండి, ఘుమఘుమ లాడుతూ బలేరుచిగా ఉంటుంది ! ఇది ఒక రకమన్నమాట : ఈ విధంగా చేసిన బిరియానీ అయితే, కాస్త పెద్ద ఎత్తులో ఉండి, మూడు రకాల దుంప ముక్కలతోనూ, మధ్యమధ్య బన్ ముక్కలతోనూ కంటికింపుగా, నోటికి రుచిగా కనుపిస్తూ అతిథులకు, పెద్దలకూ పెట్టటానికి బావుంటుంది.

ఇహ రెండోరకం : మామూలుగా మన కెప్పుడు పలావ్ తినాలనుంటే అప్పుడు గభుక్కున చేసుకోవడానికనువుగా ఉంటుంది రెండో రకం బిరియానీ ! అంటే బీటురూట్ లేదే, కేరెట్ లేదే ముల్లంగి లేదే అని బాధపడ నక్కరలేదు.

అని ప్రదేశాల్లోనూ, ప్రతివేళా దొరుకు




"నువ్వు ప్రేమించి పెళ్ళి చేసుకున్నావుటగా ?"
"ఔను ! సురేష్‌ని ప్రేమించి రమేష్‌ని పెళ్ళాడను !!"

# వెజిటబుల్ పలావ్

బంగాళాదుంపలుంటే చాలు బిరియానీ తయారు చేసుకోవచ్చు. బన్ను గూడా అవసరంలేదీ పద్ధతిలో చేస్తే!

పైన చెప్పిన మసాలా దినుసూలూ, అవే కొలతలూ, మాత్రం వాడాలి దీనికీనూ, కాకపోతే వండటం తేడా కనుపిస్తుంది దానికీ, దీనికీనూ : ఈ పద్ధతిలో అయితే ఎర్రగడ్డలు ఒక్కశేరు చాలు :

ముందుగా శేరు బియ్యం శుభ్రంగా కడిగి, నీరంతా ఓడగించి ఓబట్టపై పోసి ఆరబెట్టాలి. తడి పూర్తిగా ఆరి బియ్యం పొడి పొడిగా అయిన తరువాత ఓగ్లాసు గాని, చెంబు గాని తీసుకొని బియ్యం కొల్చుకోవాలి. ఇక్కడ ముఖ్యంగా గమనించాల్సింది బియ్యం ఏ పాత్రతో కొలిచినా పాత్రకి నిండుగా కొలవరాదు. అంటే తలగీసి కొలవాలి.

కళాయి పాత్ర (శేరు బియ్యం ఉడికేది) పొయ్యి మీద ఉంచి అర్ధపావు నెయ్యిపోసి అదిబాగా కాగిన తరువాత జీడిపప్పు నానబెట్టిన మసాలా దినుసులూ వేసి, ఓ వేగువేగనిచ్చి తరువాత, ఉల్లిపాయ, పచ్చిమిరపకాయ ముక్కలు గూడా వేసి వేగనిచ్చి, మసాలా ముద్దలూ బంగాళా దుంప ముక్కలూ, కలిపి, పొయిమీద పాత్రలో వేసేయాలి. అడుగంట కుండా బాగా తిప్పుతూ ఉండాలి.

అన్నీ బాగా వేగిన తరువాత, బియ్యం కొలిచిన పాత్రలో ఒకటికి, ఒకటింపావు, చొప్పున, నీళ్లు పోయాలి. అంటే ఆరిన బియ్యం నాల్గుగ్లాసులు లుంటే, అయిదు గ్లాసుల నీరు పొయిమీద పాత్రలో వేయాలన్నమాట. (1. గ్లాసు బియ్యం ఉడకడానికి కావలసిన ఎసరు 1 గ్లాసు) ఉప్పు గూడా ఎసట్లో వేసి మూతబెట్టి పొయి క్రింద మంట బాగా ఉంచాలి. నీళ్లు సలసలా మరిగే టప్పుడు ఉప్పు సరిపోయిందో, లేదో, చూసుకొని, కొలిచి పెట్టుకొన్న బియ్యాన్ని ఎసట్లో పోసి మూత పెట్టాలి. బియ్యం వేసిన తరువాత పొయి క్రింద మంట ఆరిపోగూడదు. కాస్సేపటికి నీరంతా ఇరిగిపోయి బియ్యం కుతకుతలాడుతూ ఉంటాయ్! అప్పుడు పొయిక్రింద మంట పూర్తిగా లాగేసి, పాత్రపైనున్న మూత పళ్ళెంలో మంచి ఎర్రటి నిప్పులు వేసి ఉంచాలి. పది నిముషాల పోయిన తరువాత, నిప్పులమూత ఎత్తి చూస్తే బియ్యమంతా బాగా ఉడికి పలుకు లేకుండా ఉంటుంది. అప్పుడు మిగిలిన అరపావు నెయ్యి బిరియానీ పైన వేసి బాగా కలియబెట్టి పైన సన్నటి నిప్పుల మూత వేసి, వేడిపొయ్యి మీద పాత్ర సలాగే ఉంచితే, తినేటప్పటికి వేడివేడిగా ఉండి పలావు ఎంతో బాపుంటుంది! ★

# వనితా వాణి

## గరల్స్ హైస్కూల్

నేను హైస్కూలు టీచరు కాకపోయినా "ప్రభావతిగారి" వ్యాసం చదివేసరికి, వారి మీద పీకెలవరకు కోపం రావటం, వ్యాసంతో బాటు పత్రికలో వారు సజీవంగా కన్పిస్తే నమిలి మ్రింగాలనిపించక పోయినా, వారి అభిప్రాయాలతో ఏకీభవించలేక పోతున్నాను. వారు కేవల "గరల్స్ హైస్కూలు టీచర్లను" విమర్శించటానికి వ్రాసినట్లు కన్పిస్తుంది.

సి. రాజకుమారి (విజయవాడ)

* * *

పవని నిర్మల ప్రభావతిగారి వ్యాసంలోని విషయాలతో నేను ఏకీభవించలేక పోతున్నాను. ఆమె స్త్రీ అయియుండి, బాలికల పాఠశాలలో పనిచేయు టీచర్లను మోతాదు మించి దుయ్యబట్టడం సమంజసంగాలేదు. మా ఇంట్లో చాలా మంది ఆడపిల్లలము ఉన్నాము. మే మందరము గరల్స్ హైస్కూళ్లలోనే చదివేము. కాని ఎప్పుడూ, మా తల్లిదండ్రులు, రచయిత్రిగా రుదహరించిన సమస్యలను ఎదుర్కొనలేదు. సాధారణంగా, ప్రభుత్వ పాఠశాలలో కంటే, కాన్వెంట్లులోను, మిషనరీ పాఠశాలలోను చాల కఠినముగా ప్రవర్తిస్తారని అందరూ అనుకుంటారు. అచట చదివే బాలికలుకూడా ఇట్టి డ్రెస్సు సమస్యలను ఎదుర్కొనరు. టీచర్లందర్నీ మొత్తము మీద విమర్శించేముందు, తమ శాయశక్తులా విద్యార్థుల అభివృద్ధికి ధారపోసే టీచర్లు కూడా ఉంటారని, అట్టివారివల్లనే ఆణి ముత్యాల్లాంటి బాలలు, మంచి పౌరులుగా వెలుగొందుతున్నారని మర్చిపోకూడదు. రచయిత్రిగారు, వ్యక్తిగతముగా బాధపడి ఈ వ్యాసాన్ని వ్రాసి ఉంటారని, అందులోని విషయాలు, అన్ని గరల్స్ హైస్కూళ్లకు అన్వయింప తగినవిగా లేవని తెల్పడానికి సాహసిస్తున్నాను.

వెట్టమి కస్తూరి (రాజమండ్రి)

* * *

సంచిక "వనితాలోకం"లో ప్రచురించిన శ్రీ పవని నిర్మల ప్రభావతిగారి "గరల్స్ హైస్కూళ్లు" వ్యాసము చదవగానే ఆశ్చర్యము కలిగినది. ఎందుకంటే వ్యాసమంతా అతిశయోక్తులతోను, నమ్మజాలని విషయాలతోను నిండినది. మేము వ్యాసము శీర్షిక చూచి గరల్స్ స్కూళ్ళ విజ్ఞాన విషయములకు సంబంధించినదై యుండునని ఆశించితిమి. కానీ వ్యాసము చదివిన తర్వాత రచయిత్రి వ్యాసము విమర్శనాత్మక దృష్టితో వ్రాయ సంకల్పించి నట్లు తోచదు. వారు వ్యాసమును మొదటి నుంచి చివరి వరకు టీచర్ల గౌరవాన్ని కించపరచే విధముగా వ్రాసారు.

వారు వ్రాసిన ఈ క్రింది అభిప్రాయాలు నమ్మశక్యముకానివిగా, విస్మయాన్ని కలిగించే టట్లు ఉన్నవి. టీచర్సు ప్రతి 'సబ్జెక్టు'నకు రెండు నోటుబుక్స్ పెట్టాలని నిర్బంధిస్తారని అలా పెట్టినవి మాత్రం ఒకటరం దరకేను. రెండు నోట్సులు కాక మామూలు నోట్సులు ఉంచినట్లైతే క్లాసులో నుంచి బయటకు గిరాటు వేస్తారని రచయిత్రి వ్రాసారు. సాధారణంగా ప్రతి స్కూల్లో ముఖ్యమైన వాటికి మాత్రము మంచి నోటుబుక్స్ ఉంచాలని టీచర్సు అంటారు. కానీ మామూలు నోటుబుక్స్ పెడితే వాటిని క్లాసులో నుంచి బయటకు విసరి ఆ అమ్మాయిని బయటకు పంపుతారనుట ఏమంత సమంజసముగాలేదు. అలా ఏ టీచరు చెయ్యదు. మరో విషయమేమంటే టీచర్లు కుట్టుపనికై రెండు రూపాయలు తీసుకొని ఒక గజము 'లాంగ్ క్లాత్' బదులు ముప్పావు గజం మల్లుగుడ్డ ఇస్తారని రచయిత్రి వ్రాసారు. ఏవిధంగా ఆలోచించినా టీచరు అమాయకులైన విద్యార్థినుల మోసముచేసి వారిచ్చిన డబ్బులో కమీషను తీసుకొంటుందని ఆరోపించటం అన్యాయం. ఒకవేళ పిల్లలను మోసము చేసినా వారి "తలిదండ్రులు" కలుగజేసుకొనకుండా ఉంటారా? డ్రస్సు విషయమై ఆలోచించినా, కాన్వెంట్సులో మాత్రమే డ్రస్సు నిర్బంధం ఉంటుంది. మామూలు పాఠశాలలలో డ్రస్సు విషయమై నిర్బంధమేమీ ఉండదు. అలా నిర్బంధం ఉన్నా కూడ, తల్లిదండ్రులు మొదట తమ పిల్లలను స్కూళ్ళలో చేర్చినపుడే అన్ని విషయాలు తెలుసుకొని చేర్పెదరు. ఈ విషయమై రచయిత్రి వ్రాసిన అన్ని విషయాలు నమ్మశక్యముగానివి.

ఇంతకూ, రచయిత్రి ఒక ముఖ్య విషయము తెలుసుకోవాలి. సామాన్యంగా ఉపాధ్యాయవృత్తి స్వీకరించువారు మధ్య తరగతివారై ఉంటారు. వారికి మధ్య తరగతి కుటుంబాల స్థితి గతులు బాగుగా తెలిసి ఉంట్పై. అలాంటప్పుడు వారు విద్యార్థినులపట్ల అమానుషముగా ప్రవర్తిస్తారనుట ఏమీ బాగాలేదు. ఇటువంటి వ్యాసములు వ్రాయునప్పుడు బాగోగులను పూర్తిగా గుర్తించి వ్రాయవలెను. "వనితాలోకం"లో ప్రచురించే వ్యాసాలు సృజనాత్మకంగాను, విజ్ఞాన విషయములకు సంబంధించినవిగాను. వనితలకు ముఖ్యమైన విషయాలను గురించి తెలిపేవిగాను ఉంటే చాలా బాగుంటాయి.

పి. సుందరమ్మ (నెల్లూరు)

## కొత్తొకవింత....

మందరపు లలితగారు వ్రాసిన కొత క వింత అనే రచన చాల బాగున్నది. నిజంగా ఆమె వ్రాసినట్లు ఇది నైలాన్ యుగమే అనిపిస్తుంది. లలితగారికి నా ధన్యవాదాలు.

హేమలతా పాత్రో (రాజోలు)

* * *

"కొత్తొక వింత" బాగుంది. కాని ఏడాది కోసారి మగవాళ్ళు పాత జంధ్యం మార్చి, కొత్త జంధ్యం వేసుకొంటారుగాని, ఆడవాళ్ళు పసుపుతాడు నల్లబడితే పట్టించుకోరని వ్రాశారు.

పసుపుతాడు ఆడవాళ్ళు శుక్రవారం రోజు క్రొత్తది వేసుకోవచ్చు. అనే ఆచారం మీకు తెలియదా! ముఖ్యంగా మాఘమాసం (అరవంలో 'మాసి' అంటారు) శుక్రవారం క్రొత్త పసుపుతాడు వేసుకోవచ్చు అని పెద్దలంటారు.

కొందరు పసుపుతాడు 'పచ్చగా ఉండాలని' స్నానం చేసేటప్పుడు స్టాండుకు తగిలిస్తారట! రోజా పసుపు 'రాసుకొంటే పసుపుతాడు 'పచ్చగా' ఎందుకుండదో?

రాజావణి (మద్రాసు)


సందేహమెందుకు
బిన్నీవారి
జార్జెట్ అచ్చమైన శిల్కు చీర
విశిష్టమైన డిజైనులలో రక
రకాల జార్జెట్, షిఫాన్
ఇంకా మృదువైన శిల్కులు
లభిస్తాయి.




### జరిగిన కథ

జానకరామయ్య రిటైర్డైన బడిపంతులు. ఆయనకు నిరంజనం, శంకరం, సుశీల అని ముగ్గురు సంతానం. శంకరం ఉద్యోగ ప్రయత్నంలో వుంటాడు. జానకిరామయ్య సుశీల పెళ్ళిగురించి ఆలోచిస్తూ వుంటాడు. ఉద్యోగం కోసం మిత్రుడు రంగారావు ఇంటికి వెళ్ళిన శంకరం ఆ దంపతులు ప్రవర్తన నచ్చక ఇంటికి వచేస్తాడు.

## 5

అతన్ని చూడగానే, ఇంతకు మునుపు పాట పాడిన యువతి గభాలున లేచి రేణుక చాటుగా నిలబడింది. తల వంచుకుని కాలి గోటిని నేలకురాస్తోంది.

"రావోయ్ అల్లుడా......అందరం నీ గురించే ఎదురు చూస్తున్నాం" అన్నారు కామాక్షమ్మ సోఫాలో కూర్చునుండి.

నిరంజనం ఆవిడ కెదురుగానున్న సోఫాలో కూర్చున్నాడు. అతన్ని రెండు క్షణాలు నఖ పర్వతం పరీక్షించి అన్నారు.

"బాగా చిక్కిపోయావు నాయనా! పెళ్ళినాటికి ఇంకాస్త మనిషివి. అవునులే— బాధ్యతలు పెరుగుతే మనిషి చిక్కిపోడూ మరి"

"కాఫీ తెస్తాను పిన్నీ" అన్నది రేణుక.

"ఇప్పుడు కాఫీ ఏమిటమ్మా! భోజనాలవేళ, కాఫీ తాగి ఆకలి చంపుకుంటె అవతల ఆరోగ్యం ఏమైపోనూ? ఇప్పుడేం వద్దుగానీ నువ్వూ అలా కూర్చో.....శారదని ఇంతకుమునుపు నువ్వు చూడ లేదనుకుంటాను కదు బాబూ! ఇదిగో ఈ పిల్లే శారద. ఒక్కగా నొక్క కూతురు రేణూ—తల్లీ! రా! ఇతను నిరంజనం బావ" అని ఇద్దరినీ పరిచయం చేశారావిడ.

శారద నిరంజనానికి నమస్కారం చేసింది.

"పియూసీ వరకూ చదువు చెప్పించాం. సంగీతమూ చెప్పించాము. నువ్వింటావో వినవోగాని అప్పుడప్పుడు రేడియోలో కూడా పాడుతుంది..."

నిరంజన వేళ్ళు లెక్కపెట్టుకుంటూన్నాడు. రేణుక గోడవైపు చూస్తోంది. శారద వాళ్ళక్కయ్య పక్కన అలాగే సిగ్గుతో నిలబడి ఉంది.

ఎవరూ ఏమీ మాటాడక పోవడంతో మళ్ళా కామాక్షమ్మగారే ప్రారంభించారు.

"ఈ ఏడాదే శారద పెళ్ళి చేయాలని అనుకుంటున్నాం. నీ ఎరికలో మంచి సంబంధాలుంటే చూచి చెపుదూ. నీకు పుణ్యముంటుంది."

"ఇంతలోనే పుణ్య మేమిటండోయ్" అన్నాడు నిరంజనం. ఏమీ అనకపోతే బావుండదన్న ఉద్దేశ్యంతో. ఆ ఒక్క ముక్కనీ ఆసరాగా తీసుకుని ఆవిడ ఆడపిల్లల పెళ్ళిళ్ళ గురించీ, వాటికోసం కన్న తల్లి తండ్రులు అనుభవించే యాతనల గురించీ, ఓ పావుగంటసేపు మాటాడారు. గుక్క తిప్పుకోకుండానే, చెప్పినదంతా ఓమాటు సమీక్షిస్తున్నట్టు రెండు ముక్కల్లో ఈ కాలంలో ఆడపిల్లల పెళ్ళిళ్ళు చెయ్యడం మహా యజ్ఞమనీ, పెళ్ళికాని ఆడపిల్లలు ఇంటికి పెద్ద భారమనీ అన్నారు. చివర్ని ముగింపు మాటగా—

"మా రేణుతల్లి అదృష్టవంతురాలు గనుక నీలాటి గుణవంతుడు దొరికాడు. అందుకు చాలా ఆనందిస్తున్నాం నాయనా! చూస్తూన్నాంగా ఈ రోజుల్లో అల్లుళ్ళ ఆగడాలు. ఇందాక నీ గురించి అమ్మాయిని అడుగుతే—ఆఫీసులో పనుండి ఉండిపోయావని చెప్పింది. అదుగో అల్లా ఉండాలి లక్షణమంటె. మావయ్యగారి వ్యాపారమైనా నీ స్వంత వ్యాపారంలా చూచుకుంటూ, మరింత అభివృద్ధికి తీసుకు రావాలని పాటు పడుతున్నావ్. అందరూ అలా ఉంటారా చెప్పు?"

నిరంజనానికి చిరాకు కలిగించింది. ఇప్పుడు మావయ్య ప్రసక్తి రావడం అతని కిష్టంలేదు. అందుచేతనే అతను ముఖం చిట్లించుకు కూర్చున్నాడు. ఇది గమనించిన రేణుక—

"భోజనాల వేళయింది. లేవండి మరి" అన్నది.

"నా కప్పుడే భోంచేయాలనిలేదు. ముందు అత్తయ్య వాళ్ళకి వడ్డించు" అన్నాడతను తన గదిలోకి వెడుతూ.

ఆ రాత్రి రేణుక తన మనసులోని మాట నిరంజనానికి చెప్పేసింది.

"శారదని మీ తమ్ముడి కివ్వాలని పిన్నీ వాళ్ళ ఉద్దేశ్యం. మీతో ఆవిడ ఉద్దేశ్యాన్ని చెప్పమన్నది.

నిరంజనం, అత్తయ్య మాటల్లో దాక్కున్న ఈ అంతరార్థాన్ని మొదట్లోనే గ్రహించాడు. కానీ, తనకై తాను బయటపడ దలుచుకోలేదు. పైగా ఈ శ్రీమంతుల సంబంధం తన తమ్ముడికి చేసుకోవడం ఇష్టంలేదు. శ్రీమంతుల బిడ్డని చేసుకుని తను అనుభవిస్తూన్న 'సుఖం' సాక్ష్యానికి సిద్ధంగా ఉండనే ఉంది. తన తమ్ముడు గూడా ఈ పంజరంలో చిక్కుకోడం తనకి సుతరామూ ఇష్టంలేదు. అలా అని చెప్పి తన అభిప్రాయాన్ని రేణుకకి చెప్పాలనీ అనిపించలేదు. మవునంగా ఉండిపోయేడు.

"శారదని చూశారుగా. అన్ని విధాలా మీ తమ్ముడికి తగిన పిల్ల. ఇద్దరూ కళారాధకులే. అతను కథలు రాస్తాడు. శారద చక్కగా పాడుతుంది. పోతే—మీ ఉద్దేశ్యమూ......"

"మధ్య నా ప్రమేయ మేముంది రేణూ. అన్నింటికి నాన్న ఉండనే ఉన్నారాయె. అదీ గాక పెళ్ళి చేసుకునేది వాడు కాబట్టి, మరి వాడి అభిప్రాయమూ తెలుసుకోవడం మంచిదికదూ?"

"నన్నడుగుతే ఇది నిక్షేపంలాటి సంబంధమంటాను. బాబాయి వాళ్ళు త్వరలోనే బెజవాడలో బట్టల దుకాణం పెద్ద పెట్టుబడితో పెట్టబోతున్నారుట. అక్కడే చక్కటి ఇల్లొకటి కట్టించుకోవడమో, కొనుక్కోడమో చేస్తారు. ఇవి గాక, ఎలా లేదన్నా లక్ష రూపాయల రొక్కం రెడీగా ఉంది."

"వాళ్ళ ఆస్తి వివరాలు చెప్పమని నిన్నడగ లేదు రేణూ! మావాళ్ళకి శారద నచ్చుతే, నువ్వు చెప్పిన ఈ వివరాలన్నీ అనవసరం. పోతే......మరొక అభ్యంతర మేమిటంటే, మా చెల్లి పెళ్ళి కానిదే వీడి పెళ్ళి చెయ్య దలుచుకోలేదు. కాబట్టి ముందు చెల్లి పెళ్ళి జరగాలి."

"భలే......పెళ్ళి అన్న తర్వాత అనుకున్న మరుక్షణంలోనే జరుగుతుందటండీ ఎక్కడైనా? కాపోతె వాళ్ళు అడగమన్నారు గనకా, అతని పెళ్ళి విషయంలో మనగ్గూడా బాధ్యతంటూ ఉన్నది గనక అడిగాను కాని, అనుకున్న వెంటనే శారదని శంకరాని కిచ్చి పెళ్ళి చేద్దామని చెప్పలేదుగా" అన్నది రేణుక.

ఆ తర్వాత ఇద్దర్లో ఎవ్వరూ మాటాడలేదు.

* * *

ఆ మర్నాడు నిరంజనం ఇంటికొచ్చేసరికి ఇంట్లో నాన్నా, చెల్లెలూ, తమ్ముడూ కనిపించేరు. అందరూ హాల్లో కూర్చుని ఉన్నారు. నాన్నా వాళ్ళతో కామాక్షమ్మగారు మాటాడుతున్నారు. తనని చూచి ఆవిడే అడిగేరు.

''నాన్నగారు వస్తున్నట్టు ఉత్తరం రాశారుటగా నాయనా? మరి మాతో చెప్పలేదే?''

అతనేం మాటాడకుండా వచ్చి అందరి మధ్యా కూర్చున్నాడు.

''మూడు గంటలకి వచ్చాం'' అన్నారు జానకి రామయ్య.

''ఇప్పుడు మీ వంట్లో ఎలాగుంది'' అడిగాడు నిరంజనం.

''ఏం చెప్పను. ఎప్పుడో చెప్పా పెట్టకుండా గుండెల్లో పోటు వస్తుంది. ఆ ఒక్కరోజూ మనిషిని కృంగ దీసేస్తుంది. ఉత్త రోజుల్లోనేమో ఆయాసం, కొద్దిగా నీరసం''

''ఈ వయస్సులో అందరికీ అలాగే ఉంటుంది అన్నయ్యగారూ!''

''నువ్వు కాకినాడనుంచి ఎప్పుడొచ్చావురా?'' తమ్ముడ్ని అడిగాడు నిరంజనం.

డటం లేదు. ఇంట్లో కాలు బయట పెట్టనేలేదు. నువ్వు రాశావుటగా ఇక్కడికి రమ్మని'' అన్నాడు శంకరం.

''అవును. ఈ ఊళ్లో నాకు తెలిసిన డాక్టర్లున్నారు, మంచి వైద్య సౌకర్యాలూ ఉన్నాయి.''

''ముందు వెళ్లి, ఆయనా ప్రయాణమయ్యారు, నన్నా రమ్మని బలవంతం చేస్తే—''

ఈ మాట వినగానే నిరంజనానికి కాస్త కోపం వచ్చింది.

''అవు(నా వాళ్ళు రమ్మని బలవంతం చేస్తేనే తప్ప రావన్న మాట.''

''అనికాదు''

''మరి?''

''ఎందుచేతనో ఎక్కడికీ వెళ్ళాలనిపించడం లేదు.''

కాఫీ ఇచ్చి వెళ్ళిపోయింది రేణుక.

అన్నదమ్ము లిద్దరూ కాఫీ తాగుతూండగా హాల్లోంచి నవ్వులు వినిపించాయి. ఒక నవ్వు కామాక్షమ్మగారిదీ, మరొక నవ్వు జానకిరామయ్యగారిదీని. నిరంజనం గది తలుపు దగ్గర నిలబడి హాల్లోకి తొంగిచూశాడు.

వాళ్లింకా నవ్వుతూనే ఉన్నారు. కామాక్షమ్మ గారి పక్కన తలొంచుకుని శారదా, నాన్న దగ్గర వాళ్ల నవ్వుతో జత కలుపుతూ సుశీలా నిలబడి ఉన్నారు. వంట గదిలోకి వెళ్లవలసిన రేణుక దారి మార్చి మళ్లీ వచ్చి వాళ్ల దగ్గరే నిలబడి ఉంది.

నిరంజనం గుమ్మం నుంచి కదిలి తమ్ముడి దగ్గరకు వచ్చాడు.

''నిన్ననే కామాక్షమ్మగారూ, ఆవిడ కూతురు శారదా వచ్చారు. ఈ కామాక్షమ్మగారు రేణుకకి



తమ్ముడు జవాబు చెప్పలేదు. ఉద్యోగ విషయం అడుగుదామనుకున్నాడు గానీ, నాన్న రాసిన ఉత్తరంలోని విషయాలు గుర్తుకొచ్చి మానుకున్నాడు నిరంజనం.

''సుశీలా......ఒకసారి ఇలా వస్తావూ'' వంట గదిలోంచి రేణుక పిలిచింది.

''ఇప్పుడే వస్తారా అన్నాయ్'' అని సుశీల వెళ్లిపోయింది.

కామాక్షమ్మగారు జానకిరామయ్యగారికి, తాము పెట్టబోయే బట్టల దుకాణం గురించీ, బెజవాడలో తమ ఇల్లు గురించీ చెప్పడం మొదలు పెట్టారు.

ఇది వినే ఓపికలేక నిరంజనం తన గదిలోకి వెళ్లిపోయేడ్రు. నిరంజనాన్ని శంకరం అనుసరించాడు.

గదిలో బట్టలు మార్చుకుంటోన్న అన్నయ్యనుద్దేశించి—

''నాన్నకి ఈమధ్య వంట్లో బొత్తిగా బావుం

''అవున్లే పెద్దవాడి వవుతున్నావు గదూ మరి. ఏవిటే, వ్యవసాయం చేస్తానని చెవ్తూన్నావుట.''

''ఉద్యోగం దొరక్కపోతే ఏం చెయ్యను?''

''ప్రయత్నాలు చెయ్యాలి.''

''ఇంక చెయ్యదలుచుకోలేదు.''

''అలాగైతే ఉద్యోగ మెలా వస్తుంది?''

''చెప్పానుగా. రాకపోయినా ఇబ్బంది లేదని.''

''సరే.....నీతో వాదించి వేగెలవలేను. నీ కేది మంచిదనితోస్తే అది చెయ్యి.''

తలుపు దగ్గర శబ్దమైంది. రేణుక ట్రే లో కాఫీ తీసుకొచ్చింది.

''అన్నదమ్ము లిద్దరూ ఏదో తీవ్రంగా చర్చిస్తున్నట్టున్నారు.''

''చర్చించడాలే తక్కువ'' ఒన్నాడు నిరంజనం.

''సర్లెండి. ముందు కాఫీ పుచ్చుకోండి. నా కవతల చాలా పనులున్నాయి.''

పినతల్లి. మాటలు చెప్పడంలో ఆవిడ్ని మించినవారుండరు'' అన్నాడు నిరంజనం.

''నాకూ అలాగే అనిపించింది.''

''ఈ పెద్ద వాళ్ల ఛాదస్తం గమ్మత్తుగా ఉంటుంది. వాళ్లేదో ఎట్టు వేస్తున్నా మనుకుని ఒక ఎట్టువేసి వాళ్లకి వాళ్లే నవ్వుకుంటారుగాని, ఈ హాస్య ప్రసంగంతో సంబంధమున్న పిల్లల అవస్థ గమనించరు ఇప్పుడు హాల్లో జరుగుతూన్న తతంగం అదేను''

అన్నయ్య మాటకి శంకరం నవ్వుకున్నాడు.

''నీతో చాలా విషయాలు మాటాడాలి'' హఠాత్తుగా అన్నాడు నిరంజనం.

''ఏవిటవి?''

''నువ్వు కుర్రాడివి నీకు లోకం తెలీదు. ఆవేశంలో కొన్ని పిచ్చి పనులుచేసి ఆవేశం లగ్గిన












# మనిషి - మిథ్య

తర్వాత పశ్చాత్తాపం కూడదురా శంకరం. దేనికైనా యోచన అవసరం."

"ఇవాళ ఎద్దైనా సినిమాకి వెళ్లాలని ఉంది. నువ్వు త్వరగా తెములితే సంతోషిస్తాను" అన్నాడు శంకరం, అన్నయ్య చెప్పబోయే విషయానికి అడ్డు తగిలి.

తమ్ముడి ఉద్దేశాన్ని పసిగట్టలేనంత తెలివి తక్కువవాడు కాదు నిరంజనం. నింపాదిగా నచ్చ చెప్పవచ్చనే నిశ్చయించి అతనూ ఊరుకున్నాడు.

హాల్లో శారద పాట పాడుతోంది కమ్మటి గొంతుతో.

"రాగ సుధారసా—"

అన్నదమ్ములిద్దరూ పాటని పూర్తిగా విన్నారు. హాయిగా, తీయగా పాడింది శారద.

"శారద చక్కగా పాడుతుంది. రేడియోలో ప్రోగ్రామ్సుని ఇస్తుందిట."

"................"

"పాపం. ఆ పిల్ల వచ్చిన దగ్గర్నుంచీ పాటలు పాడటమే పనిగా పెట్టుకుంది. ఏం చేస్తుంది మరి శ్రోతలు పాడమని కోరితే పాడక తప్పదు గదా."

"అవతల సినిమాకి వేళవుతుంది మరి" అన్నాడు శంకరం.

ఇద్దరూ సినిమాకి వెళ్ళిపోయారు.

నాలుగు రోజులపాటు ఆ ఇంట్లో ఏ విధమైన గందర గోళమూ లేకుండా హాయిగా గడిచింది అందరూ సరదాగా నవ్వుకుంటూ గడిపారు. జానకి రామయ్యగార్కి నెత్తురు పోటున్నదని చెప్పేరు వైద్యులు. దాని క్కావలసిన మందులూ రాసి ఇచ్చారు. జానకిరామయ్యగారికి గుంటూర్లో కొడుకు దగ్గర హాయిగా ఉంది. శంకరం ఉద్యోగం గురించీ, తన ఆరోగ్యం గురించీ పూర్తిగా మరిచిపోయే రాయన. రోజంతా కామాక్షమ్మగారితో లోకాభి రామాయణం, పిల్లలకి లోకం పోకడ గురించీ చెప్పడంతో గడిచిపోతుంది.

శంకరం, సుశీలా, రేణుకా, శారదా—రోజస్త మానం కేరమ్సూ పేకాటలతో గడిపేస్తున్నారు.

ఇంత హాయిగావున్న ఆ ఇంట్లో ఆ సాయంత్రం రగడ ప్రారంభమైంది.

శారద, శంకరం ఒక పార్టీగా, సుశీలా రేణుకా మరో జట్టుగా కూర్చుని కేరమ్సు ఆడుకుంటు న్నారు. వాళ్ల క్కాస్త అవతలగా జానకిరామయ్యా గారూ కామాక్షమ్మగారూ 'నేటి పెళ్లిళ్లూ నాటి ముచ్చట్లూ' గురించి మాటాడుకుంటున్నారు.

అప్పుడే వచ్చాడు నిరంజనం. వచ్చీ రావడం తోనే రేణుకని పిలిచాడు. ఆమె, ఆట మధ్యలో లేవడం ఇష్టంలేక వెంటనే వెళ్లలేదు. దాంతో మరింత కోపంగా పిలిచాడు నిరంజనం.

ఈ రకమైన పిలుపుతో హాల్లో ఉన్న జనాభా అంతా ఒకరి మొహం ఒకళ్లు చూచుకుంటూ మవునం వహించారు. రేణుక లేచి అతని గదిలోకి వెళ్లింది.

"నేను మీ బానిస ననుకున్నాడా మీ నాన్న?"

48 వ పేజీ చూడండి

డా॥ గాలి బాలసుందరరావు

# మనసమూ-మనదేహస్థితి

## స్వచ్ఛంద నరాశయము

(గత సంచిక తరువాయి)

ఇందులో మధ్యశాఖ మెదడుకు పోతుంది. ఇది ఈ మూడు శాఖలలోకీ పెద్దది. ఇది మళ్లీ రెండు శాఖలై ఒకటి మెదడులో గౌరభాగమైన కార్టెక్సుకూ, ధవళ భాగమైన మెడుల్లాకూ పోతవి. ఈ శాఖలలో ఒకటి మిగతా వాటికంటె పెద్దది. ఈ పెద్ద శాఖ తరుచు పగిలి మెదడులో రక్త స్రావం ఏర్పడుతుంది. అప్పుడు మూర్ఛ, ఆక్షేపక వాతము (చెతులూ, కాళ్లూ బాదుకోడం —Convulsions) సంభవిస్తవి.

మెదడులో గౌరభాగమునకు పోయే ఆర్టెరీ గనక ఈ శాఖ అతి ముఖ్యమైనది. ఏ శరీర భాగమైనా సరీగా పని చేయాలన్నా, అధిక శక్తివంతం కావాలన్నా దానికి ఆహారమూ, ఆక్సిజనూ అధికంగా పోవాలి. అందుకు ఆ ప్రదేశానికిపోయే ఆర్టెరీ పెద్దగానైనా ఉండాలి. లేదా సాధన వల్లనో, సాధికలవల్లనో అది పెద్దదైనా కావాలి.

స్వచ్ఛంద నరాశయంలో, సింపతెటిక్ శాఖలో శిరోభాగము ఈ కరోటి లోపల ప్రవేశించే కెరోటిన్ శాఖను అంటి ఉండే నరముగా ప్రారంభమౌతుంది. అది శాఖోప శాఖలుగా చీలి, ఒక నర జాలమై (Plexus) కెరోటిడ్ ఆర్టెరీ మెదడు శాఖను చుట్టి ఉంటుంది. ఈ శాఖను తాడి చెట్టును జువ్విచెట్టు చుట్టి ఉన్నట్లుగా ఈ నర జాలము చుట్టి ఉంటుంది. ఈ నరజాలము నుండి కొన్ని సూక్ష్మ శాఖలు ఆర్టెరీ గోడలలో ఉండే అనిచ్ఛాధీన కండరములకు పోతవి. అంటే ఆ ఆర్టెరీ సంకోచ వ్యాకోచములవల్ల చిన్నదీ, పెద్దదీ కావడమును శాసిస్తవన్న మాట. మెదడు పని చేస్తున్నప్పుడు అవి పెద్దవౌతవి. విశ్రాంతికాలంలోనూ, నిద్రాకాలంలోనూచిన్నవౌతవి. స్వప్న కాలంలో మళ్లీ పెద్దవౌతవి. ఈ నర జాలము,ఈ ఆర్టెరీ అన్ని శాఖలకూపోయి, వాటిని చుట్టి ఉంటవి. ఈ శాఖలు శిరస్సులో ఉండే ఘ్రాణ, శ్రవణ, జిహ్వా చక్షురింద్రియములకు పోతవని పైన తెలుసుకున్నాము. ఈ ఆర్టెరీ సంకోచ వ్యాకోచములను స్వాధీనం చేసుకుంటేగాని, మేధాశక్తినీ ఇంద్రియముల శక్తినీ అధికం చేసుకోడం సాధ్యంకాదు. చివరకు ఈ ప్లెగ్జసుశాఖలు, మెదడును అంటి ఉండే పయా మేటరులో అంతమౌతవి. అంటే మెదడును అంటి ఉండే పయా మేటరులో సింపతెటిక్ నరములు ప్రారంభమౌతవన్నమాట! సర్వ శరీర భాగములను ప్రేరేపించే మస్తిష్క గౌరభాగము, తానే మరొక శక్తి చేత ప్రేరేపితమవుతున్నదేమో తెలియదు. ఆ శక్తి ఎక్కడ నుంచి వస్తున్నదో అసలే తెలియదు. కాని అది మెదడులో గౌర భాగం ద్వారానే శరీరాన్ని ప్రేరేపించ గలుగుతున్నది. మరొక విశేషం. శరీరంలో అన్ని నరములు లేత పసుపు రంగు కలవీ దంతం రంగుకలవీ. కాని, సింపతెటిక్ దండ ప్రారంభమైన కెరోటిడ్ నరము ఎర్రని రంగు కలది.

సింపతెటిక్ దండ కంఠభాగములో, మూడు ప్లెగ్జసు లున్నవి. ఇది ఎరుపు, బూడిద రంగు కలిసిన రంగు కలది. ఇది నాలుగు గేంగ్లియానులు కలిసి ఏర్పడ్డది. దీనినుండి బయలుదేరే శాఖలు, పైన వున్న నాలుగు శిరో నరములలో లీనమౌతవి. ఈ విధంగా కేంద్ర నరాశయంములో శిరఃకంఠభాగములకు ఇది సంబంధం ఏర్పరుస్తుంది! కొన్ని తంతువులు వేగస్ నరంలో లీనమౌతవి. మరికొన్ని నాలుకకూ అంగిలికీ పోయే నరంలో కలుస్తవి. మరికొన్ని లేరింగ్సుకు (శబ్ద పేటిక) గొంతుకకు, హృదయానికీ పోతవి. ఇవన్నీ అన్యోన్య సంబంధం కలిగి, సింపతెటిక్ వక్ష భాగంలో ఏర్పడిన హృదయపు ప్లెగ్జస్‌లో లీనమౌతవి.

మధ్య గేంగ్లియానునుండి పోయే శాఖలు, శరీరంలో మెటబాలిజముతోనూ, సంతానోత్పత్తికి కారణములయిన గ్రంథులతోనూ సంబంధం కలిగిన థైరాయిడ్ గ్రంధికి పోతవి. ఇక్కడ నుంచే మళ్లీ హృదయానికి పోయేశాఖ కూడా బయలు దేరుతుంది.

మెదడుకు సంబంధించిన ఈ ఆర్టెరీ శాఖలు మూడు. (1) పూర్వశాఖ, (2) మధ్యశాఖ, (3) పృష్ఠశాఖ.

కంఠ భాగంలో మూడవ గేంగ్లియాను 7, 8 శిరోనరములకు శాఖలను పంపుతుంది. 8 వ నరము శ్రవణేంద్రియానికి సంబంధించినది. వక్ష భాగంలోవుండే సింపతెటిక్ దండను గురించి ఇదివరకే కొంత వివరించాను.

వక్ష భాగంలో ఎన్ని వెన్ను నరము లున్నవో అన్ని సింపతెటిక్ గేంగ్లియానూలూ ఉన్నవి. కాని, మొదటిది మూడవ కంఠ భాగపు గేంగ్లియానుతోనూ ఆఖరుది, మొదటి లంబారు గేంగ్లియానుతోనూ కలిసి పోతవి. మధ్యలో కొన్ని కలిసిపోతవి. ఇందువల్ల సింపతెటిక్ దండలో గేంగ్లియానుల సంఖ్య వెన్ను నరముల సంఖ్య కంటె తక్కువగా ఉంటుంది. వక్ష, జఘన భాగములలో నుండి బయలుదేరే నరములు కలిసి, వక్ష కుహరంలోనూ, ఉదర కుహరంలోనూ ఉండే అంగములకు పోయే నరములుగా రూపొందుతవి.

జఘన భాగంలోఉండే సింపతెటిక్ భాగము, పెల్విస్‌లో ఉండే అంగములకు పోయే నరములకు కేంద్ర మౌతుంది.

47 వ పేజీ చూడండి




చిత్ర వివరణ : 1. వెన్నుపాములో గౌర భాగపు వెనుకకొమ్ము (సెన్సరీభాగమునకు సంబంధించినది) 2. గౌర భాగపు ముందు కొమ్ము 3. ధవళ భాగము 4. కండరము 5. చర్మము 6. పెండను 7. రక్త నాళము 8. సెంట్రల్ కెనాల్ (సుషుమ) 9. గ్రంధి 10. సింపెతెటిక్ గేంగ్లియాను.

## శ్యామసుందరి ఇంట్లో ఆనాటి సాయంత్రం జరిగిన సంఘటన

తలచుకుంటే ఇప్పటికీ ఒళ్లు ''ఝల్లు''మంటుంది. నాతోపాటు మరో ఇద్దరా అనుభవాన్ని పంచుకున్నారు కాబట్టి సరిపోయింది కాని, ఒక్కర్తినీ అయితే ఏమై పోదునో అనే భయంతో ఆ సంగతి గుర్తుకు వస్తే ఇప్పటికీ రక్తం గడ్డ కట్టుకు పోతుంది. శ్యామసుందరి జడ్జిగారి ఏకైక పుత్రిక. తల్లి చిన్నప్పుడే పోయింది. ఒక వంటావిడ, ఇంట్లో ఇద్దరు ముగ్గురు నౌకర్లు తప్ప మరెవ్వరూ ఉండరు. ఆవిడ పోయిన దగ్గరనుంచీ జడ్జిగారికి ప్రశాంతంగా ఉండే ఇళ్లు తప్ప నచ్చడంలేదుట. అందుకని ఆయన ఊరికి కాస్త దూరంగా పెద్ద బంగాళాలో ఉండేవారు. ఆ బంగాళా చాలా నిర్మానుష్యంగాను, ఎక్కడ చూస్తే అక్కడ పెద్ద చెట్లతో దెయ్యాలు తారట్లాడుతున్నట్టుండేది.

శ్యామసుందరి స్వభావానికి, ఆ ఇల్లు సరిపడలేదు. శ్యామసుందరికి ఎప్పుడూ నలుగురితో



చారలు అడ్డంగా కుట్టారు. ఇది కాళ్లవరకూ వుంటుంది.

పక్క బరిణె ఒక చేత్తో పట్టుకుని వయ్యారంగా చొక్కా అంచు నేలకి తగలకుండా పట్టుకుని నడిచివెళ్ళిన తన పిన్ని హ్లా జ్ఞాపకం వచ్చింది కోకోటిన్‌కి. చొక్కా అంచుకింద ఎర్రని రంగు వేసిన ఆమె కాలి గోళ్ళు, ఎత్తు మడమల జోళ్లు గుర్తుకి వచ్చేసరికి నవ్వు వచ్చింది అతనికి— ఇంతలో మెయిసీ తన స్నేహితురాలు జ్ఞాపకం వచ్చింది. "అయ్యో దేవుడా! ఇవాళ్టి రావాలే ఆ అమ్మాయి కూడా!"

ఈ బూజు పట్టిన ఆచారాలు కల ఊరికి ఆమెని ఎందుకు పిలిచాడతను? "ఏమిటి మావాళ్లని చూస్తే నాకు సిగ్గా?" అనుకున్నాడు కోపంగా. "ఈ పాతకాలం ఆచారాలలో మెయిసీ ఉక్కిరిబిక్కిరవుతుంది." ఆమె రాకని తన పిన్ని ఎలా చెప్పాలి? మెయిసీ అంటే తనకి ఏవిధమయిన ప్రేమా లేదంటే ఆవిడ నమ్ముతుందా?

నట్రుపాటుతో చెప్పచూశాడు. ఆమె బర్మీస్ అమ్మాయే అయినప్పటికీ—ఆధునిక యువతి అనీ—తనలాగే లాయర్ అనీ— పెద్ద వయసు రాలేదు కానీ పెళ్లికాని అమ్మాయే అనీ—తోడెవ్వరూ లేకుండా ఒంటరిగానే వస్తోందనీ—తన ప్రియురాలు మాత్రం కాదనీ—కారు తనే నడుపుకుని వస్తోందనీ—ఇప్పటి కాలం అమ్మాయిలందరివలే ప్రయోజకురాలనీ—హ్లా పిన్ని చిరునవ్వుతో, అర్థం అయిందన్నది. కాని కోకోటిన్‌కి తెలుసు, ఆమెకు ఏమీ అర్థం కాలేదని. "కోర్టులో ఇలా మాట్లాడితే నా వృత్తిలో పైకేమి వస్తాను?" అనుకున్నాడు నిస్పృహతో.

దేవుడి దయవల్ల మెయిసీ తన చుట్టాల మధ్యకి దర్జాగా రావడం కోకోటిన్ చూడలేదు. ఆశ్రమంలో వారితో వివరాలను గురించి వాదిస్తున్నాడు.

తిరిగి వచ్చేసరికి ఇంటిముందు ఎర్రటి కారు ఆగి ఉంది. లోపల బరిణెకి మెరుగుపెడుతున్న తన పిన్ని దగ్గర కూర్చుని ఉంది మెయిసీ. వారి చుట్టూ ఇంకా వెండి సామానూ, దంతం ఏనుగు బొమ్మలూ పరిచి ఉన్నాయి. పొడుగాటి గోళ్లకి వేసిన ఎర్ర రంగుతో, నవీన పద్ధతిలో ఏర్పరచిన జుట్టుతో, నోటిలో వేల్లాడుతున్న సిగరెట్టుతో మెయిసీ అత్యాధునికంగా కనిపించింది.

మర్యాదగా ఒక్కొక్కటీ పరిశీలిస్తూ : "పాత పద్ధతిలో చేసే ఆశ్రమ ప్రవేశం చూడాలని తహతహ లాడిపోతున్నాను. పట్నంలో ఊరేగింపులు చూశాను కాని కార్లలో అవసరంగా వెళ్లిపోతారు. ఇక్కడలాగ అందంగా, వయ్యారంగా వెళ్లరు. ఆశ్రమానికి వెళ్ళే అబ్బాయిలు గుర్రాలమీదా, తక్కినవారంతా నడిచీ వెడుతూఉంటే బావుంటుంది!" అంటోంది.

కోకోటిన్ అనుకున్నాడు, "పోనీ ఎలా మాట్లాడాలో తెలుసు, అదే చాలు!" మెయిసీ కొంచెం అక్కర్లేని తీవి చూపిస్తోందేమో అనిపించింది. అసలు ఆమెను ఈ ఊరికి తీసుకురావటం బుద్ధి తక్కువ.

కోకోటిన్ ఆమెని వీలయినంత మర్యాద చేశాడు. పరిచేనులో తూర్పారబోయటం చూపించాడు. మెయిసీ చిన్న పిల్లవలే సంబరపడింది. "పాపం కొత్తగా ఉంది కాబోలు!" అనుకున్నాడు అతను. లోపల చల్లని నీడని ఇచ్చే జామ, మామిడి చెట్లు కల ఆశ్రమం చూపించాడు.

మర్రిచెట్టుక్రింద పేము వేదికమీద కూర్చుని తన కుటుంబంలో ఆచారాలని గురించి చెప్పాడు : చిన్న పిల్లవాళ్లుగా ఉన్నప్పుడు ఒకసారి, మళ్లీ పెద్దవాళ్లయిన తర్వాత మరొకసారి ఆశ్రమ ప్రవేశం చేసే పద్ధతి విడమరచి చెప్పాడు. ఇవి బౌద్ధ సంప్రదాయాలలో ముఖ్యమైనవాటిలోవి, పిల్లవాడుగా ఒకసారి పసుపు బట్టలు ధరించి, తిరిగి పెద్దవాడయిన తరువాత ఆశ్రమం ప్రవేశించి రావటం చాలా గొప్ప విషయం.

**రాజకీయ వార్తల విషయంలోనే గాక సాహిత్యం విషయంలో కూడా మన పత్రికలు ఆసియా దేశాలను అశ్రద్ధ చేస్తున్నాయనే ఆరోపణ లేక పోలేదు! పాశ్చాత్య సాహిత్యం తెలిసినంతగా మనకి మన ఖండంలోనే వెలువడిన, వెలువడుతున్న సాహిత్యం గురించి తెలియదు. ఈ లోటును కొంత వరకు తీర్చేందుకే సుప్రసిద్ధ ఆసియా రచయితల కథలు కొన్ని వరుసగా ప్రచురిస్తున్నాము. బర్మాకి చెందిన యీ కథ యీ శీర్షికలో ఐదవది. ఒక్కొక్కవారం ఒక్కొక్క దేశానికి సంబంధించిన కథ ప్రచురిస్తున్నాము.**

తనకి రెండవసారి ఆశ్రమ ప్రవేశం చేసే సమయం ఇది అని మెయిసీకి చెప్పాడు. తను వారం రోజులపాటు ఆశ్రమంలోనే ఉంటాడు. కాబట్టి మరేమీ అనుకోకుండా ఒంటరిగానే పట్నానికి తిరిగి వెళ్లిపొమ్మన్నాడు. మెయిసీ పరధ్యాన్నంగా గడ్డిపరకని నములుతూ ఎర్రగా అస్తమిస్తున్న సూర్యునివైపు చూస్తూ "ఇక్కడ బావుంది!" అంది మృదువుగా. ఆ క్షణంలో కోకోటిన్‌కి ఆమెని తను ఆశ్రమం వదిలివచ్చేవరకూ ఉండమని అడిగితే బాగుండు ననిపించింది. కాని, ఇంతలో మెయిసీ అతని వంక తిరిగి పరిహాసంగా అంది, "ఆశ్రమం వదిలి గొరిగిన తలతో మామూలు బట్టలు వేసుకున్న నిన్ను చూస్తే ఎలా ఉంటుందో!" అని. అన్నవెంటనే ఏదో పాట పాడుకుంటూ పొలాలలోకి చకచకా నడిచి వెళ్లిపోయింది.

మర్నాడు మెయిసీతో ఎక్కువ కాలం గడపే అవకాశమే లేకపోయింది కోకోటిన్‌కి. తక్కిన వారితోబాటు ఏర్పాట్లలో మునిగిపోయాడు. హ్లా పిన్నికి వప్పచెప్పేశాడు. కోకోటిన్ కొంచెం కలవరపడకపోలేదు. బూజు పట్టిన అలవాట్లను గురించి విని మెయిసీ ఎంత నవ్వుకుంటుందో. "ఏమిటి! హ్లా పిన్నిని గురించి అలా అనుకునేటంత గర్వమా!" కోపం వచ్చేసింది అతనికి. అయినా మెయిసీని అశ్రద్ధ చేస్తున్నానా అనే బాధ కూడా కలిగింది. ఆమె అనురాగం పొందే అవకాశం ఏదయినా ఉంటే యీ సందర్భంలో పూర్తిగా నశిస్తుంది కదా, అనుకున్నాడు. తన ఊరికి పిలిచి, ఆమె సంగతే పట్టించుకోకపోతే మెయిసీ వంటి అమ్మాయి ఊరుకుంటుందా?

అందుచేత తన పిన్ని హ్లా మెయిసీ ఇవ్వమన్నదని ఇచ్చిన చీటీ చదువుకుని అంతగా ఆశ్చర్యపడలేదు. అవసరంగా పట్నం వెళ్లిపోవలసి వచ్చిందని వ్రాసింది. ఉదయమంతా ఆమెని కలవనే లేదు. చీటీ చాలా మర్యాదగా ఉంది కాని .... ఇంజన్ మీద నమ్మకంలేక కారుని అక్కడే వదలి పోతున్నానని వ్రాసింది. తను వచ్చేటప్పుడు, "దయచేసి, తీసుకురాగలడా?"

హ్లా పిన్ని చాలా నొచ్చుకుంది. "పాపం, అమ్మాయి చాలా సరదాగా కొన్ని రోజులు గడుపుదా మనుకుంది!" అంది. కోకోటిన్ మనస్సు అయోమయ పరిస్థితిలో ఉంది. ఒకవైపు మెయిసీకి అన్నీ విడమరిచి చెప్పనక్కరలేదే అన్న భావం, మరొకవైపు ఇలా చెప్పకుండా పారిపోయిందే అన్న కోపం కలిశాయి. ఏమో, అసలు ఇంత లౌక్యంగా వెళ్లిపోయినందుకు సంతోషించాలేమో తను.

కోకోటిన్ ఏర్పాట్లలో మునిగిపోయాడు. పక్క బరిణె మోసుకునివచ్చే అమ్మాయి ఎన్నికలో ఆసక్తి చూపించాడు. ముచ్చటగా ఉండే పల్లెటూరి అమ్మాయిలని చూసి సంతోషంతో నిండిపోయాడు. మెయిసీ వంటి వారితో పోలిస్తే సహజంగా ఉన్నారు, అనుకున్నాడు. మహాపట్నంలో కూడా ఇంటికి భూషణంగా ఉండగలిగిన పుష్పాలు తన చిన్న ఊరిలో పూస్తాయన్న సంగతి ఆమెకి నిరూపించాలి, అనుకున్నాడు.

ఆశ్రమ ప్రవేశం చేసే రోజు రానే వచ్చింది. ప్రొద్దెక్కక ముందే ఉత్సవం బయలుదేరాలన్నారు. ఇంటిముందు రంగు రంగుల గుంపు తయారయింది. రాజులు ఏలే రోజులలో ధరించే దుస్తులు వేసుకున్న వృద్ధులు కొందరు ఆశ్రమం ప్రవేశించే అబ్బాయిల కోసం గుర్రాలని పట్టుకుని నుంచున్నారు. ప్రతి గుర్రం పక్కనే బంగారపు గొడుగు పట్టుకున్న అరుణాంబరధారి ఒకడు నుంచుని ఉన్నాడు. పసుపు బట్టలతోబాటు, తామర పువ్వులు, వెండి పాత్రల నిండా పువ్వులు, కానుకలు పట్టుకుని ఉన్నారు. అమ్మాయిలు.

ఎలాగయితే నేమి ఉత్సవం కదిలింది. ఎవరో అరిచారు : "ఇదిగో పక్క బరిణె తీసుకొస్తోంది!"

47 వ పేజీ చూడండి

# రామ చరిత మానస



## తులసీదాసు

### తెలుగు: ముంగర శంకర రాజు

## 6

మునులు రామలక్ష్మణులను దీవించిరి. పిమ్మట విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు, మునులు సీతా స్వయంవరము చూచుటకు బయలు దేరిరి. రామలక్ష్మణులను చూడ వచ్చిన నగర వాసులతో సభామండపము క్రిక్కిరిసిపోయెను. జనకుని సేవకులు అందరినీ యథోచిత స్థానములందు కూర్చుండ బెట్టుచుండిరి.

ఇంతలో రామలక్ష్మణులు రంగస్థలము ప్రవేశించిరి నక్షత్రముల మధ్య చంద్రుని వలె వారా రంగ స్థలమును రాణింపజేసిరి. రాముని జూచుటకు సభికులు సంబరపడుచుండిరి.

ఎవడు ఏ దృష్టితో రాముని చూచెనో వానికి ఆ భావములతోనే అతడు కాన్పించెను. వీరుల దృష్టికి వీరుడుగ, దుష్టుల చూపులకు భయంకరుడుగ, ఛద్మవేషధారులై వచ్చిన దైత్యుల కంటికి రౌద్రమూర్తిగ, నగరవాసులకు, వారీమణుల నేత్రముల కతడు నయనాభిరాముడుగా కన్పట్టెను. జనకభూపతికి, అతని భార్యకు బిడ్డవలెను, యోగీశ్వరులకు సచ్చిదానంద స్వరూపుడుగను గోచరించెను. ఇక జానకికి ఎట్లు గన్పడెనో! ఆమె సంగతి ఆమెకే తెలియని స్థితిలో నుండెను. ఇట్లు రాముడు నానా భావముల వారికి నానారూపములతో కనపడసాగెను.

ఆ కోసల రాజకుమారులు సభాసదుల చూపులను హరించి వారిని సమ్మోహితుల జేసిరి. సహజ సుందరులగు వారి రూపలావణ్యములు ఇతరుల హృదయములను హరించడములో వింత ఏమున్నది!

వారి ముఖములు చంద్రబింబమువలె ప్రకాశించుచుండెను. విరిసిన కలువలవలె కన్నులుండెను. చంద్రకిరణముల ధిక్కరించు చిరునవ్వు, దొండపండు వంటి పెదవులు, ముక్కు సంపెంగ మొగ్గ. అలినీలాలకములు, వాక్కులు మధుర మంజులములు, వేయేల నఖశిఖ పర్యంతము కాంతిచ్ఛటలు వెదజల్లుచున్నవారి చక్కదనమునకు కోటి మన్మథులు దీటురారు. నయనానందకరముగ రామలక్ష్మణులు సభామంటపమున శోభించిరి.

జనకనృపాలుడు విశ్వామిత్రునికి యజ్ఞశాల చూపెట్టి తన గృహ చరిత్రంతయూ (సీత ఇల్లు అలుకుచూ శివచాపమును ఎత్తి ప్రక్కకు పెట్టిన సంఘటన) వినిపించెను. అనంతరము వారిని తోడ్కొనివెళ్లి ఉచితాసనములపై ఆసీనుల చేసెను.

చంద్రుని జూచిన నక్షత్రములవలె రాముని రాకతో రాజుల ముఖములు వెలవెల బోయెను. వారు రాముని గురించి ఇట్లు ప్రసంగించుకొనిరి:

రాముడు తప్పక శివుని విల్లు ఎక్కుపెట్టగలడని ఒకడనెను. చాపము నెత్తకున్ననూ సీత వరమాల రాముని మెడలో పడుట తథ్యమని ఇంకొకడు నిశ్చయించెను. సోదరులారా, మన బల పరాక్రమములు కట్టిపెట్టి ఇక వచ్చినదారి పట్టుట మంచిదని ఒక రాజు చమత్కరించెను.

'శివుని విల్లు విరువకనే వీడు సీత నెట్లు వివాహ మాడగలడు! మేము సీత కొరకు యమునితో నైనా తలపడెద'మని ఒకడు అహంకారముతో ప్రతివాదన చేసెను. ఓ పృథ్వీపతులారా! వృథా వాదులాడి ప్రయోజనము లేదు. దశరథ తనయులు చండ ప్రచండులైన యోధులు. వారిని జయించగల సమర్థుడు ఈ సభలో లేడు. అదట్లుండ సీతారాములు కారణజన్ములు. వారిని జననీ జనకులుగా భావించి ధన్యులుకండి. అని ఒక ధర్మాత్ముడు హితబోధ చేసెను. ఇట్లు ఎవరికి తోచిన విధముగ వారు చెప్పుకొనిరి. ఇంతలో జనక మహారాజు ఆజ్ఞను పురస్కరించుకొని చతురులగు చెలికత్తెలు సీతను సభాస్థలికి తోడ్కొనివచ్చిరి. జగదంబిక జానకి స్వరూప సౌందర్యములు వర్ణింపరానివి. ఆమె చక్కదనమునకు సాటి రాగల ఉపమానములు లేవు. ముల్లోకములు గాలించినను మైథిలికి దీటైన మహిళ కనబడదు.

వాణి వదరుబోతు, రతి నిరంతర వియోగిని, లక్ష్మి గరళముతో పుట్టెను. ఈ మువ్వురు సీతకు సమానులు కారు. శృంగార సముద్రమును కామదేవుడే స్వయముగ మథించి ఒక నూతన లక్ష్మిని సృష్టించిననూ ఆమెను జానకితో పోల్చుటకు కవులు ముందుకురారు.

జగన్మోహిని జానకి కరకమలముల జయమాల ధరించి, చెలులతో గూడి రంగస్థలము చేరగనే దేవదుందుభులు మ్రోగెను. అప్సరసలు పుష్ప వర్షము కురిపించి గానము చేసిరి.

సీత ఆ మహాసభను ఒకమారు అవలోకించెను. ఆమె చూపులు శ్రీరాముని దివ్య విగ్రహముపై బడి సిగ్గుతో వక్రీభవించెను. ప్రజలు సీతారాముల దివ్య రూపములను చూచి "ఓ దేవుడా! ఈ జనకరాజు శివచాప మెత్తవలెనను ప్రతిజ్ఞ విడనాడి సీతను రామున కిచ్చి వివాహము చేయునట్లు అతనికి సుబుద్ధిని ప్రసాదించుము" అని పురజనులు భగవంతుని వేడుకొనిరి..

అంతట జనకుడు వందీ ప్రముఖులను పిలిచి వారితో తన ప్రతిజ్ఞను సభికులకు ప్రకటించ వలసినదిగా కోరెను. వందీజనులు రాజు ఆజ్ఞ ప్రకారము సభవారి నుద్దేశించి ఇట్లు చెప్పిరి:

"ఓ మహాజనులారా! విదేహ రాజు చేసిన ప్రతిజ్ఞ చేయెత్తి చాటుతున్నాము. సావధానులై వినండి. క్షత్రియుల భుజబల మనెడి చంద్రుని — మ్రింగటానికి రాహువు వంటిది శివధనుస్సు. దీని గట్టితనమూ, బరువూ, భారమూ సర్వులకు తెలిసినదే. బాణాసుర, రావణాసురులు మహా బలవంతులు. వారు సైతము దీనిని కదలించుటకు ప్రయత్నించి పరాభవము పొందిరి. ఈ త్రిపురారి కోదండమును నేడు ఎవరు విరచగలరో ..... జానకి వారిని త్రిలోక విజయ సహితముగా వరించగలదు."

జనకుని ప్రతిజ్ఞ విని భూపతులు ఉత్సాహితులైరి. తాము బలవంతులమని విర్రవీగుచుండిన వారు నడుములు బిగించి లేచిరి. ముందు ఒక్కొక్కరుగా వెళ్లి చాపమును పైకెత్తుటకు ప్రయత్నించి విఫలులైరి. పిమ్మట పదివేలమంది రాజులు కలసి కట్టుగా దానిని కదలించిరి. పట్టి చూచుకొలది దాని బరువు అధికమగుచుండెను.

కలిసి ఉండాలని సరదా. వాళ్ళ ఇల్లేమో ఊరికి చివరవుండటాన సాధారణంగా ఎవ్వరూ వెళ్ళేవారు కారు. అందులోనూ ఆ ఇంటికి ఇదివరలో 'దెయ్యాల మేడ' అని పేరు. ఇప్పు డేదో బాగుచేయించినా ఇంటి కాపేరు, ప్రజల్లో అభయం పోలేదు. ఆయనకు చుట్టాలూ, బంధువులూ అంతగా లేకపోవటాన, ఎవ్వరూ వచ్చేవారుకారు. అందుకని ఏమీ తోచక శ్యామసుందరి, నన్ను, నిర్మలను శని ఆదివారాలు వచ్చి వాళ్ల ఇంట్లో ఉండిపొమ్మని బ్రతిమాలేది. అప్పుడప్పుడు హాస్టల్‌లో అనుమతి తీసుకొని అలాగే ఉండే వాళ్ళం.

అలవాటు ప్రకారం ఒక శనివారంనాటి సాయంత్రం వాళ్ళింటికి వెళ్ళాం. ముగ్గురం హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటుండగా, నిర్మల చటుక్కున విరబోసుకున్న శ్యామసుందరి జుట్టు వైపు చూచి "దెయ్యంలా! ఏమిటలా జుట్టు విరబోసుక్కూర్చున్నావ్. జుట్టు చివర్న చిన్న ముడి వేసుకోవాలంటారు. లేకపోతే దెయ్యాలు పట్టుకుంటాయట" అన్నది.

శ్యామసుందరి నవ్వుతూ, "నాకా శాస్త్రం తెలియదే! సరే ఉండు" అని జుట్టు ముడివేసుకుంటూ, "అన్నట్టు ఈ ఇంట్లో ఓ చదువుకునే అమ్మాయికి మశూచికం వచ్చి పోయి, దెయ్యమయిందని చెప్పుకుంటారు. చాలా తెలివైనదట. అందంగా కూడా ఉండేదట పాపం! కాని మాకెవ్వరికీ దెయ్యం కనపడలేదు సుమా?" అన్నది.

మేమిద్దరం "అయ్యో" అని విచారిస్తుండగా శ్యామసుందరి "ఏమర్రా! అనుకోకుండా దెయ్యాల సంగతి వచ్చింది. ఏవైనా దయ్యాల కథలు చెబుదురూ, నాకంతగా తెలియదు" — అన్నది.

నిర్మల వాళ్ళ నాయనమ్మతో రోజూ, వంటింటి అవతల కూర్చొని, మాట్లాడి, తీరా ఒకనాడు ఆవిడ తలుపు తీసి చూచేసరికి మాయమై మరి కనపడ్డం మానేసిన దెయ్యంసంగతిచెప్పింది. నేను మా తాతయ్య చెప్పిన దయ్యాల కథలేవో చెప్తున్నాను. ఇంతలో ఉన్నట్టుండి "హోరు" మని వర్షం కురియడం మొదలు పెట్టింది. మరి కాస్సేపటికి గేటు తీసుకుని ఎవరో అమ్మాయి గబ గబా పరిగెట్టుకు రావడం కనిపించింది. నౌకరు రామన్నను ఆ అమ్మాయిని లోపలికి తీసుకు రమ్మని పంపింది శ్యామసుందరి. ఆ అమ్మాయి సన్నగా, తెల్లగా పాలిపోయినట్టున్నది. రాగానే మాకు "థ్యాంక్స్" చెప్పి, కుర్చీలో కూర్చుంటూ, తాను ఎవరో స్నేహితురాలింటికి బయలు దేరినట్టు, త్రోవలో అనుకోకుండా వర్షం వచ్చినట్లూ చెప్పింది. ఆ అమ్మాయి పేరు వసంతట.

నలుగురం కూర్చున్నాక శ్యామసుందరి "ఇంకా ఏవైనా దెయ్యాల కథలుంటే చెప్పండర్రా! సరదాగా ఉంటుంది" అన్నది.

నేను "ఆ! ఏమున్నాయి లెస్తూ! అన్నీ వట్టి గాలి కబుర్లే. వాటిని మన తరంలో ప్రత్యక్షంగా చూచిన వాళ్ళెవ్వరూ లేరు. మా పెద్దనాన్నగారన్నట్లు, ఎలక్ట్రిక్ దీపాలు వచ్చాక దెయ్యాలు పారిపోయాయి లేవే?" అన్నాను.

వసంత ఉలిక్కి పడ్డట్టయి బైటకు చూసింది. వర్షం ఇంకా బాగా ఎక్కువైపోయింది. రెండు మూడు గంటలకైనా తగ్గుతుందో లేదో చెప్పటం కష్టం. వసంతవైపు చూచి, "మరేం దిగులు పడకండి. టైమింకా నాలుగు అయింది. ఆరు, ఏడు గంటల వరకూ చూద్దాం. అంతగా తగ్గకపోతే మా శ్యామసుందరి మిమ్మల్ని కార్లో సురక్షితంగా మీ ఇంటికి దిగబెడుతుంది. లేదా! ఈ మాటు మీరిక్కడ ఈ పూట ఉండి పోయారా, శ్యామసుందరికి మరీ సంతోషం" అన్నది నిర్మల.

వసంత మెల్లిగా నవ్వుతూ, "అబ్బే! అందుకు కాదు. వర్షం వెలిసిపోయాక, నడిచే వెళ్ళిపోతాను, మా ఇల్లీ చుట్టు ప్రక్కలే ఉంది. మీరిందాకన్న మాటలకు నేను ఉలిక్కిపడ్డాను. నా ఈ చిన్న జీవితంలో దెయ్యాన్ని కళ్ళారా చూడలేదు కాని, వాటి చిత్రమైన చేష్టలు మాత్రం అనుభవంలోకి వచ్చాయి" అన్నది.

వెంటనే మేం ముగ్గురం "అదేమిటి! మాకు

"క్యాపిటల్ అంటే ఏమిటయ్యా!" ఇకనామిక్స్ ప్రొఫెసర్ ప్రశ్న.

"ఎవరివారి దగ్గరుండే డబ్బు"

"మరి లేబర్ అంటేనో" మళ్లీ ప్రశ్న.

"వాడి దగ్గరున్న డబ్బులో ఎంతో కొంత రాబట్టుకోటం" అని ఆ విద్యార్థి సమాధానం.

సూర్యనారాయణ (మధురాంతకం)

వినిపించమని" వేధించడం మొదలు పెట్టాం. వసంత మెల్లిగా మొదలు పెట్టింది.

"అప్పుడు నేను ఈ ఊళ్లో మా బంధువులింట్లో ఒక గదిలో ఉండి చదువుతుండేదాన్ని. వాళ్ళిల్లు చాలా పాతది. వాళ్ళకు డబ్బు ఆట్టే లేక, గోడలవీ బాగు చేయించి, ఇంటికి సున్నం వేయించేవారుకాదు. గోడలకున్న పెచ్చులు పూడి నేలమీద పడిపోతుండేవి. ఒక ఆదివారం బద్ధకంగా ఉండి, ఏమీ తోచక మంచంమీద పడుకుని గోడ వేపు చూస్తున్నాను. నాకు బాగా చిత్రలేఖనం వచ్చును. ఆ పెచ్చులూడిపోయిన చోట్లు చూస్తుంటే, విచిత్రాలైన చిత్రాలెన్నో కనిపించాయి. అన్నిటికంటె ముఖ్యంగా ఒకచోట అందమైన మైన అమ్మాయి రూపం కనిపించింది. అది నా భ్రమ ఏమో ననిపించేది. కానీ, ఆనాటినుండి రోజూ, ఆ గోడవైపు తిరిగినప్పుడల్లా చూడ్డం అలవాటై పోయింది. రోజుకు రోజూ, ఆ ఆకారం మరింత స్పష్టంగా కనిపించేది. మిగిలినచోట గోడమీది ఆకారాలు రక రకాలుగా మారినా, ఆ ఆకారం మాత్రం చెక్కు చెదరకుండా ఉండేది. నా ఆశ్చర్యానికి అంతులేదు! ఇలా ఉండగా నాకా రోజుల్లోనే జ్వరం వచ్చి, వారం రోజులు ఎక్కడికీ కదలలేక పోయాను. ఆ రోజుల్లో ప్రక్కమీద పడుకొని, ఆ గోడమీది బొమ్మనే చూస్తుండేదాన్ని. ఆ ఆకారం మరింత స్పష్టంగా కొట్టవచ్చినట్లు కనిపించేది. జ్వరం తగ్గినా, నీరసంగా ఉండి, రెండు మూడు రోజులవరకూ ఎక్కడకూ కదిలే స్థితిలో నేను. ఏమీ తోచక, ఒక రోజున ఆ ఆకారాన్నిబట్టి, ఆ అమ్మాయి చిత్రం గీశాను. ఎంత అందంగా ఉందో చెప్పలేను. అది నా పుస్తకంలో పెట్టుకున్నాను. నా పిచ్చి అంతటితో తగ్గలేదు! అలాంటి అమ్మాయి సజీవంగా, ఎక్కడో ఉండో తీరాలనే నమ్మకం పట్టుకున్నది. నాకు తెలిసిన వాళ్ళలో ఎవరైనా అలా ఉన్నారేమోనని చూస్తుండేదాన్ని. చివరకు సెలవల్లో ఇంటికి వెళ్ళినప్పుడు ఉండబట్టలేక అక్కయ్యకా సంగతి చెప్పి, అలాంటి అమ్మాయి కనిపిస్తుందేమోనని తనను కూడా చూడమన్నాను.

అక్కయ్య అది నా చేతిలోనుండి లాక్కొని "బాగానే ఉంది నీ వెర్రి! బొమ్మ బాగానే వేశావు కానీ, ఇలాంటి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు! నీకు డ్రాయింగు వచ్చు కాబట్టి ఆ గీతలలాగే కనిపించి ఉంటాయి. ఇది నీ దగ్గర ఉంటే చదువు చదివినట్లే! జాగ్రత్తగా చదువుకో!" అని చీవాట్లు పెట్టింది. ఎంత బ్రతిమాలినా ఆ అమ్మాయి చిత్రం ఇవ్వలేదు. తనే జాగ్రత్తగా దాస్తానన్నది. అలాగే ఫ్రేం కట్టించి తన బల్లమీద పెట్టుకున్నది. నేను చేసేదిలేక ఆ మాట మరిచిపోయి, చదువులో పడ్డాను.

అక్కయ్యకు పెళ్ళి కావడం అక్కా, బావ అమెరికా రికా వెళ్ళిపోవడం, అన్నీ అనుకోకుండా జరిగిపోయాయి.

ఒకనాడు అక్కయ్య దగ్గిరనుండి వచ్చిన ఉత్తరం చదువుతూ ఆశ్చర్యంతో కొయ్యబారిపోయాను. అక్కయ్యతో రిసెర్చి చేస్తున్న మాలిని అనే మళయాళీ అమ్మాయి, నేను వేసిన చిత్రం ముమ్మూర్తులా ఒకలా ఉన్నాయట! ఇంకో తమాషా జరిగిందట. ఇద్దరూ భారతీయులు కావడంతో బాగా స్నేహమయిందనీ, ఒకరోజు వాళ్ళింటికివచ్చి తన బల్లమీద ఉన్న నా పెయింటింగ్ చూసి, ఆ అమ్మాయి "అరే! నువ్వింత గొప్ప చిత్రకారిణివా? నా చిత్రం ఎంత బాగా వేశావ్!" అని తెగ పొగిడిందనీ—తనకేం చెప్పాలో తోచక, కాస్సేపు ఆలోచించి, అది వేసింది తను కాదనీ, తాము తీయించుకున్న గ్రూపు ఫోటో సరదాకు పంపగా, తన చెల్లెల్లయిన నేను వేసి పంపాననీ, కాస్త కల్పన జోడించి చెప్పిందట. అంతవరకూ తనా విషయమే గమనించలేదట. పైగా తన చెల్లెలు అందమైన అమ్మాయిల ఫోటోలు తెగవేస్తుందని—ఒక కోత కోసిందట. వెంటనే ఆ అమ్మాయి, తన ఫోటోలు నాలుగైదు ఇచ్చి, వాటిని వీలైనప్పుడు పెయింట్ చేయించమని చెప్పిందనీ—తనకూ కళలంటే చాలా ఇష్టమనీ, అయితే డ్రాయింగ్ మాత్రం రాదనీ — తనకూ సంగీతం చాలా బాగా వచ్చుననీ చెప్పింది. నీ కిష్టమైతే నీతో ఉత్తరాల ద్వారా స్నేహం కలుపుకోవాలని ఉంది. ఏమంటావ్" అని వ్రాసింది.

నా ఆశ్చర్యానికీ, ఆనందానికీ హద్దులులేవు. మెల్లిగా మాలినికి నాకూ స్నేహం కలిసింది. అక్క

**కలిసే ఆ పిల్లే నాకు తప్పూరా లభించింది. ఉత్తరా లలో అనేక విషయాలు చర్చించుకునే వాళ్ళం.** ఆ అమ్మాయివి చాలా చిత్రాలు గీశాను. కొన్ని నా దగ్గర పెట్టుకొని, కొన్ని తనకు పంపించాను. కొన్ని ఉత్తరాలలో ''నువ్వు నా రూపాన్ని కాగితం మీద సజీవంగా నిలిపి నన్ను సంతోష పెడుతున్నావు. సంగీతం తప్ప నాకేమీరాదు. దాన్ని నీకు బదులు మీ అక్కయ్యకు వినిపిస్తుంటాను''—అని వ్రాసేది.

కొన్నాళ్ళు పోయేసరికి మాలిని దగ్గరనుండి ఉత్తరాలు రావడం మానివేశాయి. అదేమిటో నా గోడమీది చిత్రం కూడా కళతప్పి, మసకగా కనిపించసాగింది. ఒకరోజు అదేమిటో తెల్లారి లేస్తూనే ఏమిటో బొత్తిగా హుషారుగా లేకుండా మందకొడిగా ఉన్నది. లేవగానే వాడుక ప్రకారం గోడ వైపు చూసి ''గతుక్కు'' మన్నాను! అక్కడ చిత్రం లేదు! ఏమిటో మనస్సంతా ఆందోళనగా ఉంటే, ఎలాగో మెల్లిగా కాలేజీకి బయల్దేరుతుండగా అక్క దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. అసలే కాలేజీకి వెళ్ళాలని లేదు. ఉత్తరం రాగానే

## గోడమీది గీతలు

మరీ వెళ్ళాలనిపించలేదు. ఇంట్లోకి వచ్చేసి మెల్లిగా ఉత్తరం విప్పి చదివాను. ''షాక్'' తిన్నట్లయింది. అందులోని వార్తలు చూస్తుంటే. మాలిని మశూచి వచ్చి పోయిందట. నే వ్రాసిన మాలిని పెయింటింగ్ కూడా మాయమై పోయిందట! నాకైతే ఎవరో ఆత్మబంధువులను పోగొట్టుకున్నట్లనిపించింది. భోరున ఏడిచాను. మాలిని వ్రాసిన ఉత్తరాలు, ఆ అమ్మాయి ఫోటోలు అన్నీ జాగ్రత్తగా పెట్టెలో పెట్టాను. అవి ఉన్నాయో లేవో కాస్సేపు చూద్దామని పెట్టె తీసిచూస్తే ఆశ్చర్యం! ఒక్క ఉత్తరం లేదు! ఫోటోలు లేవు. గదంతా వెదికాను''—అన్నది నిట్టూర్పు విడిస్తూ. వర్షం తెరిపి ఇచ్చింది.

వసంత చెప్పిన కథ ముందు అంతకుముందు విన్న దయ్యాల కథలన్నీ దిగదుడుపే ననిపించింది. నోట మాట రాక కూర్చున్న మమ్మల్ని చూసి, మన బుద్ధికందని, నమ్మశక్యంగాని విషయాలు ఇందులో కొన్ని ఉన్నాయి. వాటిని ఏ శాస్త్రజ్ఞానం తోనూ, పరిష్కరించలేము. ఎక్కడో అమెరికాలో వున్న మాలిని చిత్రం నా గోడమీది కెలా వచ్చింది? సరిగా అక్కకు ఆవిడ క్లాసుమేటుగా ఎలా జత పడింది? ఈ రెండూ పోనీ కాకతాళీయంగా సరిపోయాయనుకున్నా ఆవిడ పోగానే, ఆ చిత్రం, ఆవిడ వ్రాసిన ఉత్తరాలు ఎలా మాయమయ్యాయి? ఈ పని మానవాతీతమైన ఏ దయ్యాలో, దేవతలో చేసిన పనులని రూఢిగా నమ్మవల్సిందే! ఇంక అన్నిటికంటె చిత్రమైన చివరి విషయం—, అంటూ వసంత వెళ్ళిపోవడానికి లేచి నిలబడింది.

''అదేమిటో......'' అన్నది నిర్మల నెమ్మదిగా

''అది ఇదే! ఈ కథను నే నొక అరగంటక్రితం కల్పించి మీకు చెప్పడమే!'' అంటూ వెనుతిరిగి చూడకుండా వెళ్తున్నది.

''శుద్ధ మూర్ఖులమై, కట్టుకథను ఎంత శ్రద్ధగా విన్నామర్రా బాబూ'' అనుకొంటూ, వసంత వెళ్ళిన వైపు చూచేసరికి ఆవిడ ఎక్కడా లేదు! వసంత మాయమై పోయింది!!

(ఒక ఇంగ్లీషు కథ ఆధారంగా) ★

## చదువుల్రావు - బి. వి. సత్యమూర్తి



# ఆడంబరాలను విడనాడండి
# దేశసంపదను వృథా కానీయకండి

# జాన్ హోగాన్ చెప్పిన క్రిస్టీన్ కీలర్ కథ



## 3

మత్తు మందులు; మద్యం; గుంపుగా కలిసి అసహ్యం కలిగించే పనులు చెయ్యటం—ఈవిషయాల మీదనే బట్లర్లు తమ జీవితానుభవాలు రాస్తూ ఉండాలి అన్న విషయం నాకు బాగా తెలుసు. కాని కొంచెం సందేహిస్తూనే ఆ పని చేస్తున్నాను.

అభిజాత్య వర్గాలు, వేట వినోదాలు, 'బాల్ డాన్సులు' మొదలయిన వాటిని గురించి వర్ణించే పరిస్థితిలో నేను ఉన్నా బాగానే ఉంటుంది. కాని, అంత సాహసానికి పూనుకోలేను—ఎందుకంటే, నేను పని చేసినచోట మనుష్యులు, వారి వ్యాపకాలు వేరే రకంగా ఉండేవి.

ఈ మనుష్యులు మీకు బాగా తెలిసినవారు కదా!

మిస్ క్రిస్టీన్ కీలర్:

మిస్ మారిలిన్ రైస్—డేవిస్:

డాక్టర్ స్టీఫెన్ వార్డ్:

మిస్టర్ జాన్. ప్రొఫ్యూమో:

మిస్టర్ పీటర్ రాక్‌మాన్:

'లక్కీ' గోర్డన్:

ఈమధ్య బయటపడి, బ్రిటిష్ 'పరిపాలనా వర్గా'లన్నీ ఊపి పారవేసిన సంఘటనలలో ఈ వ్యక్తులు ముఖ్య పాత్రలు వహించారు; వారందరూ నాకు అప్త వర్గంలోని వారే.

రెండు సంవత్సరాలు మిస్ కీలర్, మిస్ రైస్ డేవిస్‌ల బట్లర్‌గా పని చేశానంటే ఎంత 'అప్తుడినో' మీరు గ్రహించే ఉంటారు.

(ఇంగ్లీషులో ఒక చిన్న శ్లేష వెయ్యాలంటే వారు నా 'మిస్ ట్రెసెస్'లు ఉంపుడుకత్తెలు, యజమానురాళ్లు అని కూడా అర్థం!, నేను వారి నమ్మిన బంటుని.)

నమ్మించి, వారి గుట్లు బయట పెడుతున్నాననే బాధ నాకు లేదు.

ఈ సంఘటనలన్నీ ఇప్పుడు చరిత్రలో అంశాలు అయిపోయాయి. వాటిని సరి అయిన దృక్పథంతో చూడటం అవసరం.

అసలు నేను ఉద్యోగంలో ఎలా చేరానో కూడా చెప్తాను—ఇటీవల జరిగిన నాటకంలో కనిపించిన పాత్రల నిజ స్వరూపాలు వేరే ఉన్నాయి.

మిస్ కీలర్ సంగతే తీసుకోండి.

కొన్ని వారాలుగా బ్రిటిష్ ప్రజలముందు కులికింది. ఆమెని గురించి ఏమిటేమిటో రాశారు, ఎన్నో బొమ్మలు తీశారు, ఇష్టం వచ్చినట్లు ప్రచారాలు చేశారు.

ఆమె కూడా ఆరితేరిన నటివలె 'రంగం' ఎక్కింది. ఆమె పేరు చెబితేనే 'సొగసయిన జీవితం' యొక్క వివిధ స్వరూపాలు కళ్ళకి కట్టినట్లు అవుతుంది.

అయినా నేను ఆమెని మొదట చూసిన చోటు: ఒక పెద్ద అంట్ల పోగు. స్టాకింగ్‌లు చిరిగిపోయి ఉన్నాయి. ఆమె నోట్లో ఒకసిగరెట్ వేలాడుతోంది. ఆమె చుట్టూ డబ్బాలు, చింపివేసిన పొట్లాల పై కాగితాలు కుప్పగా పడి ఉన్నాయి.

నేను చకితుడి నయ్యాను. బట్లర్ ఉద్యోగానికి దరఖాస్తు వేసివచ్చిన నేను 'ంటర్‌వ్యూ'ని గురించి మరో విధంగా ఊహించాను.

అసలు ఈఉద్యోగం సంగతి చెప్పింది నా మిత్రుడు ఒకడు.

ఆర్. ఎ. ఎఫ్. ఆఫీసర్ల దగ్గిర చాలా ఏళ్ళు పని చేసి మంచి అనుభవం గడించాను. కనుక ఈ పనికి అర్హుడిననే చెప్పాలి.

నాకు మరొక అర్హతకూడాఉంది—విలువకల తివాసీలు శుభ్రంచేసి, మరమ్మత్తు చేసే విద్య నేర్చుకున్నాను. ఇది నా ఆర్. ఎ. ఎఫ్. ఉద్యోగంలో నేర్చుకున్నది. ఆ ఉద్యోగం వదలుకున్న తర్వాత కూడా తివాసీలు, మొదలయిన వాటిని శుభ్రం, మరమ్మత్తులు చేసే ఒక కంపెనీలో కొంతకాలం పని చేశాను.

ఇందుమూలంగా పెద్ద పెద్ద వారు కొందరితో పరిచయం ఏర్పడింది. లండన్‌లో ప్రసిద్ధిపొందిన ఇళ్లల్లోకి, రాయబార సంస్థలలోకి ప్రవేశం దొరికింది.

ఇవన్నీ నా ఇంటర్‌వ్యూలో పనికి వస్తాయన్న ధీమాతో 'మిస్ క్రిస్టిన్ కీలర్, హాకిన్ హవుస్, డాల్ఫిన్ స్క్వేర్,లండన్' అన్న చిరునామాకి వెళ్లాను.

డాల్ఫిన్ స్క్వేర్ భవనాలు యూరోప్‌లో కెల్లా ప్రసిద్ధి పొందిన వాటిలో కొన్ని. అక్కడ జీవనం చాలా ఖరీదయినది. పెద్ద బిరుదులు కలవారు, కంపెనీల మానేజింగ్ డైరెక్టర్లు, నట నటీమణులు, శాసన సభ్యులు మొదలయినవారు నివసించే స్థలం.

మిస్ కీలర్ ఎవరో పెద్ద లార్డ్, లేక డ్యూక్ కూతురు అయిఉంటుందని అప్పట్లో అనుకొన్నాను. కాని, ఆ రోజు నేను తిన్న 'షాక్' ఎటువంటిదో మీరే ఊహించుకోగలరు.

"నువ్వా!" అంది సిగరెట్ బూడిద తివాసీమీద పడేట్లు విదిలిస్తూ, సగం మూత పడిన కళ్ళతో నన్ను చూస్తూ. "లోపలికి రా!" అంది.

బయట బాగా ఎండగా ఉన్నా, గది కిటికీ తెర లన్నీ దించి ఉన్నాయి.

గదిలో ఎటుచూసినా ఎంగిలి గ్లాసులు చిందర వందరగా పడి ఉన్నాయి. ఏష్‌ట్రేలలో బూడిద నిండి బయటికి 'ఒలుకు'తోంది. నేలమీద దిళ్ళు, గాలిలో మనుష్యుల వాసన.

వంట గదిలోకి నడిచి వెళ్లాను. మిస్ కీలర్ ఒక 'సింక్' అంచుమీదకి వరిగి కూర్చుని మాట లేకుండా నా వైపే చూస్తూ ఉండిపోయింది.

నేనే నిశబ్దాన్ని భంగపరిచాను.

"పనిలో చేరటానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాను. "ఇప్పుడే చేరటానికి సిద్ధంగా ఉన్నాను."

కళా కాంతీలేని ఆమె మొహంలో ఒక చిరు నవ్వు మెరిసింది.

". ఓకే!" అని జవాబిచ్చింది. "చేరు. కాని నీ జీతం ఎప్పుడిస్తానో చెప్పలేను. ప్రతిరోజూ ఏదో కొంతముట్టచెబుతాను సరేనా?"

నాకేమనాలో తెలీలేదు. పనిలో చేరేముందు అన్ని వివరాలూ స్పష్టంగా చెబుతుందని అను కున్నాను. ఉద్యోగం అక్కరలేదని వెళ్లిపోదామను కున్నాను కాని, ఈ అమ్మాయిలో ప్రత్యేకత ఏదో ఉంది అనే ఊహ అప్పుడే నాలో కలిగింది.

ఆ విధంగా క్రిస్టిన్ కీలర్ గాలానికి చిక్కుకున్నాను.

ఆమె వస్త్రధారణం పూర్తి చేసుకుంటూ ఉండాగా ఒక కప్పు టీ చేసి ఇచ్చాను. తర్వాత ఇల్లు శుభ్రం చెయ్యటంలో మునిగిపోయాను. 'లివింగ్‌రూం' (రోజులో ఎక్కువభాగం గడిపే గది! లో ఒక దిండుకింద స్త్రీలు ధరించే చెడ్డీ ఒకటి దొరికింది.

పెట్టెకింద మరొక లోపలి వస్త్రం దొరికింది.

మరికొన్ని చోట్ల దొరికిన మరికొన్ని వస్త్ర విశేషాలనిబట్టి ముందు రాత్రి అక్కడ ఏదో ప్రత్యేకమయిన పార్టీయే జరిగి ఉంటుందని గ్రహించాను.

నా కొత్త-యజమానురాలు గదిలోకి వచ్చిన సవ్వడి విని అటు తిరిగాను. ఆశ్చర్యంతో ఊపిరి బిగుసుకుపోయింది.

మిస్ కీలర్ నగ్నంగా నా ముందు నుంచుని సిగరెట్ పొగ వదులుతూ కాలిమీద తగిలిన దెబ్బని పరీక్షిస్తోంది,

నావంక చూసి "ఏమిటి హోగాన్? దెయ్యం చూసిన వాడిలా ఉన్నావు?" అని అడిగింది నవ్వుతూ.

"లేదండీ" అన్నాను వీలయినంత గంభీరంగా. "అంతా బాగానేఉంది."

కష్టంతో కాళ్ల చేతుల వణుకుని అదుపులో పెట్టుకుని అడిగాను: "షాపింగ్ ఏమయినా చెయ్యమంటారా?"

కూరగాయలు, వంటసామగ్రి ఏవో అవసరం అంది. బయటగాలి పీల్చవచ్చుకదా అనుకుంటూ వీధిలోకి వెళ్లాను.

షాపుల వైపుగా నడిచి వెడుతున్నంతసేపూను విచిత్ర యువతి మీదనే నా ఆలోచనలన్నీ—ఇంకా ఏ ఏ కష్టాలూ, షాక్‌లు తింటానో, అనుకున్నాను.

అందుకు ఎక్కువకాలం ఆగే అవసరం లేక పోయింది.

నేను తిరిగి ఇంటికి వచ్చేసరికి మిస్ కీలర్‌తో ఒక నీగ్రో వ్యక్తి ఉన్నాడు. పొడుగ్గా, బలంగా ఉన్నాడు. బుగ్గమీద పెద్ద మచ్చ.

పడక కుర్చీలో కూర్చుని మిస్ కీలర్‌తో క్రితం రాత్రి 'బాల్' గురించి మాట్లాడుతున్నాడు.

వారి మాటలు పూర్తిగా వినలేకపోయాను కాని రాత్రి ఏదో 'అర్గీ' (అవినీతికరమయిన సంఘటన ఏదయినా) జరిగి ఉంటుందని గ్రహించాను. ఈ 'అర్గీ' లో ముఖ్య పాత్ర మిస్ కీలర్‌దేనని కూడా గ్రహించగలిగాను.

అక్కడినుంచి మిస్ కీలర్ పడకగదికి వెళ్లాను. చిందర వందరగా ఉంది. ఎటు చూసినా బట్టలు పడి ఉన్నాయి.

గది సర్దుతూ ఉండగా తన నీగ్రో మిత్రుడి నడుం చుట్టూ చేతులు వేసుకుని, మిస్ కీలర్ లోపలికి వచ్చింది.



కీలర్ నేస్తం మాండీరైస్ డేవీస్

ఇద్దరూ సిగరెట్లు కాలుస్తున్నారుకాని వారు కాల్చేవి మామూలు సిగరెట్లు మాత్రం కావు. చేత్తో చేసినట్లు సన్నగా, కనిపిస్తున్నాయి.

పొగ వాసన తమాషాగా ఉంది. తియ్యగా, వికారం పుట్టించేట్లు ఉంది. ఏమిటో వెంటనే తెలుసు కున్నాను. మారిజువానా సిగరెట్లు!

మిస్ కీలర్ తండ్రికి ఉండవలసిన వయస్సుంది నాకు. ఆమె నోట్లో సిగరెట్‌ని లాగి పారేద్దా మనుకున్నాను.

కాని, ఆమె, ఆమెతో మరోమనిషి ఇద్దరూమత్తు మందు ప్రభావంలో ఉన్నారు. వారి 'భ్రాంతి'ని భంగపరిస్తే ఏ ప్రమాదానికి లోనవుతానో అని భయపడ్డాను.

ఇద్దరూ నన్ను గమనించినట్లే లేరు. నావైపు చూస్తున్నా, నేను వారి చూపులకి అడ్డు వచ్చి నట్లు లేను. వారి కళ్లు గుడ్డిగా, గాజు ముక్కలలాగ మెరుస్తున్నాయి. నేనున్నానన్న సంగతే మరిచి గాఢ పరిష్వంగంలో మునిగిపోయి ఉన్నారు......

చడీ, చప్పుడు లేకుండా అక్కడినుంచి వెళ్లి పోయాను. గది తలుపు నెమ్మదిగా మూసివేశాను.

రాత్రి ఇంటికి చేరిన తర్వాత నా భార్య విక్టోరియా కొత్త ఉద్యోగం గురించి అడిగింది. ఎవరో 'మాడెల్' (ప్రకటనలలో ఫొటోలలో కనిపించే స్త్రీ) వద్ద కుదిరారని చెప్పాను. మొదటిరోజునే ఎదురయిన వింతలన్నీ ఆమెకి చెప్పే ధైర్యం నాకు అప్పట్లో లేకపోయింది.

కథ ఇంత దూరం వచ్చాక నాకు మొదటిరోజు ఎదురయిన సంఘటన వంటివి ఎన్నో ఎదురయ్యాయని వేరే చెప్పనక్కరలేదు. సాధారణంగా పనిలోకి వచ్చేసరికి మిస్ కీలర్ మంచంమీద ఆమెతోబాటు మగమనిషి ఎవరో ఒకడు పడుకుని ఉండటం చూసేవాడిని.

అయినా—ఈ సంగతి స్పష్టంగా ఇప్పుడుకూడా చెప్పడం అవసరం—ఆమె మామూలు పడుపుకత్తె మాత్రం కాదు.

మళ్ళీ చెప్తాను— ఆమె ఒక గణిక కాదు.

విచిత్రంగా ఉందా? విడమరిచి చెప్పనివ్వండి. సాధారణంగా పడుపు వృత్తికి పూనుకునేవారు వచ్చిన ప్రతివారి వద్దా డబ్బు తీసుకుంటారు. మిస్ కీలర్ ఈపని మాత్రం చేసి ఉండదని నా నమ్మకం.

అంతా సరదా కోసమే చేసేది. నేటి పరిభాషలో ఆమెని 'కిక్‌స్టర్' ('కిక్' అంటే 'సరదా' అనే అర్థం వస్తుంది కాబట్టి) అనవచ్చుననే సంగతి తెలియనంత ముసలివాడినయిపోలేదు నేనింకా! తనకి ఏది తోస్తే అది చేసెయ్యటమే ఆమెకి సరదా.

ఎవరితోనయినా తన శయ్య పంచుకుందామని ఆమె సరదాపడితే మధ్య మన కెందుకూ? అందులోనూ నాకు ప్రత్యేకంగా ఎందుకూ? అనుకునేవాడిని.

అప్పుడప్పుడు ఆమె దగ్గిర చిల్లిగవ్వ ఉండేది కాదు. ఇంటికి వచ్చిన రసికుడు వెళ్ళిపోయిన తర్వాత కూడా ఆమె దగ్గిర డబ్బు ఏమీ ఉండేదికాదు.

ఎప్పుడయినా ఒకసారిమాత్రం రసికుడు వచ్చి వెళ్ళిన తర్వాత ఆమె దగ్గిర డబ్బు మిగిలేది. ★

## సుప్రసిద్ధ ఆసియా కథలు-5



# వక్క బరిణె

రచన
షిన్ మియోచిట్

"వక్క బరిణెని పట్టుకుని వచ్చేవారెవరు ?"

ఇదీ అప్పుడు అతిముఖ్యంగా తోచిన ప్రశ్న. "మళ్లీ అడిగారంటే ఏదో అఘాయిత్యం చేసేస్తాను" ఇలాగని కోకోటిన్ అన్నాడు ఉద్వేగంగా, తన పొగగొట్టంలోని బూడిద బయటికి విదిలిస్తూ. "ఈ చిన్న విషయం గురించి ఇంత హడావుడి చేస్తారు దేనికి ? ఇది ఈ కుటుంబానికి సంబంధించినది ! మత సంబంధం కలది. పిల్లవాళ్లకి పసుపు బట్టలు వేసి ఆశ్రమానికి పంపటమే కదా ? అక్కడ సన్యాసులే వాళ్ల తలలు గొరిగి కావలసినన్ని పసపు బట్టలు పెడ్తారు. అంతే బ్రహ్మచారులయిపోతారు ఈ కుర్రవారంతా! దీనికి ఇంత సంగీతం, ఊరేగింపు, గుర్రపు స్వారీలు ఎందుకంట !"

కోకోటిన్ తనలో మాట్లాడుకోవటంతోనే సరిపోయింది. లేకపోతే అతని మాట వినేవారెవరు ? తన ఊరికి చుట్టూ వరిచేను వేసి ఉన్న ఒక చిన్న ఊరికి—తిరిగి వచ్చినప్పుడే తనని ఒక విధంగా చూచారు. చుట్టాలందరూ పల్లెటూరివారే; వాత్సల్యంతో స్వాగతం పలికారు. కాని, ఎందుకో కాని తన చిన్నప్పటి సరదా, ఉల్లాసం లేవు.

"కాలం మారిపోయింది." అన్నాడు. అయితే తనే కొంతవరకు బాధ్యుడినన్న సంగతి తనకీ తెలుసు. తన తాలూకు వారంతా అలాగే ఉన్నారు—దాపరికంలేని రైతుజనం. తను మారిపోయాడు. పల్లె వాతావరణాన్ని చవిచూసి ఆనందించే బడిపిల్లవాడు కాదు, తనిప్పుడు. విదేశాలకి వెళ్లి పెద్ద బిరుదులతో తిరిగి వచ్చిన పెద్ద లాయరు; ఈ చిన్న ఊరిలో పరాయి వాడయిపోయాడు.

కోకోటిన్ పెద్ద నగరం నుంచి రావటానికి కారణం ఉంది : "నా కొడుకులని ఆశ్రమానికి పంపిస్తున్నాను, తప్పక రావలసింది" అని వ్రాశాడు తన పినతండ్రి. "తాతయ్య చూపు పోయేలోగా తన కళ్లతో వారు పసుపుబట్టలు వేసుకోగా చూసి ఆనందిద్దా మనుకున్నాడు. విదేశాలనుంచి వచ్చిన, తరువాత చాలా పనులు ఉండి ఉంటాయి నీకు. కాని నిన్ను చూచి చాలారోజు లయింది. ఈ సందర్భంలో నయినా మన కుటుంబంవారంతా కలవచ్చు. తాతయ్య చాలా సంతోషిస్తాడు. వీలయితే నిన్నూ ఆశ్రమానికి పంపిస్తాము. చిన్న పిల్లలని ఆశ్రమానికి పంపించే సమయంలో ఒకబ్బాయిని కూడా పంపించటం మనలో ఆచారం. దురదృష్టవశాత్తు నా కొడుకులలో ఎవరికీ 20 సంవత్సరాలు నిండలేదు. నువ్వొకడవే ఉన్నావు, ప్రస్తుతం ! మన కులాచారాన్ని నిలబెట్టటానికి తోడుపడ్తావని ఆశిస్తాను. వక్క బరిణెని తీసుకువచ్చే వారెవరో చూడాలి ! మీ పిన్ని హడావుడి ఇంతా అంతా కాదు !"

తను చిన్నపిల్లవాడుగా ఆశ్రమానికి వెళ్లినప్పుడు పెద్దగా తన పినతండ్రే వచ్చాడు. అప్పుడు చేసిన హంగామా ఇంతా అంతా కాదు. ఊరేగింపులో ఆడపిల్లలు పసుపుబట్టలతోబాటు, సన్యాసులకి కానుకలు కూడా మోసుకుని వచ్చారు. వారందరిలో ప్రముఖురాలు వక్క బరిణె తీసుకు వచ్చే అమ్మాయి. అందరికన్నా అందగత్తె, అని పేరుమోసిన అమ్మాయి.

ఉత్సవంలో అబ్బాయిలు వక్క బరిణె మోసే అమ్మాయిని వేళాకోళం చేస్తూ పాడిన పాటలు తల్చుకుంటే ఇప్పటికీ నవ్వు వచ్చింది తనకి—"పసుబట్టలతో ఆశ్రమానికి వెళ్లే ఆ అమ్మాయి ప్రియుడు ఆశ్రమంలోనే వారంరోజులు ఉండిపోతే ఆమె కెలా ఉంటుంది ? వారం బదులు మూడు నెలలబాటు ఉండిపోతే ?" ఈ అర్థం వచ్చే పాట వినగానే వాద్యగాళ్లందరూ పెద్దగా వాయించేవారు. అమ్మాయి గుండెలో ఈ సంగీతాన్ని పోలిన ఘోష బయలుదేరిందా ? ఎవరో అరిచారు. "వక్క బరిణె పడెయ్యక !"

ఇది పదిహేనేళ్ల క్రితం జరిగింది. అప్పుడు ఆశ్రమానికి వెళ్లిన తన పినతండ్రి వక్కబరిణె మోసిన అమ్మాయిని పెళ్లి చేసుకొన్నాడు. ఆ అమ్మాయి ఇప్పుడు తన పిన్ని హ్లా. మళ్లీ తమ కుటుంబంలో ఒక చిన్న పిల్లవాడినీ, పెద్దవాడినీ ఆశ్రమానికి పంపిస్తున్నారన్నమాట. ఇది ఊరంతా పాల్గొనే శుభకార్యం, అని నాకు తెలుసు. కాని, వక్కబరిణె మోసే అమ్మాయిని ఎన్నుకొనటంలో "మిస్ యూనివర్స్" పోటీలో అమ్మాయిని ఎన్నుకొనటంలో చేసే హడావుడికన్నా ఎక్కువ హడావుడి చేస్తారని తను ఊహించలేదు. ఇది ఊరి 'అందాల రాణి' మాత్రమే కాక ఇంటి కోడలిని కూడా ఎన్నుకునే సందర్భం అని మెల్లిగా గ్రహించాడు.

తన ముందు తరాలవారికిది బాగావే ఉంది. వక్క బరిణె తీసుకువచ్చే అమ్మాయి, వివాహం చేసుకునే అబ్బాయి ఇద్దరూ చిన్నప్పటి నుంచి ఒకరికొకరు తెలిసే ఉంటారు. వారి పరిచయం క్రమంగా వలపుగా మారుతుంది. తన సంగతి మాత్రం వేరు. తన పినతండ్రివలె కాక పెద్ద పట్నం పాఠశాలలో చేరాడు తను. ఎప్పుడయినా ఇంటికి సెలవులకి వచ్చేవాడు.

తను మాత్రం ఈ చిన్న ఊరికి తగనని అనుకుంటున్నాడా ? లేదే ! దూర దేశాలలో ఉన్నప్పుడు కూడా తన సొంత ఊరి స్మృతులు ఎంత ప్రియంగా ఉండేవి తనకి—'పగోడా' (ఆలయం) ఉత్సవాలు వాటికోసం ఎద్దుబళ్లలో పక్క ఊరి నుంచి వచ్చే మనుష్యులు, సంగీతం, నృత్యాలు ఇవన్నీ.

కోకోటిన్ నిట్టూర్చాడు. పైప్ (పొగగొట్టం) పొగ లాగి వదిలాడు. తను ఈవిధంగా స్వగ్రామం వ్యవహారాలలో ఇరుక్కుపోతానని ఎప్పుడూ అనుకోలేదు. వక్క బరిణె మోసినంత మాత్రాన ఎవరో ముక్కు మొహం ఎరగని పిల్లని పెళ్లి చేసుకోవలసిందేనా ?

"నీకు ఎవరు మొయ్యాలని ఉంది ?" అని అడిగింది తన పిన్ని హ్లా. ఎర్రలక్క వక్క బరిణెని సిల్కు గుడ్డతో శుభ్రం చేస్తోంది. నగిషీలు చెక్కి, మూతమీద విచిత్రమయిన పక్షి బొమ్మ ఉన్న ఆ బరిణెని తప్పకుండా ఒక అందమయిన అమ్మాయి తీసుకురావలసిందే.

ఇంతక్రితం దానిని తీసుకువెళ్లిన అమ్మాయి యిప్పుడు ఒక ప్రౌఢ. ఆమె కళ్లలో ఏవో పాత జ్ఞాపకాలు మెదులుతున్నాయి. కోకో అన్నాడు ఆమెని పొగడే ఉద్దేశంతో : "ఈ బరిణెని మోసిన రోజుకన్నా ఇంకా అందంగా కనిపిస్తున్నావు!"

పిన్ని ముఖం సంతోషంతో ఎర్రబడింది. "సరే కాని, నా ప్రశ్నకి జవాబు చెప్పు ! పోనీ పట్నంలో ఎవరయినా .... ఊ .... స్నేహితురాలుంటే తీసుకురా ! ఇక్కడ ...." కోకోటిన్ కంగారుతో చేతులు ఎగరవేశాడు. "పట్నంలో అమ్మాయి ఇలా వీధుల వెంబడి బరిణె పట్టుకుని ఊరేగుతుందనుకున్నావా ?"

"తప్పేముంది ? పెద్ద మర్యాద కదా ఇది !"

"నీకు తెలీదు పిన్నీ ! ఈ కాలంలో వీటన్నిటినీ లెక్కచెయ్యరు .... అసలు ...." కోకో పట్నం పిల్లల పద్ధతులు తన పిన్నికి ఎలా నచ్చచెప్పాలో తెలియక ఆగిపోయాడు.

"నేనప్పుడు వేసుకున్న చొక్కా ఇంకా బాగానే ఉంది." అంది ఆవిడ దానిని పెట్టెలో నుంచి బయటికి తీస్తూ. చదరంగా, కొంచెం ఎరుపు తిరిన ఆర్చిప్ప రంగులో నల్ల మెడ కల ఈ చొక్కాని నడుం చుట్టూ ఒక పట్టాతో ధరిస్తారు. పై భాగంలో బంగారు, వెండి దారాలతో చమ్కీలు ఉన్నాయి. కింద భాగంలో నల్లటి

త్రము కదలలేదు. వరాభూతులైన భూపతు లందరూ సిగ్గుతో తలలు వంచుకొని సభలో కూర్చొనిరి.

పృథ్వీపతుల ప్రయత్నము లిట్లు విఫల మగుట జూచి జనకుడు చాల చింతించెను. అంతట రాజు రోషముతో రేడుల నుద్దేశించి ఇట్లనెను :

"ఓ సభాసదులారా ! నా ప్రతిజ్ఞ విని, నానా లోకముల నుండి యోధులు, వీరులు, పరాక్రమ వంతులు, స్వయంవరమున కొచ్చితిరి. కానీ ఈ ధనుస్సు విరిచి నా కన్యను వరించు యోగ్యత గల వానిని బ్రహ్మ సృష్టించలేదు. కోదండమును కదిలించుటయే గగనమైనపుడు, ఇక దానిని విరుచు ప్రసంగమే వ్యర్థము గదా ! వట్టి వీరా లాపములతో పనిలేదు. మీ ఆశలను వదలుకొని మీమీ యిండ్లకు దయచేయుడు. మా జానకికి వివాహప్రాప్తి లేదు కాబోలు. ఈ భూతలము నిర్వీర్యమై పోయినదని ముందుగనే తెలిసి యుండిన ఇట్లాంటి ప్రతిజ్ఞచేసి పరిహాసమునకు గురికాక ఉండియుందును. ఇపుడు ప్రతిజ్ఞ వదలుకొనుట భావ్యముకాదు. ఈ లోకములో వీరులు లేరా !"

జనకుని పలుకులు లక్ష్మణుని హృదయమున ములుకులై తగిలెను. అతడు అన్నకు నమస్క రించి, రోష కషాయిత నేత్రుడై ఇట్లు ప్రతిజ్ఞ చేసెను :—

"ఓ సభాసదులారా ! రఘుకులస్థు లున్న సభలో ఇట్లు అసందర్భముగా మాట్లాడరాదు. రఘుకుల మణి రాముడున్నచోట ఇవ్విధముగ మాట్లాడుట మరీ అనుచితము. ఓ రఘూత్తమా, నీవు అనుమతించినచో ఈ భూమిని బంతివలె పైకి లేపి, పచ్చి కుండను కొట్టినట్లు దానిని బద్దలు చేయగలను, మేరుపర్వతమును ముల్లంగి వలె విరచివేయగలను. మీ ప్రతాపము ఎదుట ఈ పురాతన చాప మెక్కడ ! ఓ నాథా ! మీరు అజ్ఞా పించినచో క్షణములో ఈ కోదండమును పుట్ట గొడుగును త్రుంచినట్లు విరచివేయగలను. లేదా, బ్రతికియున్నంత కాలము విల్లంబులు చేపట్టనని ప్రతిజ్ఞ చేయుచున్నాను."

లక్ష్మణుని ప్రతిజ్ఞకు భూమి కంపించెను. దిగ్గజములు దిగులొందెను. రాజులు భయపడిరి. సీత సంతసించెను. జనకు డాశ్చర్యపడెను, ముని ప్రసన్ను డాయెను.

శ్రీరాముడు సంజ్ఞచే లక్ష్మణుని నివారించి ప్రేమతో ప్రక్కన కూర్చుండబెట్టుకొనెను. అంతట విశ్వామిత్రుడు—

"రామా, ఇక నీవు లెమ్ము, శివచాపము విరిచి జనకుని దుఃఖము తొలగించుము" అని మృదువుగ పలికెను.

రాముడు గురుచరణములకు నమస్కరించి మృగరాజువలె పైకి లేచెను. అప్పుడు రాముని ముఖము హర్ష, విషాదములు లేని సమభావముతో దీపించెను. ధీర గంభీరుడై నిలబడిన రాముడు, ఉదయాచలముపై ప్రకాశించు బాలభానుని వలె యజ్ఞ—మండపమున రాణించెను.

సూర్యోదయమును జూచిన నక్షత్రములు, కుముదములు, ఉలూకములు తమ తమ ఉత్సాహ మును బోగొట్టుకొనునట్లు రాముడు లేవగనే రాజుల ముఖములు కాంతిహీనమయ్యెను.

సకల జగత్స్వామి శ్రీరామమూర్తి మత్తగజము మాడ్కి యజ్ఞమండపమునకు నడచెను. సర్వ జనులు రాముడు శివచాపమును కమలనాళమువలె త్రుంచుగాక యని దేవత లందరిని ప్రార్థించిరి.

కానీ సీత తల్లి వాత్సల్యమయి, ఆమె వ్యాకుల ముతో చెలికత్తెలను బిలచి ఇట్లు గద్దించి పలికెను :

అమ్మలారా ! ఇది యేమి వింత ! స్త్రీ పురుషు లందరూ, నిలబడి వేడుక చూస్తున్నారు. వీరిలో రాజుకు సత్యము చెప్పువారు ఒక్కరు కానరారే! రావణుడూ, బాణుడూ, ఎత్తలేని ఈ భయంకర శివచాపమును పాపమూ బాలుని చేతులలో పెట్టుట న్యాయమా !

ఎక్కడైనా మందరాచలమును బాలమరాళము మోయగలదా ! మీరైనా పోయి రాజుతో ఇది అన్యాయమని ఎందుకు చెప్పరు ?"

అని చింతించుచున్న జానకి తల్లితో ఒక చెలికత్తె—"అమ్మా తేజోవంతులకు వయస్సుతో పనిలేదు. అగస్త్యుడు సముద్రములను పానము చేయలేదా, చిన్న మంత్రమునకు మహా దేవతలు కట్టుబడలేదా ! అల్పమైన అంకుశమునకు మత్త గజము లొంగుటలేదా ! కాబట్టి నీవు రాముని గురించి విచారించకుము—"అని చెప్పి శాంతపర చెను.

ఆ సందర్భమున సీత హృదయాందోళన చెప్ప నలవికాదు. ఆ ఒక్క క్షణము సంతోషముతో ఆమె దేహము పులకరించును, మరొక క్షణము భీతిచే దిగులుపడును. ఒకప్పుడు రాముని జూచును, మరొకప్పుడు భూమిని పరికించును. సంశయము దిగులు ఉత్సాహముతో ఆమె మనస్సు కళవళ పడెను. శివధనుస్సు భారమును తొలగించి రామునికి వశమగునట్లు కరుణించమని మనస్సులో శివ పార్వతులను ధ్యానించెను.

అయ్యో మా తండ్రి యెంత కఠిన ప్రతిజ్ఞ చేసెను. ఈ మంత్రి సామంతులు అతనికి బుద్ధి చెప్పరే అని మథనపడెను. ఓ గంగాధరుని చాపమా ! నీకు మ్రొక్కుచున్నాను. రామునికి లోబడుము అని శివధనుస్సుకు మనమున మ్రొక్కులిడెను. ఆమె హృదయము పరి పరి విధముల వ్యాకులతకు లోనయ్యెను. తుదకు ఆమె ధైర్య మవలంభించి, రాముని తట్టు దీక్షగా చూచి—త్రికరణశుద్ధిగా నా మనస్సు రఘురాముని చరణకమలములందు లగ్నమై యున్నయెడల ఆ సర్వాంతర్యామి భగ వంతుడు నన్ను శ్రీరాముని చరణదాసిగా చేయును" అని మనస్సును దృఢపరచుకొనెను.

రాముడు జానకివైపు చూచి ఆమె అభీష్ట మును గ్రహించెను. వెంటనే అతడు గరుత్మం తుడు సర్పమును జూచు విధమున శివధనుస్సును వీక్షించెను. రాముడు శివచాపము ఎత్తబోవు చున్న సమయమున లక్ష్మణుడు—ఓ దిగ్గజము లారా, శేష, వరాహ, కచ్ఛపములారా, రాముడు శివధనుస్సు విరచనున్నాడు. మీరు భూమిని కంపించకుండునట్లు ధరింపుడు—అని ఆజ్ఞా పించెను.

జనకుని బాధ, జానకి దుఃఖము రాణిం సంశయము, రాజుల అభిమానము తొలగించు భారము రాముని బాహువులపై నుంచి, పురజనులు ఆతురతతో చూచుచుండిరి.

# రామచరితమానస్

అంతట శ్రీరాముడు జనులను, జానకిని ఒకే మారు కలయజూచి, గురుచరణములకు మనస్సులో నమస్కరించి అతి లాఘవముగ చాపము పైకెత్తెను. దానిని చేతితో ఎత్తినపుడు అది మెరుపు వలె తళుక్కున మెరిసెను. వంచినపుడు ఆకాశము వలె వంగెను. కోదండమును ఎత్తుట, సంధించుట, వంచుట ఒక క్షణములో జరిగిపోయెను. అందరూ దృష్టులప్పగించి చూచుచుండిరే గానీ ఎవరికీ ఏమాత్రమూ కనబడలేదు. త్రుటికాలములో రామచంద్రుడు దానిని రెండు తుంటలుగ విరచివేసెను. ఆ విరిగిన శబ్దము భూనభోంతరాళముల వరకూ వ్యాపించెను.

శ్రీరాముడు శివచాపమును రెండు ఖండములుగా చేసిన దృశ్యము చూచిన విశ్వామిత్రుని హృదయము ఉత్సాహముతో సముద్రమువలె ఉప్పొంగెను. చంద్రుని చూచిన చకోరమువలె లక్ష్మణుడు అన్నను చూచి ఆనందించెను. వాడిన వరిచేలకు వర్షము పడినట్లు రాజు, రాణులు హర్షించిరి. అపూర్వమైన జానకి ఆత్మానందము వర్ణింప శక్యముకాదు.

శతానందుని యాజ్ఞ ప్రకారము చెలికత్తెలు వెంట నడువ, జయమాల చేత బుచ్చుకొని బాల మరాళమువలె సీత రాముని వద్దకు వచ్చెను.

ప్రేమ, ప్రసన్నత, సిగ్గు, ముప్పిరిగొనుచుండ జానకి కంపించుచున్న కర కమలములతో రామచంద్రుని కంఠమును జయమాలతో అలంకరించెను.

శంఖము, శహానాయి, భేరి, మృదంగ మంగళ ధ్వనులు మిన్నంటెను. దేవతలు దుందుభులు మ్రోగించి పుష్పవర్షము కురిపించిరి.

సురులు, నరులు, నాగులు, యక్షులు, కిన్నరులు, గంధర్వులు జయజయ ధ్వానములు చేయుచూ సీతారాములను దీవించిరి. సఖులు చెప్పిననూ సీత సిగ్గు సంశయముచే రాముని పాదములకు నమస్కారము చేయలేకపోయెను. మణిరత్నములు గల హస్తములతో రాముని పాదములు స్పృశించి నమస్కరించుటకు సీత వెనుకాడెను. అది గ్రహించి రాముడు చిన్నగ నవ్వుకొనెను.

సభలో కొద్దిమంది క్రూరులు, మూఢులగు రాజులుండిరి. వారు సీతను చూచి కామాతురులై ఇతర రాజులతో ఇట్లు పలికిరి :—

"మిత్రులారా—త్వరపడుడు, మనము బ్రతికి యుండగా సీత నెవరు కాజెయ్యగలరు ? కోదండము విరవడమే గొప్పతనమా ! రామలక్ష్మణులను వారికి తోడైవచ్చిన యెడల జనకుని కూడ బంధించి, సీతను తీసుకొని పోవుదము" అని కయ్యమునకు కాలు దువ్వుచూ ప్రసంగించిరి.

అంతట సభలో నున్న కొద్దిమంది విజ్ఞులు పైకిలేచి — అయ్యా ఇక మీ ప్రగల్భములు కట్టిపెట్టి ఇండ్లకు కదలండి. విల్లు విరచుటకు ప్రయత్నించినపుడే మీ బలపరాక్రమము లేపాటివో నలుగురికి తెలిసిపోయినవి. ఇట్టాంటి బుద్ధిమంతులు గాబట్టే మొఖానికి అప్పుడే మసి పూసుకొంటిరి. సింహము ఆహారము కుందేలు ఆశించినట్లు సీతను కోరుట వ్యర్థము. ఆ లక్ష్మణుని క్రోధాగ్నికి వృథాగా యెందుకు ఆహుతి కాదలంచెదరు. మదమాత్సర్యములు వదలిపెట్టి నిండు హృదయముతో

ఆ సీతారాములను జూచి ఆనందించుట మంచిది. అవి ప్రత్యుత్తర మిచ్చిరి.

## పరశురాముని ప్రవేశము

వాద ప్రతివాదములతో సభలో కలవరము బయలుదేరెను. లక్ష్మణుడు రాజులవైపు చుర చుర జూచెను. స్త్రీ పురుషులు ఏమగునో యని దిగులుపడిరి. ఇంతలో శివచాపము ఖండింపబడిన వార్త విని పరశురాముడు మండిపడుచూ అచ్చటికి వచ్చెను.

దృఢకాయుడు, ఆజానుబాహుడైన పరశురాముడు కాషాయాంబరములు ధరించియుండెను. భుజమున యజ్ఞోపవీతము, కంఠమున రుద్రాక్ష మాల, లలాటమున విభూతి అలంకరింపబడి యుండెను. ఒకచేత విల్లంబులు, మరొకచేత పరశువు పట్టుకుని వీరావేశముతో అరుదెంచిన ఆ భృగుకుల మార్తాండుని వాలకము చూచి సభికు లెల్లరు భయకంపితులై దిగ్గున లేచి నిలబడిరి. జనకుడు విధేయత ఉట్టిపడుచుండ అతని పాదములకు సాష్టాంగ నమస్కారము చేసి, కుమార్తె జానకిని పిలిచి నమస్కరింపజేసెను. విశ్వామిత్రుడు పరశురాముని కుశలప్రశ్న వేసి రామలక్ష్మణుల రావించి వారిచేత అతనికి పాదాభివందనము చేయించెను. పరశురాముడు ఏమియు ఎరుగని వానివలె సభ నంతయూ ఒకమారు కలయజూచి ఈ సందడికి కారణ మేమని జనకుని ప్రశ్నించెను. జనకుడు సీతా స్వయంవర వృత్తాంత మంతయూ అతనికి తెలియజేసెను. అంతలో పరశురాముని దృష్టి భంగపడియున్న శివధనుస్సుపై పడెను. వెంటనే అతడు ఉద్రేకితుడై —

''ఓయీ రాజా, కాలకంఠుని కార్ముకము ఇవ్విధముగ ఖండించిన ఆ శుంఠ ఎవ్వడు ? వానిని శీఘ్రమే నాకు చూపించుము, లేకుండిన నీ రాజ్య ఖండము నంతయూ పెల్లగించి తిరుగవైచెద'' నని సింహగర్జన చేసెను. అతని అరుపుకు సభామంటపము ఘూర్ణిల్లిన ట్లయ్యెను.

జనకుని నోట తడిలేదు. ఏమి కీడు మూడనున్నదో యని స్త్రీ పురుషు లందరూ భీతావహులైరి. వీరి యవస్థను జూచిన శ్రీరాముడు భృగునందనుని ఎదుటకు వచ్చి శాంత గంభీర వచనములతో—''మహాత్మా ! ఈ శివధనుస్సును విరిచిన వాడు మీ సేవకుడను నేనే.'' అని సమాధాన మిచ్చెను. పరశురాముడు రామునివైపు చురచుర జూచి—

''ఓరీ, నీవు శత్రువు వలె నడచుకొని పైగా సేవకుడనని చెప్పుచుంటివా ! శివుని విల్లు విరిచినవాడు నాకు సహస్రబాహుడగు కార్తవీర్యునితో సమానుడైన శత్రువు. ఇచ్చోటు వీడి త్వరగా వెళ్లిపొమ్ము, లేకుండిన ఈ రాజులతో సహా నిన్ను ఇక్కడనే తుదముట్టించెదనని దట్టించి పలికెను.

అంతట లక్ష్మణుడు ముందుకు వచ్చి—''మునీశ్వరా ! మేము చిన్నతనములో ఎన్నియో ధనుస్సులను విరగగొట్టి యుంటిమి. ఇప్పుడు ఈ పురాతన చాపము విరిగిపోయినందులకు మీకింత ఆగ్రహ మెందులకు ?'' అని చిన్నగ అడిగెను..

లక్ష్మణుని మాటలకు పరశురాముని కండ్లు ఎర్రఎర్రబడెను. క్రోధావేశముతో పరశువు ఝుళిపించుచూ — ''ఓరీ మూర్ఖుడా, నీవు నన్నే ఎదిరించి మాట్లాడెదవా ! నీకు నా స్వభావము, చరిత్ర తెలిసినట్లు లేదు. ఈ భూమండలమున గల రాజులందరినీ హతమొనర్చిన క్షత్రియాంతకుడనని తెలియదు కాబోలు. ఇదుగో కార్తవీర్యుని వేయి చేతులను తెగగొట్టిన గండ్రగొడ్డలి ఇదియే చూడుము. దీని పేరు విన్న గర్భస్థ పిండములు సైతం జారి నేల పడును. బాలుడవని నిన్ను కనికరించి వూరకుంటిని.'' పరశురాముడు హుంకరించెను.

లక్ష్మణుడు అతని అదలింపులకు ఏమాత్రము చలించక ధీర గంభీరుడై ఇట్లనెను : ''ఓ మునివరా ! వేషభాషలను బట్టి చూడ మీరు భృగువంశీయులైన బ్రాహ్మణులుగా కన్పించుచున్నారు. మా సూర్యవంశ క్షత్రియులు బ్రాహ్మణులన్నెప్పటికీ ఎదిరించరు. చాటలుగొట్టి పిల్లల బెదిరించులాగు గొడ్డలి చూపించి మమ్ము హడలుగొట్ట చూచుచున్నారు.''

లక్ష్మణుని సూటి మాటలకు భృగువంశ భాస్కరుడైన పరశురాముడు అగ్గి బుగ్గిలవై మండిపడుచూ విశ్వామిత్రునివైపు ముఖముపెట్టి ''విశ్వామిత్రా ! నీవైనా ఈ పిల్లవానికి బుద్ధి చెప్పుము. నే నాగ్రహించిన మరుక్షణమే కాలునికి కవళము కాగలడు. లేకుండిన యముని వంటి వానిని నన్నెదిరించగలడా ! పిట్ట చిన్నదైనను కూత ఘనముగా నున్నది. ఇతడు తల్లివద్ద పాలు కాదు—విషము త్రాగినట్లున్నది.'' అని చెప్పుచున్న మాటలకు లక్ష్మణుడు అడ్డుపడి—

''ఓ యతీశ్వరా, కోపగించిన లాభమేమి ? విరిగిన శివుని విల్లు తిరిగి అతుకుకొనగలదా ! ఎందులకు ఆవేశపడెదరు ! నిలబడినందున కాళ్లు నొప్పి జెందును. దయచేసి ఆసీనులుకండి'' అని వ్యంగ్యముగా ఎత్తిపొడిచినట్లు ప్రసంగించెను.

ఇట్లు వారిద్దరి మధ్య వాగ్యుద్ధము తీవ్రమగుచుండుట జూచి రామచంద్రుడు లక్ష్మణుని వారించెను. పిమ్మట రాముడు ముని కభిముఖుడై —

''ఓ మునివరా ! లక్ష్మణుడు బాలుడు గాబట్టి మీ సంగతి తెలియక అట్లు ప్రసంగించెను. వానిని క్షమించవలసినది. దోషము చేసినది నేను, మీ ఇచ్ఛ వచ్చిన విధమున నన్ను దండించుడు. నేను మీ యాజ్ఞ శిరసావహించెదను. రాముడు వినయముతో విన్నవించెను.''

''ఓయీ, నీవు శివచాపమును ఖండించి ఇప్పుడు నాకు నీతులు బోధించుచున్నావా ! నీవు శివద్రోహివి. ఏమియూ ఎరగనివానివలె చమత్కారముగ నటించుచున్నావు. ఇక నీ మాటలు కట్టిపెట్టు నాతో యుద్ధము చేయుము. లేదా ''రామ'' అను నీపేరు మార్చుకొని మారుపేరు పెట్టుకొనుము. లేనియెడల నా కుఠార ఘాతముచే మీ అన్నదమ్ముల

# రామచరిత మానస్

నిద్దరినీ పరలోక మార్గము పట్టించెద'' పరశురాముడు ఉద్రేకించి పలికెను.

"ఓ భృగువంశోత్తమా! రామా! లక్ష్మణుని మాటలకు నామీద కినుక వహించుట న్యాయము కాదు. మీరు బ్రాహ్మణులైననూ మీవద్ద అస్త్రశస్త్రము లుండుట జూచి సోదరుడు క్షత్రియోచితముగ సంభాషించెను. మీరు శుద్ధ బ్రాహ్మణుల వలె వచ్చియుండిన లక్ష్మణు డిట్లు మాట్లాడి యుండడు. నన్ను మీతో పోట్లాడమనుచున్నారు. అయ్యో నేను మీ దాసుడనే. అదియునుగాక మీరో పరశురాములు, మరి నేను వట్టి రాముడను. మీకూ నాకూ ఎక్కడి సామ్యము. మీరు బ్రాహ్మణులు కనుక క్షమింపగోరుచున్నాను'' అనెను.

"ఓయి! నేను బ్రాహ్మణుడనని తృణీకరించి పలుకుచున్నావు. శివధనస్సు విరిచినానని గర్వించితివి. ఇదిగో ఈ పరశువుతోనే లెక్కలేని క్షత్రియుల తలలు తెగనరకి సమరయజ్ఞము చేసితిని. ఈ పరశురాముని బలదర్పము ప్రపంచమునకే తెలియునే'' అని దర్పముతో పలికెను. అంతట రామచంద్రుడు "ఓ మహాత్మా! మీరు బ్రాహ్మణులని భావించి జయము పలికితిని గానీ మీ బలశౌర్యములకు భయపడి కాదు. యుద్ధరంగమున కాలుడే ఎదురైననూ క్షత్రియుడు వెనుకాడడు. దేనికీ భయపడని నేను నీ కెందులకు భయపడుదును!''

'దేనికీ భయపడని నేను నీ కెందులకు భయపడెద' నని రాము డన్న మాటలయొక్క గూఢార్థము పరశురామునికి తటాలున అవగతమయ్యెను. ఓహో, ఇతడు అవతార పురుషుడుగా నున్నాడు., కానీ, పరీక్షించి చూచెదనని మనస్సులో వూహించి,

"ఓ రామా, ఈ నా వైష్ణవధనుస్సును నీవు ఎక్కుపెట్టిన యెడల నీవు సామాన్య మానవుడు కాదని గ్రహించెద''—నని చెప్పుచూ పరశురాముడు తన విల్లు శ్రీరామునికి ఇయ్యబోయెను. ఇంతలో ఆ చాపము దానంతటే శ్రీరాముని చేతులలోనికి ఎగిరిపోయెను. పరశురాముని ఆశ్చర్యమునకు మేరలేకపోయెను. ఒకప్పుడు విష్ణువు ఆ ధనుస్సును పరశురాముని చేతికిచ్చి 'ఎవరు ఈ ధనస్సును ఎక్కుపెట్టగలరో వారు నా అవతారమని తెలుసుకొనుము. అప్పుడు నీవు అరణ్యముల కెళ్ళి తపస్సు చేసికొనుము' అని చెప్పియుండెను. పరశురామునికి వెంటనే విష్ణువు చెప్పిన ఆ మాట గుర్తుకొచ్చి ఓహో ఇతడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువుయొక్క అవతారమేనని తెలుసుకొని సంతోషముతో దేహము పులకరింప, చేతులు జోడించి "ఓ రామా, నీవు శంకరుని మానస సరోవరము లందు విహరించెడి ఆ రాజహంసవు. సాక్షాత్ భగవత్స్వరూపుడవు. రాక్షసవంశము నాశనమొనర్చి భూభారమును తొలగించుటకై అవతరించిన ఆదిదేవుడవు. హే రఘువంశోత్తమా! రామా, నా అనుచిత వాక్యములను క్షమించి దయదలచుము'' అని పరశురాముడు రాముని ప్రార్థించి అతనివద్ద సెలవు తీసుకుని, తపస్సుకై వెంటనే వనములకు వెళ్ళిపోయెను.

(సశేషం)



తలనొప్పా?



పంటినొప్పా?



ఒంటినొప్పా?



బహిష్టు రోజులా?

# సారిడన్ 'రోష్'

## వేసుకోండి

నొప్పిని పోగొట్టును, సేదదేర్చును,
నవోత్సాహమును కలిగించును.




ఒకే సారిడన్ బిళ్ల చాలును
ఒక బిళ్ల ఖరీదు 13 నయా పైసలు






నొప్పులనుండి త్వరితముగా ఉపశమనమును పొందుటకు సారిడన్ వేసుకోండి. తలనొప్పి, పంటినొప్పి, ఒంటినొప్పి, మామూలు అస్వస్థతలకు సారిడన్ దివ్యమైనది. సారిడన్ త్వరితముగా, నిరపాయముగా మరియు నిశ్చయముగా పనిచేస్తుంది. మీరు ఒకే బిళ్ల వేసుకొంటే సరిపోతుంది! పిల్లలకు ¼ నుండి ½ బిళ్ల వరకు చాలును.

'రోష్' తయారు ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వోల్టాస్ లిమిటెడ్

JWT/VT 4793





వీరాజీ

## జరిగిన కథ

సురేఖను భాస్కరానికీ భాస్కరాన్ని సురేఖకు పరిచయం చేస్తుంది, పద్మావతి. భాస్కరం సవతి తల్లి జానికమ్మగారు అతన్ని కన్నబిడ్డ కంటె ఎక్కువగా ప్రేమిస్తుంది. భాస్కరానికీ, కూతురు వసంతకూ ఒకేసారి వివాహం చేయాలని ఆమె ఆరాట పడుతుంది. తత్ఫలితంగా భాస్కరాన్ని పెళ్లిచూపులకు బలవంతంగా ఒప్పించి తీసుకెళ్తుంది. పెళ్లికూతురు సురేఖ అని తెలియగానే భాస్కరం మనస్సులో కల్లోలం చెలరేగుతుంది. సురేఖ దొడ్డమ్మ అయిన ధనమ్మకు మాత్రం భాస్కరంలో అన్నీ మంచి గుణాలే కన్పించి ఎలాగైనా భాస్కరాన్ని తన అల్లుడుగా చేసుకోవాలని పట్టుదల పెరుగుతుంది. భాస్కరం పద్మావతిని ప్రేమించడం నిజమా, కాదా అనే సందేహం కూడా సురేఖకి కలుగుతుంది. ధనమ్మకు దూరపు బంధువు ముకుందరావును వసంతకు ఇచ్చేటట్లు కూడా అప్పుడే ఏర్పాటు జరుగుతుంది. తను సురేఖను వద్దంటే ధనమ్మ తన కూతురుకే ముకుందరావును ఇచ్చి చేస్తానంటోంది. చెల్లెలి సంబంధం తన మూలంగా చెడిపోతుందని భాస్కరం; ముకుందరావుని వివాహం చేసుకుందామని కల్లో గూడా అనుకోని సురేఖకు తను భాస్కరాన్ని వద్దంటే ధనమ్మ తనను ముకుందరావు కిచ్చి చేస్తుందేమో అన్న భయంతో సురేఖా ఎటూ మాట్లాడలేకపోతారు. చివరకి భాస్కరం తన పెళ్లి ఏడాది వాయిదా వేస్తాడు. ఇంతలో యూనివర్సిటీ తెరుస్తారు. సురేఖ, పద్మ యిద్దరూ ఎం. ఏ లో చేర్తారు. భాస్కరం కూడా ఫైనలియర్ పూర్తి చేయటానికి వస్తాడు. సురేఖ అంతా చెప్పేఉంటుందని భాస్కరం అనుకొని పద్మతో ఏమీ చెప్పలేకపోతాడు. పద్మావతిని కల్సుకొని ఎలాగైనా జరిగింది చెప్పాలని చాలా ప్రయత్నించాడు భాస్కరం కాని చెప్పలేక పోయాడు. వసంత పెళ్లి జరుగుతోంది. అక్కడ సురేఖను ధనమ్మగారు జానికమ్మగారి కోడలు అని చెప్తుంది పద్మావతి హతాశయ్యై వెళ్లిపోతుంది. మనస్సులోని చికాకువలన సురేఖకు సుస్తీ చేస్తుంది. పద్మావతికి ఆమె సవతి అన్న రాజా వేరే సంబంధాలు చూస్తుంటాడు. భాస్కరం సురేఖను వద్దని పిన్నితో చెప్పేస్తాడు. సురేఖ ధనమ్మగారికి భాస్కరానికి వివాహమాడనని చెప్పేస్తుంది. రాఘవేంద్రరావు జయమ్మ మనసు విరిచేస్తాడు. భాస్కరం మూర్తితో సంప్రదిస్తాడు. అంతలో పిన్నికి 'సీరియస్'గా వుందని వస్తుంది.

## 54

మూర్తికి ప్రేమంటే శైలజతో కబుర్లు చెబుతూ, శైలజ తియ్యని మాటలు వింటూ గడపడం కాదన్న విషయం అదివరకే అవగాహన అయినా, ఇప్పుడు భాస్కరం ఇరుక్కున పరిస్థితులను చూడగానే మరింత గట్టిగా తెలిసిపోతుంది. పద్మావతికి భాస్కరంమీద అపోహ తొలగించాలని శైలజకు చెబుదామనుకున్నవాడు తరుముతున్నట్లు శైలజ దగ్గిరకి వెళ్ళాడు.

"అరె! ఎవరు తరుముతున్నారు?" అన్నది శైలజ. వికసించిన వదనంతో.

"మనం ప్రేమించుకోడం మానేద్దాం శైలూ!" అన్నాడు ఆవేశంగా మూర్తి.

కిలకిలా నవ్వేసింది శైలజ.

"మానేసి?......" అడిగింది కొంటెగా.

"మీ నాన్నగారు, అమ్మగారు వద్దంటే నువ్వు నన్ను ప్రేమించగలవా?" మూర్తి ఆశగా, భయంగా అడిగాడు.

శైలజ గంభీరంగా అయిపోయింది. తల దించుకుని "మీకి వాళ్ళేం జరిగిందీ?" అన్నది.

"ఇవాళ జ్ఞానోదయమైంది. నాకు అమ్మా నాన్నా లేరూ. ఏకాకిని......మా మానమేమకీ నాకూ ఋణ ముందేగాని, అతని మాట మనకి ఖాతర్ లేదు......అంచాత నేను ఈ లోకమంతా ఎదురైనా కాదని నిన్ను అనుసరించగలను గాని నువ్వు? నువ్వో......?"

"నేనూ అంతే......" శైలజ అప్రయత్నంగా అన్నదేగాని స్పష్టంగా అనలేకపోయింది.

"ఊహూ......నీకు తల్లీ దండ్రీ; వాళ్ళ కుటుంబ గౌరవం అనే ముసుగులో దాక్కున్న కోరికలూ, ఇష్టానిష్టాలు మొదలగునవి ఉండవచ్చును శైలజా!"

"అబ్బ! మీరు నన్ను చంపేస్తున్నారు...... ఇలా తిన్నగా పరిగెత్తుకుని వచ్చి, నిలదియ్యడానికి కారణమేనా ఉండొద్దా? బాధ పడ్డది శైలజ.

మూర్తి కాస్త నిగ్రహించుకుని "మగాడు మోసగాడు అంటూ ఆనక మీరు గుర్రాలను గాడిదల్ను ఒక గాట కడతారు......పైగా త్యాగాల పేరిట మా కొంపలు ముంచేస్తారు" అన్న మూర్తి మాటలకు విసుక్కుంది శైలజ.

"మీకు పైత్యం చేసిందా? ఎవరు ఎవర్ని మోసగాడి వన్నారు? నేను మిమ్మల్ని పల్లెత్తు మాటేనా అనందే?"

"పద్మావతి భాస్కరాన్ని ఏమనుకున్నది?" మూర్తి ప్రశ్నకు శైలజ నవ్వింది.

"పద్మావతిగార్నడగండి! భాస్కరంగారు. మీ ఫ్రెండు కాని నాకు కాదు"—

"శైలూ! నిజం చెప్పావ్! భాస్కరం, సురేఖ, నువ్వూ, నేనూ అంతా బందీలమ్! చదరంగం గళ్లల్లోని పావులకు కొన్ని రకాల స్వేచ్ఛలే ఉన్నట్లు మనకి కొన్ని రకాల అవకాశాలే ఉంటాయి! పైగా......"

శైలజ మధ్యలోనే అన్నది "నేను మాత్రం మిమ్మల్ని మోసం చేశారనుకోను గాని నన్నిలా భయపెట్టకండి!"

మూర్తి కూడా అక్కడకు ఆగిపోయి 'భాస్కరం, పద్మావతి' కథ అంతా చెప్పాడు. "నీకు ఆవిడ కనిపిస్తే ఇదంతా కాస్త చెప్పు—" అన్నాడు.

శైలజ అంతా విని బరువుగా నిట్టూర్చింది.

"భాస్కరంగారు పద్మావతికి మొదటే ఇదంతా చెప్పకూడదూ?" అన్నది భారంగా.

"ఏమని? నేను నిన్ను ప్రేమించడంవల్ల నా పిన్నికి కష్టం. నా చెల్లికి పెళ్లి అవదు......నీ కుటుంబానికి గల చెడ్డసాంప్రదాయాలు అందుకు కారణాలు అనేనా?" మూర్తి కోపంగా చూశాడు.

శైలజ బేలగా చూసింది.

మూర్తి బుజ్జగింపుగా అన్నాడు.

"అప్పుడు పద్మావతిగారు భాస్కరాన్ని అతని సుఖంకోరి శాశ్వతంగా దూరం చేసుకుంటున్నాను అనిపూర్తిగా దూరం కావచ్చునుగా."

"లేదా తన సాంప్రదాయాలను ఎంచిన నేరానికి పద్మావతి భాస్కరాన్ని తిరస్కరించి చచ్చిపోవచ్చును కూడా." మూర్తి చెప్పాడు.

"నన్ను నమ్ము శైలజా! భాస్కరం పద్మావతిని ఏ విధంగానూ ఒదులుకోలేడు'' అన్నాడు.

శైలజకు కూడా గుండె బరువుగా తోచింది. "పాపం! సురేఖగారు మంచిది. ఆమెను కూడా పద్మావతిగారు తెలియక నిందించింది'' అన్నది.

ఇద్దరూ మరొక్క మాట లేకుండా భారంగా విడిపోయారు.

## 55

డాక్టరువచ్చి సురేఖను పరీక్ష చేసి, "మీరు పడుతున్నంత ఆందోళన అక్కరలేదు'' అన్నట్లు నవ్వి, "మరేం ఫర్వాలేదు—రెండు ఇంజెక్షన్‌లు ఇస్తాను'' అన్నాడు.

ధనమ్మగారు "అరుంధతీ" అని పిలిచింది.

"అమ్మాయికి ఆ సూదులు పొడుస్తూంటే నే చూడలేను—కాస్త జాగర్త చూడు తల్లీ!'' అని అటు మొహం తిప్పుకుంది.

ధనమ్మగారు "ఓసినీ! దీనికి నిద్ర పట్టక పోడం ఏమిటండీ! తిని తిరిగి పడుక్కొని హాయిగా నిద్రపోయే వయస్సుకదా?" అన్నది.

"ఏవో మాత్రలు మూడు రోజులుగా కొంగున సీసాతో కట్టుకు మింగుతూనే ఉంది'' ఆందోళన చెందింది అరుంధతమ్మగారు.

"అవి ఎక్కువగా తింటే మళ్లీ మీరు నన్ను పిలవ నక్కర లేనంత నిద్ర వచ్చేస్తుంది...... కాస్త కనిపెట్టండి''అంటూ డాక్టర్ వెళ్ళిపోయాడు.

ధనమ్మగారికి నుదుట చిరు చెమట్లు కమ్మేయి. సురేఖ దిండుకింద పరుపుక్రింద అత్యవసరంగా వెతికింది.

"నేను చచ్చాక ఏమాత్రలేనా మింగుదువు గాని కాని, పాడీకానా! ఇప్పుడు నువ్వు చచ్చి నన్ను చంపకు''మని నొచ్చుకుంది, విసుక్కుంది. బాధపడింది.

సురేఖకు కాస్త తెలివివచ్చి, ధనమ్మగారి మాటలు వినో వినకో "అలాగే దొడ్డమ్మా!'' అంది ఆవిడమాటలకు సమాధానమన్నట్లు.

ధనమ్మగారు అటూ, ఇటూ చూసి ముందుకు వంగిసురేఖ చెక్కిలి ముద్దు పెట్టుకుంది ప్రేమగా.

* * *

సురేఖ మర్నాడు ఉదయమే లేచి కూచొనిరాయడం ప్రారంభించింది.

కోమంటావ్?" ధనమ్మగారు ఆశగా అడిగింది.

"నీకు భాస్కరంగారి ఆశ ఎందుకు దొడ్డమ్మా! అతనికి నేనంటే ఇంత పిసరు ప్రేమ లేదు—ఒకవేళ రేపు బలవంతాన అలాంటిది వచ్చినా గిచ్చినా అది నీ డబ్బుమీద వస్తుందేమోగాని నామీద కాదు......అంచాత నీ డబ్బు "మఠాల''కే రాయి—నీకూ నాకూ కూడ మన శ్శాంతి''—

"సరా! ఇవాళే మరో సమ్మంధం చూడమని మీ నాన్నకి చెప్తాను. అతగాడు రానీ—నీకు 'కాని వాడు' నా కెందుకు? జీవితంలో పరాభవం లేదనుకున్నాను. ఇదొక్కటి మచ్చుకు ఉన్నానూ అని జరిగింది'' అంటూ ఆమె అక్కణ్ణుంచి సాధ్యమైనంత కోపాణ్ణి అణుచుకుంటూ వెళ్ళిపోయింది.

సురేఖ ఉత్తరం శైలజకి రాసింది. వార్డెనుకూ కాదు, కాలేజీకీకాదు.

"ప్రియమైన శైలజా!

దేవుడేవుంటే అతను మనల్ని స్వర్గమేఉండి మనం అక్కడికి వెళ్తే "నువ్వు ఎంత సుఖపడ్డావు" అని అడగడట! "ఎంతమందిని సుఖపెట్టావు?" అని అడుగుతాడని మా పెద్దనాన్నగారు అనేవారు. సుఖ పెట్టడంకన్నా సుఖపడటమే ఎక్కువ చేసినవారికి స్వర్గ ద్వారాలు తెరవనే తెరవరని ఆయన అనేవారు.

కాని ఇవాళ ఆయనలేరు. ఆ దేవుడు అగుపించడు.......దొడ్డమ్మని సుఖపెట్టాలీ అంటే భాస్కరంగారినీ, పద్మావతి (నా పూసు వదిలీ)నీ కూడా దుఃఖపెట్టాలి. లేదు వాళ్లనే సుఖపెట్టాలీ అంటే మా దొడ్డమ్మను పరాభవించానంటుందామె. ఇలాంటి సమయంలోనే ఆత్మహత్య చాలా సులువైన పరిష్కారం అనిపించింది నాకు, కాని అప్పుడు కూడా ఈ 'బంధాలను' ఛేదించిన దాన్నిగాక, 'చచ్చి' కూడా వీళ్లను సాధించిన దాన్నవుతానేమో.... పైగా 'ప్రేమ' కు 'అనుబంధా'నికి లొంగి స్త్రీలు తమ 'బలహీనత'వల్ల అహంకారంవల్లా చచ్చి, చాలా సంకుచితమైన ఉనికిని తమ జాతికి తామే ఆపాదిస్తున్నారేమో నని అనిపిస్తుంది.

ఆడ పిల్లల అహంకారం లేదా బలహీనత ప్రేమకూ త్యాగానికీ ఆత్మహత్యకూ ముడిపెట్టుకోడం వల్లనే సామాజిక ప్రతిపత్తికి బదులుగా స్త్రీకి నేటి సమాజంలో సానుభూతి, గుప్పెడు



నిజానికి మెత్తని తన జబ్బల్లో నరం దొరకక డాక్టర్లు "సూదులు" పొడుస్తూ, తీస్తూ ఉన్నా నిర్భయంగా చూసేది ధనమ్మగారు. అటువంటిది సురేఖకు ఇంజక్షన్ ఇస్తే మాత్రం చూడటానికి ఆమె గుండె "చివుక్కు''మంటుంది! అరుంధతమ్మకు ధనమ్మ ఆస్తి కూతురుకిరావడం యిష్టమే కాని తన కూతురుపట్ల ఆమెకు ఇంత ఆపేక్ష ఉండటంమాత్రం కష్టమనిపిస్తుంది. రుస రుస మనడంతప్ప ఏం చెయ్యలేదు మరి!

డాక్టర్ ఇంజక్షన్ ఇస్తున్నంత సేపూ ధనమ్మగారటు తిరగనేలేదు.

"అమ్మా! అమ్మాయి నిద్ర మాత్రలు మింగుతున్నదేమో కాస్త గమనించండి. వెంటనే వేడి టీ కాని పాలుకాని ఇవ్వండి'' అన్నాడు డాక్టర్ బాగా అనుభవజ్ఞుడు గనుక.

"ఏమిటి రాస్తున్నా వమ్మాయీ!" అన్నది ధనమ్మగారు.

"శలవు చీటీ!"

"అంత దీర్ఘంగా రాయాలా? రెండు తావులూ"

"కాదమ్మా! మరి హాస్టలులో మావార్డెనమ్మకి కాస్తంత లెటర్ రాస్తే కోపం.....శలవ్‌లేదు పో'' అంటుంది ..''సురేఖ నవ్వింది పొడిగా.

"సరేగాని, ఇక నన్ను భాస్కరం పూసు ఎత్త వద్దంటావ్ విష్కారణంగా ఇంత శ్రమ పడి ఇరు

జాలి మాత్రం దక్కుతున్నాయని నాకు తోచింది.

నేను 'చావాల'ని మా దొడ్డమ్మగాని, పద్మావతి "ప్రేమ" కాని కోరలేదు. నా ప్రేమే అలా అనిపించింది నాలో......అందుకే నేను దానికే పగ్గాలు వేస్తున్నాను......బహుశా నీకు ఈ ఏడాది అంతా కనిపించనేమోగాని — మళ్లీ ఏడాదికైనా వస్తాను......అందాకా నీ "సురేఖగారి"ని క్షమించు. పద్మావతి అమాయకురాలు......ఆత్మహత్యకు ప్రేమలోని పవిత్రతకూ అవినాభావ సంబంధ ముందని భ్రమ పడగలదు. దయచేసి నా కోసమేనా దాన్ని బ్రతకమను. భాస్కరంగారిలాంటి పిరికివాణ్ణి, ప్రేమించిన అదే అర్థం చేసుకోకపోతే, బహుశా ఆయనకు వాళ్ల పిన్నమ్మగారు లేకపోయిన తర్వాత ప్రపంచమంతా శూన్యమై పోతుంది. అప్పుడు పద్మావతి తప్పక వుండాలి!... నువ్వు నా కన్నా చిన్న దానివేగాక, సొంత చెల్లెలిలాంటి నేస్తానివి గనుక నీకు నా హృదయ వేదన అంతా రాసుకున్నాను. నేను మిమ్మల్నిందర్నీ భాస్కరంగారితో సహా ప్రేమిస్తున్నానుగాని, మా దొడ్డమ్మ నన్ను మాత్రం ప్రేమిస్తున్నది. అందుకే ఈ ఏడాది అన్నిటికి 'బంధనాలు' వేసుకుని......వాల్తేరు రాను...... పై ఏడాదిదాకా మర్చిపోకు.

ఈఉత్తరం చదివి చింపేయి. మంచిదానివి కదూ..

ప్రేమతో

"సురేఖగారు."

ఉత్తరం అంటించేముందు సురేఖకు మరో మాట తోచింది. "పద్మావతితో భాస్కరంగారిని సురేఖ ప్రేమించిందట అని చెప్పకూ" అని రాద్దామనుకుని మానేసింది. దొడ్డమ్మతో కూడా వచ్చిన "గురువుల్ను" పిలిచి "ఈ ఉత్తరం వెంటనే పోస్టు చేసిరా" అని రూపాయి తీసి ఇచ్చింది.

"ఐపోయింది! దొడ్డమ్మా ! ఇక సురేఖ నీదే"

# ప్రేమకు పగ్గాలు

అనుకుని కళ్ళు మూసుకుంది. తేలిగ్గావుంది ఎదను బరువుగానూ ఉంది. వెలితిగా నిండుగా నిండుగా వెలితిగా వుంది.

## 56

పద్మావతి ఒక రోజంతా మంచాన పడిఉండటం వల్ల ఆత్మహత్యమీద మనసు పోతున్నదే తప్ప మనశ్శాంతి చిక్కటంలేదు. పైకి ఏమనుకుంది కేనా జయమ్మ కదిపితే కన్నీరైపోయేలాగుంది"

"అమ్మా! వూరికే కాలేజీకి వెళ్లొస్తానే" అన్నది భయంగా—"ఎందుకోయిక" తనకే తెలియదు.

జయమ్మగారు "తల్లీ! నా కొంప ముంచుతానంటావ్? అంతేగా!" నన్నది దగ్గరిసా వచ్చి.

"మరి ఇంట్లో ఎలా ఛావ మన్నావ్?" విసుక్కుంది పద్మావతి.

"ఇంకా ఆ భాస్కరంమీద......" అంటూ ఉండగానే పద్మావతి పిచ్చిగా కేకలు వేసింది.

"ఆ భాస్కరం ఆ భాస్కరం......ఎందుకమ్మా? అలా చంపేస్తావ్ నన్నూ......చెప్పానుకదా"

"ఆ పెద్ద మనిషికి నే నేనాడో చచ్చిపోయాను సరా!"

జయమ్మగారు చాలా కుమిలిపోయింది.

"నాతల్లి దండ్రులను వాళ్ళ కలలుగన్నపరువు ప్రతిష్టలతో నేను చావనివ్వలేదు..... నువ్వూఅంతే. నన్ను నేను కోరినవిధంగా సవ్యంగా చావనివ్వవు!" ఇది మనకు సంప్రదాయమవుతుంది కాబోలు..." అమె నిట్టూర్చింది.

పద్మావతి తల్లిని శత్రువును చూసినట్లు చూసింది.

"అబ్బబ్బ! నువ్వు కట్టుకొని చావమన్న ఆ సమ్మంధం ఇంకా రాందే [illegible] ఐందినై పోమంటావ్? అదేదోరానీ!" అన్నది.

"సరే! నీ ఇష్టం" జయమ్మగారు అస్పష్టంగా అన్నది.

పద్మావతి తల్లి దగ్గిర కూలబడి ఏడిచింది.

"నీమీద ఒట్టు.....ఇక భాస్కరంగారి మాటలు నమ్మడం అతనిమీద ఆశ పెట్టుకోడం చెయ్యనమ్మా! కాలేజీకి వెళ్లకపోతే నలుగురూ ఏమేనా అనుకోరా?" అన్నది.

జయమ్మగారు కూతురిపట్ల విశ్వాసం తెచ్చుకుని "పోయిరా! రాజుకి మరో ఉత్తరం రాస్తాను, కార్డు మీద వాడి ఎడ్రసు రాసిపో మొన్నటి ఉత్తరం సరిగ్గా అందిందో లేదో" నన్నది.

"నిజమే. ఒక్కసారిగా కూతుర్ని యింట్లో కట్టిపడేస్తే లోకులు యేమేనా అనొచ్చునూ అనిపించింది.

వాస్తవానికి పద్మావతికి ఒక క్షణంలో తనమీద మరో క్షణంలో భాస్కరంమీదా మరుక్షణంలో లోకం మీద కోపం వస్తున్నది.

"ప్రేమించుకోడం అనేది ఒక భ్రమ అనుకున్నది" అసలు ఈ జీవితమే భ్రమ......"

సురేఖ కాలేజీకి వచ్చిందా? లేదా? అన్న కుతూహలం కూడా కలిగింది "పాపం! దాన్నేనా ఆయన తిన్నగా చూస్తాడా?" అని ఖేదపడ్డది.

"సరే! ఇక నాకు మిగిలింది అమ్మ మాట విని తన ఋణం తీర్చుకుందికి మరొకడితో కాపురానికి వెళ్లడం అంతేగా......ఛీ! ఇంతకంటే ఆత్మ హత్య మేలు"

జయమ్మగారు ఆ పిల్ల ఆలోచనలు చదివిందా అన్నట్లు

"చూడు పద్మా! ఏమీ కాని పని తలపెట్టకు. దానివల్ల నువ్వు మరో హత్య కూడా చేసిన దానివవుతావు." కావాలంటే "కాలేజకి వెళ్ళు ఖర్చైన సొమ్ము ఎలాగ అయిందిగదా! ఆ తర్వాత దైవమే ఉన్నాడు" అన్నది.

"ఎందుకని ఛస్తానమ్మా?" బాధగా మూలిగింది పద్మావతి.

"తల్లీ! తల్లి ప్రాణం పడే బాధ నీకు, నీ కడుపున ఓ కాయి కాస్తేగాని తెలియదే......నా చావు నా చేతుల మీదుగా అయిపోడం కన్నా, ఇప్పుడు నేనేం కోరనమ్మా"—అమె మళ్లీ కన్నీరు పెట్టుకుంది.

"ఛీ! ఏం మాటలమ్మా అవి......నేను లైబ్రరీకి పుస్తకాలు తిరిగి ఇచ్చేయ్యాలి. ఇచ్చేస్తాను" అన్నది పద్మావతి. కాని ఆ పిల్లకి తల్లిమీద చాలా కసిగా ఉంది.

"చస్తానంటే కూడా నాకు స్వేచ్ఛ లేదా?" అని మండి పడ్డది మనసులో.

నడుస్తున్నంతసేపూ ఒకటేబాధ. "నిజమే... భాస్కరంగారిని మొదట్లోనే దూరంగా ఉంచేస్తే తీరిపోను......ఇప్పుడీ రంపపుకోతలు తప్పును" అనుకున్నది.

అమ్మాయిల విశ్రాంతి భవనం షష్ఠిపూర్తి భవనంలో మొదట కనిపించింది శైలజ.

నవ్వింది పద్మావతి. "ఏం శైలజా ?" అని— శైలజ దగ్గరగా వచ్చి.

"మీకో శుభవార్త చెప్తా రాండి" అంది శైలజ.



మానవ నైజం

"క్లాసులకు వెళ్లవూ?" నిర్లిప్తంగా అడిగింది పద్మావతి.

"రేపు వెళ్తాను...... ఈవాళ మీతో చాలా మాట్లాడాలి......రాండి ఎక్కడికేనా వెళ్దాం....." అని లాక్కొనిపోయింది.

"మూర్తిగా రెంత మంచివారో చెబుతుంది పిచ్చి పిల్ల! అంతేగా...పోనీ విందాం" అనుకుంది పద్మావతి.

కాని శైలజ పద్మావతి గుంచే అంతా మాట్లాడింది.

"సురేఖగారు, భాస్కరంగారూ, అందరూ కలిసి మీకు ఏదీ చెప్పకుండా దాచడానికి కారణం మీమీద ప్రేమయే" నన్నది శైలజ పెద్దదానిలా!

"నాతో చెప్పకుండా నన్ను ప్రేమిస్తున్నాను అని లోకానికి చెప్పడంవల్ల ఏం ప్రయోజనం శైలజా ...... ఇప్పుడిక ఆయనకు నేను యివ్వగలిగేదేమీలేదు" పద్మావతి కన్నీరింకి పోయినట్లు కరుడు బారిపోయింది.

"వాళ్ల పిన్నిగారూ, సురేఖ దొడ్డగారూలాంటి మనుషు లున్నంత కాలం ప్రేమకు పగ్గాలు వేయాలి తప్పదు — అదే చేశాడు భాస్కరంగారు అన్నారు మూర్తిగారు" చెప్పింది శైలజ.

"కాని నేను చాలా దురదృష్టవంతురాలిని చెల్లీ! ఎందుకంటే మా అమ్మలాంటి వాళ్ళున్నప్పుడు కూడా ప్రేమకు పగ్గాలు వేయాలి—కాని నా కది చాతకాదు అంచాత యిప్పుడు నా కొక్కటే దారి..." అంటూ.

పద్మావతి లేచి శైలజతో వస్తానని కూడా చెప్పకుండా వెళ్ళిపోయిం దక్కణ్ణించి.

*          *          *

శైలజ రెండు క్షణాలు దిమ బారిపోయింది పద్మావతికి మతి స్తిమితం తప్పలేదు కదా! అనుకుంది. కాని పద్మావతి వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయింది. శైలజ కేక వేసింది వెనకనించి. కాని పద్మావతి ఆగలేదు. పరిగెత్తినట్లు వెళ్ళి "ఏం పద్మావతిగారూ! నామీద కోపం వచ్చిందా?" అన్నది ఆమెను భుజాలు పట్టుకుని ఆపి.

"ఉహూ... ..లేదు.....ఇప్పుడిక నామీద నాకే కోపమమ్మా!.... .నీకూ మూర్తిగారికీ థాంక్స్...... చేతులు కాలాయి ఆకులెందు కిక? దయచేసి నన్ను ఇంటికి వెళ్ళనీ"—విడిపించుకుని వెళ్ళిపోతున్న పద్మావతిని ఆపలేదు శైలజ. ధైర్యంచాలలేదు ఎందుకనో!

పద్మావతికి జరుగుతున్నది కలో, నిజమో తెలియలేదు. జయమ్మగారి కంటబడకుండా ఎటేనా పారిపోదామా! అనిపించింది.

"ఎంత నీచం! నన్ను ప్రేమిస్తున్న వ్యక్తి నాతో చెప్పకండా..... నామీద అంత విశ్వాసం. ...లేకండా ఇప్పుడు మళ్లీ యీ ఆశ పెట్టడమా? ఇంత శిక్ష ఇంత యాతన భగవంతుడా! పగవాళ్ళకేనా వద్దు"

పద్మావతి భాస్కరాన్ని చంపేసి, తాను చచ్చిపోదామనిపించింది. "ఉహూ.....నేనే చస్తాను. ఆయనగారినే సుఖపడమను....... నా బ్రతుకు గాకపోయినా నా చావేనా వీళ్ల సంప్రదాయాలకు పునాదులు పెళ్లగించుతుందేమో. .... అంతే" ననుకుంది.

కాని శైలజ అన్న మాటలు ఇంకా ఆమె చెవుల్లో గింగుర్లు మంటున్నాయి. "వాళ్లపిన్నిగారిని ఒప్పించి నిన్ను పెళ్ళి చేసుకోవాలనే ఆతను తపస్సు చేస్తున్నాట్ట!" ....

"కాని కాని......ఇప్పుడు అమ్మకి నేను ఇచ్చిన

## ప్రేమకు పగ్గాలు

మాట?..... తను ఆత్మహత్యైనా చేసుకుంటుంది గాని ఈ పెళ్ళికి ఒప్పుకోదే......''

అందుకే ఇదంతా భ్రమ......దగా......ప్రేమకు బంధనాలు ఒక ఆటంకమైతే త్యాగం ఒక పర్యవసానం....''

''నన్ను కన్నతల్లికి దుఃఖాన్నీ— ప్రేమించిన వ్యక్తికి గుండెలమీద కుంపటినీ అయి బ్రతకడంకన్నా చావడం మేలు......''

పద్మావతి ఆలోచనలు ఒకే దిక్కు తెలిసిన గంతలగుర్రంలాపరిగెడుతున్నాయి. వీటిని ఆపగలశక్తి ఎవ్వరికీ లేదు. సురేఖకుంది. భాస్కరానికుంది. కాని ఆ ఇద్దరూ అక్కడలేరు. జయమ్మగారికి జరిగిన అవమానం ఎలాగున్నా ఆమెకు ఇక భాస్కరంమీద నమ్మకంలేదు. పద్మావతిమీద కూడా భరోసా లేదు.

* * *

ఇంటికి వస్తూనే మంచాన మొహం తిరిగి నట్లు పడిపోయిన కూతుర్ని చూసి గాభరా పడ్డది జయమ్మగారు.

ఆమెకు కూతురి పొట్ట చూడాలన్న అనుమానం, శంక, ఎంత కాదనుకున్నా పీడిస్తున్నాయి.... కాని ''కడుపు చించుకుంటే కాళ్ళమీదా.......'' అని ఎవరితోఅనడం ''ఒక్క ఆ సర్వేశ్వరుడితో తప్ప''

''అమ్మా! నేను చచ్చిపోతే నువ్వు ఏడవనని ఒట్టెయ్యి'' పిచ్చిగా తల్లిని కౌగిలించుకుంది పద్మావతి.

''ఛీ! ఏం మాటలే అవి? ఒక మగాడు మాట మార్చుకున్నంత మాత్రాన చస్తారా? అమ్మా?''

ఆమె ఆ మాటలంటున్నదేగాని పద్మావతి ''కాలుజారిన'' నేరానికి ''ఈ క్షోభ పడుతున్నదేమో'' నన్న శంక మాత్రం పోలేదు.

''లేదమ్మా! నేను నేనేనమ్మా పాపిష్ దాన్ని..... అందర్నీ అపార్థం చేసుకున్నాను'' తల్లిని పెనవేసుకుని ''నన్ను క్షమించమ్మా! నాకు పెళ్ళి చెయ్యకమ్మా'' అన్నది ఏడుస్తూ.

''లేదు పద్మావతీ! నేను రాజుకి ఉత్తరం రాశాను. నాకు అతని ఎదుట అపవాదు తేకు..... ఎవ్వరిని అపార్థం చేసు న్నావో వాళ్ళ నిక మీదట ఒక జీవితకాలంపాటు అపార్థం చేసుకోడం మంచిది'' ఆమె కూతుర్ని విడిపించుకునే ప్రయత్నం చేసింది.

''అయితే నా శవానికి చెయ్యి పెళ్ళి'' పద్మావతి, తల్లిని వదిలి అటు తిరిగి మంచంలో తల దాచుకుంది.

''దీనికి నెల తప్పలేదు కదా?'' అనుకుని గుండెల్లో గునపాలతో పొడిచినట్లు బాధ పడ్డది జయమ్మగారు.

కాని కూతుర్ని నిలదియ్యలేక పోయింది.

ఆమెకు ఒకవేళ అటువంటి అప్రతిష్ఠ యే వస్తే ఏం చెయ్యాలో తోచలేదు. రాజు ఇప్పుడు రాకపోయినా బాగుణ్ను అనుకుంది.

''పోనీ, ఆ భాస్కరం ఎవరో వాళ్ల తల్లిదండ్రులనే వెళ్ళి కాళ్ళు పట్టుకుంటాను'' అనుకున్నది. ఆమెకు పద్మావతిని శంకించడం పూర్తిగా సాధ్యపడలేదు.

''ఉత్తదే! పిచ్చిపిల్ల మాయమాటలు నమ్మి ప్రేమా—గీమా అంటూ వాపోతున్నది'' అని సరిపుచ్చుకున్నది.

పద్మావతికి బుర్రలో భయంకరమైన ఆలోచనలన్నీ ఉధృతమవుతూ ఉన్నా, రెండు మార్గాలు మాత్రం తోస్తున్నాయి. ఈ రెండు రకాల ఆలోచనలు, రెండు అగ్నిగోళాల్లా ఢీకొంటున్నాయి.

భాస్కరంగారిని తానెలాగ సుఖపెట్టలేదు. 'అతని జీవితానికి సుఖ శాంతులను ఇవ్వలేను' గనుక ఇక ఆ జీవితంనుంచే తప్పుకుపోడం ఒకటీ— లేదా, అవతల తల్లికి ఇచ్చిన మాట ప్రకారం భాస్కరంగారిని మరిచిపోయి మరొకరికి శారీరకమైన సేవ చేస్తూ, కృశించిపోవడం—రెండూ...

''ఔను! భాస్కరంగారి నెల్లాంటి వగ్గాలు ఆపాయో నాకూ, నా తల్లితో అనుబంధం అటువంటి బంధనాలనే వేస్తున్నది కదా?'' అనుకున్నది. కాని తాను భాస్కరం లేకండా మరొకనితో కాపురం చేయడమా?.....అదీ కూడా భాస్కరంగారు నన్ను ప్రేమిస్తున్నాడనీ'' ''అనుబంధనాల బంధాలతణ్ణి ఇన్నాళ్లూ బంధించి వేశాయనీ'' తెలిశాక మరొకడికి వశమైపోడం ఎట్లా? ఎట్లా...?

''సరే! నే ఛస్తే అమ్మకి అంత బాధా తీరిపోతుంది'' అనుకుంది చివరికి. ఒక నిర్ణయానికి వచ్చినట్లు—తనకు తెలీకండానే ఆ పిల్లకు అలసట వల్ల కాస్త నిద్ర పట్టింది.

జయమ్మగారు ఇదిచూసి విస్తుపోయింది.(సశేషం)

---

### గ్రహస్థితి

మిధునంలో రాహువు, వృశ్చికంలో సూర్య బుధులు, వృశ్చిక ధనుస్సులలో అంగారక శుక్రులు, ధనుస్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, మకర కుంభ మీన మేషాలలో చంద్రుడు.

### ఆంధ్రసచిత్ర వారపత్రిక

# వారఫలాలు

**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

**22-11-1963 శుక్రవారము మొదలు**
**28-11-1963 గురువారము వరకు.**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ వారం అంతా ఏదో తెలియని భారము అశాంతీ కనుపించే సమయం. సమయంలో చక్కగా సమాధానం చెప్పలేక బాధపడవలసి ఉంటుంది. ఆర్థికంగా కూడా సుఖం తక్కువ అని చెప్పవలసి ఉంటుంది. ఆదాయం బాగానే కనుపిస్తుంది. అయినా అనుకోకుండా ఖర్చులు పెరుగుతవి. ఈ సమయంలో వ్యవసాయ పరిష్కారాలు అంత సులభంగా జరుగవు. అంతుతెలియని పనులలో సాహసంచేసి డబ్బు వినియోగించే పరిస్థితులు ఏర్పడుతవి. జాగ్రత్తగా ఉండండి. వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి. మీరు చేసిన మేలుకు ప్రత్యుపకారం చేసేవారు లభిస్తారు. జీర్ణకోశాలలో బాధ కలుగుతుంది వృత్తి ఉద్యోగాలలో ప్రశాంతత కనుపిస్తుంది. 22, 23తేదీలలో లాభం, కార్యసిద్ధి.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఈ సమయంలో ఈశ్వరుని దయవల్ల ముందు జాగ్రత్తలో ఉండగలుగుతారు. కుటుంబంలో ప్రస్తుతం అంత ఉత్సాహం తోచదు. కాని, సంఘంలో మంచిపేరు లభిస్తుంది. స్వల్పమైన వ్యయప్రయాసలతోనే అధికమైన ఫలితం పొందగలుగుతారు. ఆభరణాలు మొదలయినవి కొంటారు. పదివ.ంది ఆదరాభిమానాలు లభిస్తవి. అధికారుల మాటలను నమ్మి మీ కార్యనిర్వహణంలో అజాగ్రత్తగా ఉండవద్దు. విందులు, వినోదాలు మొదలయిన కార్యక్రమాలలో పాల్గొంటారు .వృత్తిలో

### — ఈ వారము ధరలు —

వేరుశనగపప్పు ధర తేజీ అవుతుంది. నూవుల నూనె ధరలో పెద్ద మార్పు ఉండదు. శనగల ధర తగ్గుతుంది. మిర్చి ధర తాత్కాలికంగా కొద్దిగా పెరుగుతుంది. చింతపండు ధర అకస్మాత్తుగా పెరిగి తగ్గే అవకాశాలున్నవి.

ముందుకన్నా కొంత అభివృద్ధికరమైన మార్పు వస్తుంది. నౌకరులతో వివాదాలు పెరిగే అవకాశాలున్నవి. ఎదురుచూస్తున్న ధనమే చేతికి అందదు. కాని, మీఅవసరాలకు అభ్యంతరం లేకుండా వస్తుంది.

* * *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ప్రస్తుతం అయినవారు కూడా విరోధుల మాదిరి ప్రవర్తిస్తారు. మనశ్శాంతి తక్కువ. క్రొత్త యోచనలు చేయటంలో ఉద్రేకం, ఆందోళనతో కూడిన భావాలు వస్తూ ఉంటవి. ఉష్ణ, శైత్య ప్రకోపాలవల్ల అనారోగ్యం కనిపిస్తుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఒక దారికి రాబోతున్న సమయంలో స్వల్ప కారణాలు అడ్డుపడి ఆగిపోతవి. ఇతరులవద్ద నుంచి రావలసిన ధనం వస్తుంది. మానసికంగా శ్రమ కనుపిస్తున్నా ఆరంభించిన పనులను వదలలేక పోతారు. అయితే క్రొత్తవారితో సంప్రదించటంలో జాగ్ర

త్తగా ఉండటం అవసరం. ప్రయాణాలు చేయవలసి రావచ్చు. శక్తిని గమనించుకొనకుండా ఇతరులకు సహాయం చేసే బాధ్యతలను పైన పెట్టుకొనవద్దు. వారాంతంలో కష్టవార్తలు వింటారు. 24, 25 తేదీలలో గౌరవం, వ్యవహార జయం.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

అన్ని విషయాలలోను క్రమక్రమంగా అనుకూలమైన పరిణామం కనుపిస్తూ ఉంటుంది. అయితే చేతిలో ఉన్న ధనం దుబారా కాకుండా జాగ్రత్తపడటం అవసరం. మీ విద్య, శక్తి సామర్థ్యాలు ఈ సమయంలో బాగా రాణిస్తవి. బంధుమిత్రులవలన కొంత శ్రమ పైన పడుతుంది. వృత్తిలో ఒకానొక సమయంలో అపవాదులు, ప్రత్యక్షంగా పోటీలు కనుపించగల అవకాశాలున్నవి. కుటుంబంలో శుభకార్య ప్రయత్నాలు కలిసి వస్తవి. ప్రస్తుతంలో ఆదాయం పెద్దగా పెరుగుతుందని అనుకొనవద్దు. అధికారులవలన కొంతవరకు సహాయం లభిస్తుంది. ఇతరులు చెప్పిన మాట తప్పిపోయే పరిస్థితి వస్తుంది. కాని తలవనితలంపుగా పరిస్థితులు కలసివస్తవి. 26, 27 తేదీలలో సంతోషవార్తలు, ధనలాభం.

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ప్రస్తుతం గ్రహస్థితి మీ ఉన్నతిని, అధికారాన్ని సూచిస్తున్నది. ఆదాయం ముందుకన్నా బాగుంటుంది. మీరు చేయు పనులలో లోపం లేకపోయినా మనస్సులో తెలియని భయ సందేహాలు ఏర్పడుతవి. మంచి మనుష్యులతో స్నేహం లభిస్తుంది. కుటుంబంలోనివారి ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండవలసిన సమయం. ఇంతకు ముందు ఆశ వదులుకున్న వ్యవహారాలలో తిరిగి ఉత్సాహ సూచనలు కనుపిస్తవి. ఈ సమయంలో సాధారణంగా త్రిప్పట, శారీరకంగా అలసటను కలిగించే పనులు అధిక మవుతవి. అయితే దైవానుగ్రహంవల్ల పరిస్థితులను గ్రహించి వడుచుకొనగల నిబ్బరము, ఊహ లభిస్తవి. దక్షిణ, పడమర దిశలనుంచి శుభవార్తలు తెలుస్తవి. 27, 28 తేదీలలో కార్యభారం, విపరీతంగా ఖర్చులు.

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ఈ సమయంలో ఇతరుల ప్రసంగాలు కటువుగా ఉన్నా పరిస్థితుల ననుసరించి విలువనిచ్చి మాట్లాడవలసి వస్తుంది. ఇంతకుముందు కన్నా శ్రమ తగ్గుతుంది. వృత్తి వ్యాపారాలలో నిదానం కనుపించవచ్చు. కాని, ఏవిధమైన కష్టనష్టాలు ఏర్పడవు. మీ ఆరోగ్యం గురించి శ్రద్ధ వహించటం అవసరం. ధర్మ కార్యములు నెరవేరుతవి. క్రొత్త ప్రయత్నాలు ఏవీ కలిసిరాగల సమయం కాదు. వారం రెండవ భాగంలో మీ ధైర్యము, ఉత్సాహము పెరుగుతవి. అనుకూలమైన మనుష్యులు లభిస్తారు. సంతోష వార్తలు తెలుస్తవి. వృత్తిలో కూడా క్రమంగా మంచి మార్పు వస్తుంది. సంఘంలో మంచి పేరు లభించగల అవకాశాలున్నవి. ఈ వారం మొత్తంమీద ఖర్చులు పెరిగినా ఉపయోగం పొందగల సమయం. 25, 26 తేదీలలో దేహబాధలు, సంతోషవార్తలు.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మీ ఆర్థిక స్థితి పెరుగుతుంది. అయితే విసుగు చెందకుండా మీ కార్యక్రమాలను సాగించవలసిన సమయం. ఇతరుల అడ్డు ప్రశ్నలకు తగువిధంగా సమాధానం ఈయగలుగుతారు. ఒకరిద్దరి స్నేహితులవల్ల మోసం జరిగే సూచన లున్నవి. అయినా మీ ఆదాయం బాగా పెరుగుతుంది. ప్రత్యక్షంగా విరోధాలు మాత్రం రావు. ఆరోగ్యం సరిగా ఉండదు. నిద్రాభంగము, రొమ్ము, ఊపిరితిత్తులు మొదలయిన భాగాలలో బాధ కలుగుతుంది. విలువగల వస్తువులు కొంటారు. బంధుమిత్రులవద్ద నుంచి సంతోషవార్తలు తెలుస్తవి. సంఘంలో మంచి పేరుతోబాటు శ్రమ కూడా పెరుగుతుంది. స్నేహితులకు సహాయంచేయు సందర్భాలలో పరిస్థితులు ఎదురు తిరగగల అవకాశాలున్నవి.

* * *

### వృశ్చికం:

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

కుటుంబంలో ముఖ్య బాధ్యతలు తీరిపోయినవని అనుకోదగిన పరిస్థితి ఏర్పడుతుంది. బాహ్య విషయాలలో హుందాతనం, ప్రయత్నములతో అనుకూల వాతావరణం కనుపిస్తవి. ధన వ్యయం చేసినా ముఖ్యంగా మంచితనంతోనే జయం పొందగలుగుతారు. వృత్తిలో ఒక మెట్టు పైకిపోతున్న విషయం తెలుస్తున్నా మానసికంగా పూర్తి స్వేచ్ఛ, సంతోషం కనుపించదు. మీ ఆలోచనలు ఆటంకం లేకుండా వెంటనే కార్యరూపంలోకి వస్తవి. వారం మధ్యలో ఫలానా అని నిర్ణయించజాలని దేహ బాధలు ఏర్పడుతవి. తిరిగి అదేవిధంగా నివృత్తి అవుతవి. పదిరకాల పెద్దమనుష్యులతో పరిచయం, ఆడంబరం పెరుగుతవి.

* * *

### ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ప్రస్తుతం ఏమంత అనుకూలమైన కాలం కాదు. తొందరపడకుండా నిగ్రహంతో ఉండుట అవసరం. గౌరవం చెడదు. కాని, వ్యయప్రయాసలు పెరుగుతవి. మీ చుట్టు ఉండే పదిమంది పది రకాలుగా మాట్లాడుతారు. శుభకార్య ప్రయత్నాలు ముందుకు సాగవు. ఆదాయం కన్నా ఖర్చులు పెరుగుతవి. ప్రయాణం సాగుతుంది. వృత్తి ఉద్యోగాలలో సాటివారివల్ల మనశ్శాంతి లోపిస్తుంది. దైవికంగా సంతోషవార్త తెలుస్తుంది. యుక్తితో ఏదోవిధంగా కార్యక్రమాలు సాగిద్దామనే ప్రయత్నాలు మధ్యలో చెడిపోతవి. సంఘంతో పెద్దరికం లభిస్తుందే కాని అందుకు తగిన ప్రోత్సాహం కనుపించదు. వ్యవహార రంగంలో సౌమ్యంగా పోవటం అవసరం. వారాంతంలో వస్తునష్ట సూచన.

* * *

### మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

మీ వృత్తి ఉద్యోగాలలో ఉపయోగకరమైన మార్పులు తెలుస్తవి. దూరపు ప్రయాణం కలసి వస్తుంది. తాత్కాలికంగా ఆదాయం మందగించినట్లు తోస్తుంది. లాటరీ, స్పెక్యులేషన్ వంటి వానియందు ఆసక్తి కలుగతగిన సమయం. అయితే ప్రతిఫలం సాధారణంగా ఉంటుంది. మీ ఆరోగ్య విషయంలో తగు జాగ్రత్త అవసరం. స్నేహితులతో మాట్లాడే సమయంలో అవతలివారికి అనుమానం కలుగకుండా చూచుకొనండి వృత్తిలో భారీ కార్యక్రమాలు ఆరంభించ గలుగుతారు. చాలా కాలం ముందు జరిగిన లావాదేవీలు పూర్తి అయి ఫలితం అందుకొంటారు. ప్రతి సాధారణ విషయంలోను సందేహాలు పెట్టుకొని కాలయాపన చేస్తూ ఉంటారు. ధనవ్యయం కనుపించినా వ్యవహారాలు పరిష్కరించుకొనండి.

### కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

మీరు ఆరంభించిన పనులకు కొన్ని హంగులు మాత్రమే ఏర్పడటంవల్ల సమయం కొరకు ఎదురుచూస్తూ ఉంటారు. ధర్మకార్యాలు నెరవేరుతవి. వెనుక ముందులు యోచించకుండా ఒకరిని నమ్మి బాధపడతారు. అనవసరంగా పేరు ప్రతిష్టలకు భారం పెంచుకొనవద్దు. పిల్లల మూలంగా సంతోష సుఖాలు లభిస్తవి. ఆదాయం మామూలుగా ఉంటుంది. వ్యవహార రంగంలో చిక్కులు ఉండవు. సంఘంలో పెద్దరికం లభిస్తుంది. ఈ వారంలో పెద్దమనుష్యుల ఆదరణ వాక్సహాయము లభిస్తవి. మొదట తీవ్రంగా కనుపించిన వాతావరణం క్రమంగా మార్పుచెంది అన్ని విషయాలలోను ప్రోత్సాహం లభిస్తుంది. బంధుమిత్రుల వ్యవహారాలలో తటస్థ భావమే మిమ్ములను కాపాడుతుంది.

* * *

### మీనం:

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

పదిమందిలో చక్కగా పేరు ప్రతిష్టలతో రాణించగల సమయం. మనోబాధలు తీరిపోతవి. మాటలలో ఉన్న ప్రయత్నాలు కార్యరూపంలోకి వస్తవి. వ్యాపారరంగంలో సమర్థతతో భారీ కార్యక్రమాలను సాగించగలుగుతారు. ప్రయాణాలు చేయవలసి ఉంటుంది. ఈ సమయంలో ప్రతి ఒక్కరినీ చాలా ఉదారంగా, ఆదరాభిమానాలు కనబరుస్తూ ముందుకుపోవటం అవసరం. భాగస్తులతో కలసి చేయు పనుల ఫలితం బాగుంటుంది. కాని, పరస్పర విరుద్ధ భావాలు రాకుండా గమనించుకొనడం ముఖ్యం. మీకు ఇష్టంలేకపోయినా భారం పైన వేసుకొంటారు. నిరుత్సాహం కలుగదు. ఋణభారం తగ్గించుకొన గలుగుతారు. వృత్తిలో పలురకాల వ్యక్తులతో సంబంధం కలుగుతుంది. వారాంతంలో బంధు విరోధ కారణాలున్నవి. కోర్టు కచేరీలలో అనుకూలత కనుపిస్తుంది. 22, 23 తేదీలలో ధనలాభం, కుటుంబంలో శుభ సూచనలు.





# కొలంబా

ప్రాస్పర్ మెరిమె

### జరిగిన కథ

కర్నల్ థామస్‌నెవిల్, కుమార్తె లిడియా కార్సికాకి వెడుతూ లెఫ్టినెంటు ఆర్సో దెల్లా రెబ్బియాని కలుస్తారు. ఆర్సో తండ్రి హత్య చెయ్యబడ్డాడని మిస్ లిడియా తెలుసుకుంటుంది. ఆర్సో చెల్లెలు కొలంబా తమ తండ్రిని బారిచినీ అనే వ్యక్తి చంపించాడనీ, అందువల్ల పగ తీర్చుకోవాలని ప్రేరేపిస్తుంది. ఆర్సోకి పగ అంటే ఇష్టంలేదు కాని గ్రామాధికారి రాయబారాలు కూడా బారిచినీ నిర్దోషి అని రుజువు చెయ్యలేకపోతాయి. రాయబార ప్రయత్నాలు విఫలం అవుతాయి. కర్నల్‌గారు, మిస్ లిడియా మరొక ఊరినుంచి ఆర్సో స్వగ్రామం పియత్రనెరాకి రాబోతారు. కొలంబా బారిచీని మీద ఆర్సో ఆంటన్‌కు అనుమానం ఎక్కువయ్యే ప్రయత్నాలు చేస్తుంది. ఆర్సో కర్నల్‌ను తీసుకు వచ్చేందుకు బయల్దేర్తాడు. దారిలో బారిచీని కొడుకులు విన్సెంటెల్లో ఆర్లాందుచ్చియోలు తనను చంప ప్రయత్నించగా వారినే కాల్చి వేస్తాడు. మిత్రుడైన బ్రాందలాచ్చియో ఆర్సోను సృజోనా అడవులవేపు తీసుకుపోతాడు. కర్నల్‌గారు, మిస్ లిడియాతో పియత్రనెరాకు వస్తారు. కొలంబా లిడియాను ఆర్సో దగ్గరికి తీసుకు పోతుంది. —

## 21

మిస్ లిడియా తల తిప్పేసుకుంది, తన ముఖం ఎర్రబడటం ఆచీకటిలోకూడా కనిపిస్తుందేమో అన్నట్లు. "దెల్లారెబ్బియాగారూ" అంది వణుకుతున్న గొంతుకతో, "ఇక్కడికి వచ్చానంటే...." అంటూనే ఆర్సో చేతిలో అంతకుముందు తను ఇచ్చిన ఈజిప్షియన్ ఉంగరాన్నే మళ్ళా పెట్టింది. తర్వాత పెద్ద ప్రయాసతోనే తన మామూలు హాస్య ధోరణిలోకి మారింది: "ఆర్సోగారూ మీరిట్లా మాట్లాడటం బాగా లేదు..... చిట్టడివిలో, బందిపోట్ల మధ్య, మీతో ఎలా పోట్లాట పెట్టుకోను?"

ఆర్సో ఉంగరం ఇచ్చిన ఆమె చేతిని ముద్దు పెట్టుకోపోయాడు. మిస్ లిడియా చప్పున చేతిని వెనక్కి లాక్కుంది. హఠాత్తుగా జరిగిన ఈ కదలికవల్ల ఆర్సో తూలి తన దెబ్బ తగిలిన చేతిమీద పడ్డాడు. బాధతో మూలగకుండా ఉండలేకపోయాడు

"క్షమించండి! నాదే తప్పు చాలా బాధగా ఉందా....." అంటూ మిస్ లిడియా అతని, సరిగ్గా కూర్చో పెట్టింది. ఇద్దరూ ఒకరి కొకరు దగ్గరగా జరిగారు. కొలంబా అనవసరంగా తిరిగి వచ్చేసరికి మాత్రం ఆమె వారిద్దరినీ వదిలి వెళ్లినప్పుడు ఏ విధంగా ఉన్నారో అలాగే ఉన్నారు.

"సైనికులు!" అని అరిచింది. "ఆర్సో! లేచి నడవటానికి ప్రయత్నించు, సాయపడతాను!"

"నన్ను వదిలెయ్యండి!" అన్నాడు ఆర్సో. "ఈ బందిపోట్లను పారిపొమ్మను.....నన్ను పట్టుకున్నా ఫరవాలేదు. కాని, మిస్ లిడియా! మీ రిక్కడ నాతో కనిపించటం మంచిదికాదు."

"నేను మిమ్మల్ని వదిలి వెళ్లను," అన్నాడు కొలంబా వెంటనే వచ్చిన బ్రాందొలాచ్చియో. "సైనికుల సార్జెంటు ఎడ్వకేటు తాలూకు మనిషి. మిమ్మల్ని అరెస్టుచేసే బదులు చంపేస్తాడు. అవసరంమీదనే చంపానంటాడు, తర్వాత"

ఆర్సో లేచి నుంచొనపోయాడు: కొన్ని అడుగులు వెయ్యపోయాడు. వీలుపడలేదు. "నడవలేకపోతున్నాను" అన్నాడు. "అందరూ వెళ్లిపొండి! మిస్ నెవిల్! సెలవు. మీ చెయ్యి నాకసారి ఇవ్వండి, తర్వాత సెలవు!"

"వదిలి వెళ్లము!" అని అరిచారు ఇద్దరు అమ్మాయిలూ.

"మీరు నడవలేకపోతే ఎత్తుకుని వెడతాము!" అన్నాడు బ్రాందొలాచ్చియో. "లెఫ్టినెంటుగారూ అధైర్య పడకండి. వెనక వైపున్న లోయలోకి వెళ్ళిపోదాము. ఇంతలో 'ఫాదరీ' వాళ్లకి పని కల్పిస్తాడు!"

"వద్దు, వదిలిపొండి!" అన్నాడు ఆర్సో నేల మీద వరిగిపోతూ. "కొలంబా! దేవుడిమీద ఒట్టు! మిస్ నెవిల్‌ని ఇక్కడినుంచి తీసుకుని పో!"

"కొలంబాగారూ! మీకు మంచి బలం ఉంది!" అన్నాడు బ్రాందొలాచ్చియో. "మీరు భుజాలు పట్టుకోండి, నేనేమో కాళ్లు పట్టుకుంటాను. అదీ! ఇక ముందుకి పదండి!"

ఆర్సో ఎంత వద్దంటున్నప్పటికీ, వినకుండా ముందుకి సాగిపోయారు. మిస్ లిడియా అపరిమితంగా భయపడుతూనే వారిని అనుసరించింది. ఇంతలో ఒక తుపాకి పేలింది. ఎక్కడో. వెంటనే ఆరు తుపాకి పేలుళ్లు సమాధానంగా వినిపించాయి. మిస్ లిడియా భయంతో కేక వేసింది. బ్రాందొలాచ్చియో తిట్టుకున్నాడు. కాని నడక వేగం హెచ్చించాడు, కొలంబా తన దుస్తులకి, మొహానికి గీసుకుంటున్న పొదలనీ, కొమ్మలనీ లెక్క చెయ్యకుండా ముందుకి సాగిపోతోంది.

"కొంచెం వంగి పొండి!" అని అరిచింది తన సహచరులతో. "తుపాకి గుండు వచ్చి తగిలితే!" ఇలా ఒక అయిదు వందల గజాలు నడిచిన తర్వాత బ్రాందొలాచ్చియో, తను ఇంక ముందుకి వెళ్లలేనంటూ నేలమీదకి దింపాడు. కొలంబా ఎంత మందలించినా వినిపించుకోలేదు.

"మిస్ నెవిల్ ఏదీ?" అని అడిగాడు ఆర్సో.

తుపాకి పేలుళ్ల శబ్దాలకి భయపడి మిస్ నెవిల్ దారిలో ఒక క్షణం ఆగిపోయింది. అప్పుడే తక్కిన వారివద్దనుంచి తప్పిపోయి ఒంటరిగా ఒక చోట నుంచుని ఉండిపోయింది. అప్పుడు ఆమె పడుతున్న బాధ ఇంతా అంతా కాదు.

"వెనక విశ్రాంతి తీసుకుంటోంది" అన్నాడు బ్రాందొలాచ్చియో. "తప్పిపోయి మాత్రం ఉండదు ఆడవాళ్లు ఎప్పుడూ మళ్లీ దొరుకుతారు. విను,

ఆర్సో ఆంటన్! ఫాదరీనీ తుపాకి వాడాడు. కాని ఈ చీకటిలో ఏదీ సరిగ్గా కనిపించదు.

"ష్!" అంది కొలంబా. "గుర్రం డెక్కల చప్పుడు వినిపిస్తోంది. అంటే మన కింక భయం లేదన్న మాట!"

నిజంగానే ఒక గుర్రం అటు వస్తోంది. తుపాకి శబ్దాలకి భయపడిపోయి ఉంటుంది.

"ఇంక భయంలేదు!" అన్నాడు బ్రాందొలాచ్చియో కూడా. కొలంబా సహాయంతో దానిని వెతికి పట్టుకుని క్షణంలో సవారికి సిద్ధం చేశాడు. "ఇక ఫాదరీని పట్టుకోవాలి" అని రెండుసార్లు ఈల వేశాడు. సమాధానంగా ఒక ఈల వినిపించింది. ఆర్సో తుపాకి శబ్దం ఆగిపోయింది. బ్రాందొలాచ్చియో గుర్రం ఎక్కాడు. కొలంబా తన అన్నని అతనిముందు కూర్చోపెట్టింది. బందిపోటు అతన్ని గట్టిగా ఒక చేత్తో అదిమి పట్టుకుని, రెండవ చేత్తో గుర్రాన్ని తోలాడు. అసలే తుపాకి మోతలకి భయపడిన ఆ గుర్రం బాగా ఏటవాలుగా ఉన్న చరియని ఒక్క పరుగులో దిగిపోయింది. కార్సికన్ గుర్రాలకే ఇది సాధ్యం అవుతుంది. మరో కజాతి గుర్రం అయితే ఇద్దరి బరువుకి తోడు ఆచరియ దిగటంలోనే చనిపోయి ఉండేది.

కొలంబా మిస్ నెవిల్‌కోసం బలంకొద్దీ అరిచింది. కాని జవాబు రానేలేదు......ఇటూ, అటూ తిరుగుతూ ఉండగా ఒక సైనికుడు తటస్థించి, "ఎవరక్కడ?" అని కేక వేశాడు.

"ఓహో!" అంది కొలంబా వేళాకోళంగా.

"పెద్ద గొడవే అయింది, ఎంత మందిని చంపారు?"

"మీరూ బందిపోట్ల తాలూకే!" అన్నాడు ఒక సైనికుడు "మాతో రండి!"

"తప్పకుండా" అని సమాధానం ఇచ్చింది కొలంబా. "కాని మా స్నేహితురాలు ఒకామె ఇక్కడ దారి తప్పిపోయింది! ఆమె కోసం వెతకద్దూ?"

"మీ స్నేహితురాలిని పట్టుకున్నాము. ఆమెతో బాటే మీరూ జయిలు కెళ్లాలి!"

"జయిల్లోనా ఉంది? దాని సంగతి తర్వాత చూసుకోవచ్చు, ముందు ఆమెదగ్గరకి తీసుకుపొండి"

సైనికులు ఆమెని బందిపోట్ల 'స్థావరా'నికి తీసుకువెళ్లారు. ఆర్సో పడుకున్న 'తల్పం,' ఒక కూజానీరు సాక్ష్యాల క్రింద కాబోలు మధ్యగా ఉంచారు. మిస్ నెవిల్ కూడా అక్కడే ఉంది. భయంతో సగం చచ్చిపోయి ఉంది. ఎంతమంది దొంగలున్నారు? ఎటు వెళ్లారు? అని అడుగుతున్న సైనికుల మధ్య కూర్చుని వారి ప్రశ్న లన్నిటికీ కన్నీళ్లతోనే సమాధానం చెబుతోంది.

కొలంబా ఆమెను దగ్గరిగా తీసుకుని చెవిలో అంది: "వారు బతికిపోయారు!" తర్వాత సైనికుల సార్జెంటు వైపు తిరిగి ఇలా చెప్పింది: "అయ్యా, ఈ అమ్మాయికి మీరు అడిగే ప్రశ్నలకి జవాబులు తెలియవని మీకూ తెలుసు! గ్రామానికి తిరిగి వెళ్ళిపోతాము. పోనివ్వండి—మా కోసం ఎందరో కాచుకుని ఉంటారు."

"మేము మీ వెంటనేవచ్చి, వద్దన్నాసరే ఈ వేళప్పుడు ఈ బందిపోట్ల స్థావరంలో మీరేమి చేస్తున్నారో చెబితే వింటాము, చిలకా!" అన్నాడు ఆతను. "వాళ్లు మామీద తుపాకులు పేల్చారు! ఏమిటోగాని, బందిపోట్లంటే ఆడపిల్లలకి సరదా—వాళ్లెక్కడుంటే వీళ్లూ తయారవుతారు!

"మీరు పరుసులే సార్జెంటుగారూ" అంది కొలంబా. "కాని మాట లెలా వస్తున్నాయో గమనించండి. ఈ అమ్మాయి తండ్రి పెద్ద అధికారి. ఆమెతో చెలగాటం మంచిదికాదు!"

"అధికారి కూతురా!" అన్నాడు ఒక సైనికుడు తన నాయకుడి చెవిలో. "నిజమే, ఆమె తలమీద టోపీ కూడా ఉంది!"

"టోపీ కేమిటిలే!" అన్నాడు సార్జెంటు. "ఫాదరీతో ఉన్నారు వీళ్ళిద్దరూ; ఈ దేశంలో కెల్లా పెద్ద రసికుడు వాడు. వాడిని వెంటాడదామని ఉంది నాకు. ఇక్కడ మనకి పనేమీ లేదుకదా! ఈ ఫ్రాంసిస్ ఉన్నాడే......వట్టి తాగుబోతు........ వాడి కుక్క కార్పొరల్ తోసాన్ లేకపోతే మళ్లు తిరగాలిసిందే......వలలో చిక్కు కున్నట్లే ఇక్కడ......"

"మీరు ఏడుగురా?" అని అడిగింది కొలంబా. "ప్రమాద వశాత్తు గాంచినీ, పరోచ్చి, థియొడోర్ పోలీ సోదరులు గనుక తగిలారంటే మిమ్మల్ని ఏం చేస్తారో తెలుసా? ఈ ప్రదేశానికంతా అతనే రాజు! రాత్రిపూట తోటాలకి కళ్లు కనిపించవు కదా......"

> "రాజుగారు మా తాతగారి బుజంమీద కత్తిపెట్టేసరికి ఆయన జమిందారుఅయ్యాడు తెలుసా?"
> "ఓస్ ఇంతేనా! మాతాతగారి భుజాన్ని రాజుగారి కత్తి ముట్టుకునేసరికి ఆయన దేవతఅయి పోయాడుట."
>
> శివరాం (మద్రాసు)

కొలంబా చెప్పిన సుప్రసిద్ధ చోరులతో సంఘర్షణకి ఇష్టపడలేదు సైనికులు. కార్పొరల్ తోసాన్ (ఫ్రాంసిస్ అనే అతని కుక్క పేరు!) తో బాటు అందరూ వెనక్కి తిరిగారు. గుంపు గుంపూ పియత్రనెరా దారి తొక్కింది. ఆర్సో పడుకుని ఉన్న 'తల్పం' మీద సామాను సాక్ష్యంగా తీసుకుపోయారు. నీటి కూజాని తన్ని విరగకొట్టేశారు. ఒక సైనికుడు మిస్ లిడియా చెయ్యి పట్టుకుని నడిపించపోయాడు. కాని కొలంబా అతని ఆపివేసింది. "ఎవరూ ముట్టుకొనటానికి వీల్లేదు!" అంది. "మేమయినా పారిపోతామనుకున్నారా? రండి మిస్ లిడియా! చిన్నపిల్లలాగ ఏడవటం మానేసి నా చెయ్యి పుచ్చుకుని నడిచిరండి! ఇదొక దుస్సంఘటన. కాని విషాదాంతంగా ఉండదు! అరగంటలో భోజనానికి కూర్చుంటాము. ఆకలేసి చచ్చిపోతున్నాను!"

"నన్ను గురించి అందరూ ఏమనుకుంటారు" అంది మిస్ నెవిల్ నెమ్మదిగా.

"ఏమనుకుంటారు చిట్టడివిలో తప్పిపోయిందనుకుంటారు. అంతే!"

"గ్రామాధికారి ఏమంటాడో....... మా నాన్న ఏమంటాడో అసలు!......"

"గ్రామాధికారేనా? ఇవన్నీ నీ కెందుకని అడగండి......ఆర్సోతో మీకున్న స్నేహాన్నిబట్టి అవి లేమీ అనడు ఆయన......"

మిస్ నెవిల్ సమాధానం ఏమీ చెప్పకుండా ఆమె చేతిని నొక్కింది.

"అవునా?" అని అడిగింది కొలంబా ఆమె చెవిలో. "మా అన్నయ్య మీ ప్రేమకి అర్హుడేనా? అతనంటే మీకు కొంచెం కూడా ప్రేమ లేదా?"

"కొలంబా!" అని జవాబు ఇచ్చింది మిస్ నెవిల్ అంత కంగారులోనూ నవ్వుతూ. "మిమ్మల్ని ఇంత నమ్మిన తర్వాత ఇలా బయట పెట్టెయ్యటం బాగా లేదు!"

కొలంబా ఆమె నుదురుమీద ముద్దు పెట్టుకుని, "క్షమించండి చిన్నమ్మాయిగారూ!" అంది.

"సరేలెండి పెద్దమ్మాయిగారూ!......" అని లిడియా కొలంబాని ముద్దు పెట్టుకుంది.

గ్రామాధికారి మొదలయిన వాళ్లు ప్రియత్రనెరాలో ఏమిటేమిటో అనుకుని ఆందోళనకి లోనవుతున్నారు. ఇంతలో సైనికుల గుంపు వచ్చింది. వారిలో ఒకడు బందిపోట్లతో యుద్ధం చేశామనీ, కొంత సాక్ష్యం, వారి ఉంపుడు కత్తెలు ఇద్దరినీ చేజిక్కించుకున్నామనీ చెప్పాడు. కాని తీరా, కొలంబా, లిడియాలని చూసిన తర్వాత గ్రామాధికారి మొదలయినవారు తెల్లబోయి వారిని ప్రశ్నించారు. ప్రాసిక్యూటర్ కూడా మిస్ లిడియాని కొన్ని ప్రశ్నలు వేశాడు. చివరికి ఇద్దరినీ విడిపించటం జరిగింది.

"ఈ అమ్మాయిగార్లిద్దరూ అలా షికారుకి వెళ్లి, ప్రమాద వశాత్తు గాయపడిన ఒక యువకుడిని కలిశారు—అంతేగా?" అన్నాడు గ్రామాధికారి. కొలంబాని ఉద్దేశించి ఇంకా ఇలా అన్నాడు: "మిస్ కొలంబా శవ పరీక్షవల్లా, ఇంకా ఇతర సాక్ష్యంవల్లా మీ అన్నగారి కథ నిజమని తేలింది. కాని అతను వెంటనే చిట్టడవిలోనుంచి బయట పడి అధికారులకి లొంగి పోవటం అవసరం!"

అందరూ భోజనానికి కూర్చునేటప్పటికి ఇంచుమించు పదకొండు గంటలయింది. గ్రామాధికారితోనూ, ప్రాసిక్యూటర్‌తోనూ వేళాకోళంగా మాట్లాడుతూ కొలంబా సుష్టుగా భోజనం చేసింది. మిస్ లిడియా మాత్రం ఏమీ మాట్లాడకుండా దించిన కళ్లు ఎత్తకుండా కూర్చుని ఉండిపోయింది. కర్నల్‌గారూ తింటున్నంతసేపూ ఏమీ మాట్లాడలేదు కాని, చివరికి గంభీరంగా, మృదువుగా అడిగాడు ఇంగ్లీషులో:

"లిడియా, ఈ డెల్లారెబ్బియాని పెళ్లి చేసుకోవాలనుకుంటున్నావా?"

"అవును నాన్నగారూ!" అంది ఆమె దృఢమయిన గొంతుకతో ముఖం ఎర్ర బడినప్పటికీ.

కళ్లు ఎత్తి తన తండ్రి మొహంలో కోపం వంటిది ఏమీ కనిపించకపోయేసరికి అమాంతం వెళ్ళి ఆయనను కౌగలించుకుంది.

"చాలా సాహసం కలవాడు!" అన్నాడు కర్నల్‌గారు. "కాని ఈ దేశంలో ఉండటానికి మాత్రం వప్పుకోను!"

"నాకు ఇంగ్లీషు రాదుగాని మీరేమి మాట్లాడుకుంటున్నారో గ్రహించగల ననుకుంటున్నాను" అంది కొలంబా వారివైపు కుతూహలంగా చూస్తూ.

"మీరంతా మాతో అయిర్లాండ్‌కి వస్తారను కుంటున్నాము" అని జవాబు చెప్పాడు కర్నల్ గారు.

"తప్పకుండా వస్తాను. అంతేనా కర్నల్‌గారూ చేతిలో చెయ్యి వేసి చెప్తారా?"

"చేతిలో చెయ్యి వేసేకాదు. ఎలా కావలిస్తే అలాగు!" అన్నాడు కర్నల్‌గారు.

* * *

పియుత్రనెరా ప్రజలని ఇంత కదిలించివేసిన ఈ రెండు మృత్యువులు సంభవించిన కొన్ని నెలల తర్వాత ఎడమ చెయ్యి కట్టు కట్టుకుని ఉన్న ఒక యువకుడు గుర్రం ఎక్కి కార్డో గ్రామం వైపు వెడుతున్నాడు. కార్డోలో ఒక సుప్రసిద్ధ మయిన నీటి ఊట ఉంది. ఇది ఆరోగ్యానికి మంచి దని ఎందరో అక్కడికి వెడుతూ ఉంటారు. చాలా అందంగా ఉన్న ఒక అమ్మాయి కూడా అతని పక్కనే ఒక నల్ల గుర్రం సవారి చేస్తూ వెడుతోంది. ఇది చాలా చక్కని అశ్వం. కాని దాని చెవులలో ఒకటి కోసివేసి ఉంది. గ్రామం లోకి రాగానే ఆమె తన గుర్రం దిగి, యువకుడికి దిగటానికి సహాయపడి తన జీనుకి తగిలించిన ఒక సంచీ తీసుకుంది. గుర్రాలని ఎవరో రైతుకు లప్ప చెప్పి కొండలలోకి వెళ్ళిపోయారు ఇద్దరూ. యువ కుడు ఒక పెద్ద తుపాకి పట్టుకుని ఉన్నాడు. కెర్బియో అనే కొండ చరియ దిగువ భాగం చేరు

కున్నారు. ఇద్దరూ ఎవరికోసమో కాచుకుని నుంచు న్నట్టున్నారు. అమ్మాయి తరచు తన దగ్గరే ఉన్న ఒక రత్నాలు పొదిగిన గడియారాన్ని చూసేది. వారి నిరీక్షణ వ్యర్థం కాలేదు. పొదలలోనుంచి ఒక కుక్క బయటికి వచ్చింది. అమ్మాయి 'బుస్కో' అని పిలవగానే దగ్గిరకివచ్చి ముద్దు చేయించు కుంది. త్వరలోనే గడ్డాలు పెంచుకున్న ఇద్దరు యువకులు కనిపించారు. ఇద్దరూ సాయుధులుగా ఉన్నారు. వారి చిరిగిపోయిన దుస్తులతో పోలిస్తే తళతళ మెరిసి పోతున్నాయి ఒక సుప్రసిద్ధ ఆయుధ నిర్మాణ సంస్థలో తయారయినవి వారి తుపాకులు. నలుగురూ చాలా ఆప్తులవలె ప్రవర్తించారు.

"ఏమిటి ఆర్ఫ్ ఆంటన్!" అన్నాడు బంది పోట్లలో ఎక్కువ వయసు కలవాడు. "మీ వ్యవ హారం ముగిసిందిగా. నా అభినందనలు పుచ్చుకోండి! అడ్వొకేటు ఇక మిమ్మల్నేమీ చెయ్యలేడు..... అన్నట్లు మీ చెయ్యెలా ఉంది?"

"రెండు వారాల్లో కట్టు తీసేస్తారు" అని సమాధానం చెప్పాడు యువకుడు. "బ్రాందో, రేపు ఇటలీకి వెళ్లిపోతున్నాను! సెలవు తీసుకుందా మనే వచ్చాను. అందుకనే ఇక్కడ వచ్చి కలుసు కోమని కోరాను."

"అయితే మీకు పెద్ద వ్యవధి లేదన్నమాట" అన్నాడు బ్రాందొలాచ్చియో. "నిన్న వచ్చి రేపు వెళ్ళి పోవటమేనా?"

"పనులున్నాయి!" అంది అమ్మాయి ఉల్లా సంగా. "అయ్యో, మీ భోజనం తెచ్చాను! తినండి. కాని నా మిత్రుడు బ్రుస్కోని మర్చిపోకండి!"

"బ్రుస్కోని గారాబంచేసి చెడగొడుతున్నారు కొలంబాగారూ! వాడికీ తెలుసా సంగతి! అయినా చూడండి" అని తుపాకి ఎక్కుపెట్టి, "ఏదీ బ్రుస్కో బారిచినీకి సెల్యూట్ చెయ్యి!" అన్నాడు. కుక్క నిశ్చలంగా ఉండిపోయింది!" దెల్లారెబ్బి యాకి సెల్యూట్ చెయ్యి!" అనగానే రెండు కాళ్లమీద లేచినుంచుంది.

"మీ రిద్దరూ నాకు స్నేహితులు. నా మాట వినండి! ఇక్కడే ఉండిపోతే ఏ పోలీసు తుపాకి గుండుకో బలి అయిపోతారు. ఏదో చెయ్యకపోతే లాభం లేదు....."

"సరే! ఒక రకం చావుకాకపోతే మరొకటి! జ్వరంపడి అందరూ ఏడుస్తూ ఉంటే పక్కమీద పడుకుని చావడం కన్నానా? కాలికి తొడుక్కున్న బూట్లతో చావడం గొప్ప అంటారు మా గ్రామం లో."

"ఈ దేశం వదిలి ఎక్కడయినా ప్రశాంతంగా జీవించమని నా కోరిక. సార్డీనియన్‌లో స్థిరపడి పోరాదూ? నేను తక్కిన ఏర్పాట్లన్నీ చేస్తాను."

"సార్డీనియన్‌లోనా?" అని అరిచాడు బ్రాందొ లాచ్చియో. "వారి వెధవ యాస భాషకే తట్టుకో లేము. ఆ దేశం మాకు అసలే పడదు."

"అక్కడివారు దద్దమ్మలు" అన్నాడు 'ఫాదరీ'

"అక్కడ బందిపోట్లని అశ్వ దళాలతో తరుము తారుట! (ఇది చాలా హేయమయిన అలవాటుకింద చూస్తారు కార్సికాలో.) అదికాదుగానీ, అసలు మీరు కూడా మాతోనే ఇలా ఉండిపోలేదేమా అని నేను ఆశ్చర్యపడుతూ ఉంటాను."

"నిజమే" అన్నాడు ఆర్ఫో చిరునవ్వుతో. "ఆ రాత్రి మీ గుర్రంమీద బస్తా పడేసినట్లు తీసుకు పోయినప్పుడే తెలిసింది మీ జీవితంలోని మాధుర్యం నాకు!"

"ఎవరయినా తరుముకుని వస్తూ ఉంటే తప్పించుకుని పారిపోవటం ఎంత సరదాగా ఉంటుం ది!" అన్నాడు. కాస్త్రికోని. "ఇటువంటి సంపూర్ణ స్వేచ్ఛా జీవితంలోని ఆకర్షణ మీ కెందుకు తెలి యటం లేదు? మాకు మేమే రాజులం!" ఈ ధోరణిలో మరికొంతసేపు చెప్పుకుపోయాడు అతను.

నాకు కాబోయే వదినగారికి చిట్టడవి జీవితం అంటే ఇష్టంలేదు" అంది కొలంబా నవ్వుతూ. "ఆవిడ ఉత్తి భయస్తురాలు."

"అయితే ఇక్కడే ఉండిపోతా రన్నమాట" అన్నాడు ఆర్ఫో. "నేను మీ కోసం చెయ్యగలిగిం దేమయినా ఉందా?"

"ఏమీలేదు" అన్నాడు బ్రాందొలాచ్చియో. "కాని మీరంతా వెళ్ళిపోతే మాకు రొట్టె, మందు గుండు సామగ్రి ఎవరిస్తారు?"

"అవసరమయినప్పుడు కాదనకండి!" అంటూ ఆర్ఫో కొంత డబ్బు ఇవ్వపోయాడు.

"డబ్బులు మాత్రం పుచ్చుకోము!" అని వారిద్దరూ నిరాకరించారు.

"ప్రపంచం డబ్బుమీదే నడుస్తోంది. కాని చిట్టడవిలో మాత్రం భయం ఎరుగని గుండె, గురి తప్పని తుపాకి మాత్రం చాలు!" అన్నాడు కాస్త్రికోని.

"మా జ్ఞాపకార్థం ఏదో ఒకటి మీరు పుచ్చు కోనిదే వెళ్లను" అన్నాడు ఆర్ఫో. "ఏమి వదిలి పొమ్మంటావు బ్రాందో?".

"బందిపోటు తల గోక్కుంటూ ఆర్ఫో తుపాకి వంక ఓరగా చూశాడు:

"లెఫ్టినెంట్!......ఏమయినా అనుకుంటా రేమో......మీకు బాగా పనికొచ్చేది......"

"ఏమిటో చెప్పుమరి!"

"ఏమీలేదు......ఏమీలేదు......ఒక చేత్తో రెండు ప్రాణాలు తీశారే దాన్ని గురించే ఆలోచిస్తూ ఉంటాను.......మళ్లీ సాధ్యం అవుతుందా?

"తుపాకి కావాలా నీకు?......ఇచ్చేస్తాను, కాని చంపటంకన్నా ఏమి చెయ్యగలదిది?"

"ఓహో! కాని జాగ్రత్తగా ఉంచుతా దాన్ని!' కాని అనవసరంగా వాడనని హామీ ఇస్తున్నాను!'

"కాస్త్రికోని నీకేమి ఇవ్వను?"

"భౌతికాకారం కల దానినేదయినా ఇచ్చి తీరుతా నంటున్నారు కాబట్టి 'హోరేస్' (లాటిన్—కవి—అ॥ పద్యాలున్న పుస్తకం చిన్నదొకటి కొని పంపిం చండి. లాటిన్ మర్చిపోకుండా కాపాడుతుంది నన్ను! బాస్తియాలో ఒక పొగాకు వ్యాపారం చేసే వాడున్నాడు. వాడి దగ్గర కొని పంపండి!"

"ఎల్జెవిర్‌వారు ముద్రించినది కొని పంపిస్తాను!" అన్నాడు ఆర్ఫో. (ఒక ప్రసిద్ధి పొందిన ముద్రణ సంస్థ—అ.) "సరే మనం ఇంక సెలవు పుచ్చు కునే వేళయింది! ఏదీ మీ చెయ్యి! సార్డీనియన్ వెళ్ల దలుచుకుంటే నాకు రాయండి" అని ఒక ఎడ్వ కేట్ చిరునామా ఇచ్చాడు. తన ఉత్తరాలు అక్కడికి పంపవచ్చు నన్నాడు.

"లెఫ్టినెంట్!" అన్నాడు బ్రాందో. "రేపు మీరు వెళ్లిపోయేప్పుడు సముద్రం మీద నుంచి ఈ కొండని పరీక్షగా చూడండి. మా రుమాళ్లతో మీకు సంజ్ఞలు చేస్తాము."

వారు విడిపోయారు. ఆర్ఫో, అతని చెల్లెలు

# కొలంబా

**కార్డొకి, బందిపోట్లు కొండలలోకి వెళ్ళిపోయారు.**

ఏప్రిల్ నెలలో ఒక చక్కని ఉదయం కర్నల్ సర్ థామస్ నెవిల్, అంతకి కొన్ని రోజులముందే పెళ్ళి అయిన ఆయన కూతురు, ఆర్సో, కొలంబా— అందరూ అప్పుడే బయట పడిన ప్రాచీన శిలా విశేషం ఒక దానిని చూడటానికని పైసాకి వచ్చారు. (ఇది 'ఎట్రుస్కన్' జాతివారు తవ్విన సొరంగం వంటి సమాధి. ఇటువంటి సమాధులలో విలువ కల వస్తువులు చాలా దొరికేవి. ఎట్రుస్కన్‌లు, రోమన్‌ల మునుపు ఇటలీలో ఉన్న ఒక జాతి—అ॥) ఎట్రుస్కన్ సొరంగంలోకి దిగిన తోడనే ఆర్సో, అతని భార్య పెన్సిళ్లు బయటికి తీసి అక్కడి కుడ్య చిత్రాలు, మొదలయినవాటి నమూనాలు గియ్యటం ప్రారంభించారు. కొలంబా, కర్నల్‌గారు మాత్రం—ప్రాచీన శిలా విశేషాలంటే అంత ఆసక్తి లేదేమో—చుట్టు పక్కల తిరగడం—మొదలు పెట్టారు.

"అమ్మాయి, కొలంబా!" అన్నాడు. "మనం భోజనం వేళకి పైసా చేరుకుంటామనే నమ్మకం లేదు నాకు. నీకు ఆకలిగా లేదూ? వాళ్ళిద్దరూ బొమ్మలు గియ్యటం మొదలు పెట్టారంటే ఆగరు!"

"అంతే వాళ్ళు! బొమ్మలు అసలు పూర్తి గావేమో అనిపిస్తుంది" అంది కొలంబా.

"అందుకనే మనం అలా ఆ ఇంటి వైపుగా వెళ్ళి రొట్టె, వైన్, వగైరాలు దొరుకుతాయేమో చూద్దామా?"

"అలాగే కర్నల్‌గారూ! ఇంట్లో కాస్త మామూలు మనుష్యులం మనిద్దరమే ననిపిస్తుంది. వీళ్లిద్దరూ కవిత్వం మీదనే బతికేట్లు కనిపిస్తారు! మీ చెయ్యి ఇవ్వండి, పట్టుకుని నడిపించేందుకు చూశారా? ఎంత మారిపోయానో? నాగరికుల లాగే చెయ్యి పట్టుకుని నడిచి వస్తాను! టోపీ పెట్టుకుంటాను! నగలు పెట్టుకుంటాను! ఇంకా ఎన్ని నేర్చుకుంటానో? ఇక అనాగరిక స్త్రీని అని ఎవరనగలరు నన్ను? ఈ శాలువ ఎంత నాజూకుగా వేసుకున్నానో చూశారా?..... మీరెజిమెంటులో ఒక బంగారు జుట్టు ఆఫీసర్ లేడూ.... అయ్యో! అతని పేరే మర్చిపోయాను......ఒక దెబ్బతో కింద పడెయ్యగలను......"

"బాట్‌వర్తేనా?" అన్నాడు కర్నల్‌గారు.

"అతనే! కాని నాకు పేరు నోరు తిరగదు. నా మీద ప్రేమతో పిచ్చివాడయిపోయాడు!"

"కొలంబా నువ్వు గడుసు దానివి!.....త్వరలో మరో పెళ్ళి జరుగుతుందేమిటి?"

"నేనా? పెళ్ళి చేసుకొనటమా? మా మేనల్లుడిని ఎత్తుకునే వారెవరు?...... వాడికి కార్సికన్ భాష నేర్పే వారెవరు? అవును, వాడికి కార్సికన్ భాష నేర్పి కుచ్చు టోపీ చేసి ఇస్తాను!"

"చివరికి నాకు కూడా ఒకటి ఇస్తావా ఏమిటి"

"బాకులకిక సెలవు!" అంది కొలంబా ఉల్లాసంగా. "ప్రస్తుతం విసనకర్ర చాలు! మా దేశాన్నేమయినా అన్నారా దీనితో మీ వేళ్లమీద ఒక దెబ్బ వేస్తాను!"

ఇలా మాట్లాడుకుంటూ ఇద్దరూ మొదట చూసిన ఇంటిని సమీపించారు. కర్నల్‌గారు వైన్ తాగుతూ కూర్చుని ఉండగా కొలంబా ఇంటి ఇంటి పరిచారికతో స్ట్రాబెర్రీ పళ్లు ఏరటానికి వెళ్ళింది. ఒకచోట ఎండలో, పడక కుర్చీలో కూర్చుని ఉన్న ఒక ముసలివాడు కనిపించాడు కొలంబాకి. జబ్బుగా కనిపిస్తున్నాడు. మొహం ముడతలు పడిపోయింది. కళ్లు లోతుకి దిగిపోయాయి. అతని పాలిపోయిన శరీరం, నిశ్చేష్టత, జీవంలేని చూపూ అన్నీ శవమా, ప్రాణం ఉన్న దేహమా అనే అనుమానం కలిగించేట్లు ఉన్నాయి. కొలంబా కొన్ని నిముషాలపాటు అతన్ని పరీక్షగా చూసింది. ఇది గమనించిన పరిచారిక "పాపం, మీ దేశం వాడే ఈ ముసలివాడు! నాకు అంత బాగారాదీ భాష" అంది. "అతనికి పెద్ద దెబ్బలే తగిలాయి జీవితంలో. ఇద్దరు కొడుకులూ ఘోరంగా చనిపోయారు. ఏమీ అనుకోకండికాని, మీ దేశంవారి శత్రుత్వాలు మరీ క్రూరంగా ఉంటాయి. ఈ ఊళ్లోనే వాళ్ల చుట్టాలు ఎవరో ఉంటే వాళ్లతో కలిసి ఉంటున్నాడు. అసలు ఈ ఇల్లు ఈ చుట్టాలదే! పాపం మనిషి చాలా చితికిపోయాడు.....చాలా నెమ్మదిగా ఉంటాడు. ఎక్కువగా మాట్లాడడు! ...... మతి చలించి పోయింది......వైద్యుడు ప్రతి రోజూ వచ్చి చూసి పోతాడు. ఇంకెక్కువ కాలం బతకడంటాడు....."

---

"ఏమండీ నేను మీకు జ్ఞాపకమున్నానా! ఆరోజుల్లో మీరు నన్ను పెళ్లి చేసుకోవాలనుకున్నారు కూడా" ఒకావిడ పల్కరించింది.

"ఓ నేను జ్ఞాపకం వచ్చింది! అన్నట్లు మరి పెళ్లి చేసుకున్నానా మరి!" పరధ్యానం ప్రొఫెసరుగారి సమాధానం.

సి. డి. రావు (సుందరపురం)

---

"అలాగా?" అంది కొలంబా. "ఒక విధంగా అదీ మంచిదే!"

"అమ్మాయిగారూ! కొంచెం మీ భాషలో పలకరించండి. సొంత భాష విని సంతోషిస్తాడేమో!"

"చూద్దాం!" అంది కొలంబా వ్యంగ్యంగా చిరునవ్వు నవ్వుతూ! వెళ్లి సరిగ్గా తన నీడ అతని మీద పడేట్లు నుంచుంది. పాపం, ఆ ముసలివాడు తలఎత్తి కొలంబా వైపే దీక్షగా చూశాడు. కొలంబా నవ్వుతూనే నుంచుని ఉండిపోయింది. అమాంతంగా వృద్ధుడు తన చేతిని ముఖానికి అడ్డంగా పెట్టుకున్నాడు. కొలంబా చూపుని తప్పించుకునేందుకా అన్నట్లుగా కళ్లు గట్టిగా మూసుకుని, అలాగే కొంతసేపు ఉంచి మళ్లీ తెరిచాడు; కాని మరీ వెడల్పుగా తెరిచి చూస్తున్నాడు. అతని పెదవులు వణుకుతున్నాయి. చేతులు ముందుకి చాపపోయాడు. కొలంబా వంక విభ్రాంతిలో చూస్తున్నాడు. కుర్చీకే అంటుకుపోయినట్లు కూర్చుని ఉండిపోయాడు. చివరికి కళ్లలోనుంచి పెద్ద కన్నీటి బిందువులు కారటం ప్రారంభించాయి. రెండు మూడుసార్లు వెక్కి వెక్కి ఏడ్వటంతో వక్ష ప్రదేశం ఎగిరి ఎగిరి పడింది.

**"ఇలా ఆవగా చూడటం ఇదే మొదటిసారి!"** అంది అక్కడే తోటలో పని చేస్తున్న ఒక పని మనిషి. "అమ్మాయిగారు మీ దేశంవారే! మిమ్మల్ని చూడటానికని వచ్చారు!" అంది ముసలివాడితో.

"అయ్యో!" అని అరిచాడు అతను బొంగురు పోయిన గొంతుకతో. "అయ్యో! ఇంకా తృప్తి లేదా నీకు? ఈ ఆకుల్ని నేనే తగల పెట్టాను...... వాటిమీద ఏమీ రాసి ఉందో ఎలా చదవటం?...... కానీ ఇద్దరినీ ఎందుకు? ...... అర్లాందుచ్చియో మిమ్మల్నేమి చేశాడు? ...... ఒక్కడినయినా వదిలి ఉండాలి......అర్లాందుచ్చియో......అతని పేరు చదవ లేదు. మీరు......."

"ఇద్దరినీ!......." అంది కొలంబా మెల్లిగా. కార్సికన్ భాషలో. "రెండు కొమ్మలూ పడిపోయాయి ........ మొదలు గనుక వాడిపోకపోతే దాన్ని నరికే దాన్ని! కాని ఎందుకు బాధ పడ్తావు? ఇంకెంతో కాలం లేదు నీకు. నేనో! రెండేళ్ళు బాధ పడ్డాను!"

ముసలివాడు చిన్నగా అరిచాడు. అతని తల అతని రొమ్ము మీదకి వాలిపోయింది. కొలంబా వెనక్కి తిరిగి ఇంటివైపు నడిచి వెళ్ళిపోయింది తనలోనే పాడుకుంటూ: "గురి పెట్టగలిగే చెయ్యి సరిగ్గా చూసే కన్నూ ....... కదిలే గుండె......, అవసరం!......"

పని మనిషి ముసలివాడి పరిచర్య చేస్తూ ఉండిపోయింది. కొలంబా ఉత్సాహంతో ఎర్రబడిన ముఖంతో, మెరిసే కళ్లతో వచ్చి కర్నల్‌గారి ముందు కూర్చుంది.

"ఏమిటి?" అన్నాడు ఆయన. "పియత్రనెరాలో మనం భోజనానికి కూర్చున్నప్పుడు తుపాకులు పేలాయ్ — అచ్చు అప్పుడున్నట్లే ఉంది నీ వైఖరి!"

"ఏవో కార్సికా జ్ఞాపకాలు కొన్ని నాలో మెదిలాయి. కాని అదంతా ఇప్పుడు అయిపోయింది. మా అల్లుడికి మంచి పేరు పెడతాను — గిల్‌ఫుచ్చియో—తొమాసో—ఆర్సో—లియోనె!"

తోటపని చూసుకునే మనిషి పరిగెత్తుకుని వచ్చింది. "ఏమిటి?" అని అడిగింది కొలంబా చల్లగా. "చచ్చిపోయాడా? లేకపోతే మూర్ఛ మాత్రమేనా?"

"ఏమీ లేదులెండి. కాని, మీ రాక మూలంగా ఆలా అయ్యాడేమిటో!"

"ఎక్కువ కాలం బతకడన్నాడా వైద్యుడు?"

"రెండు నెలలు, బహుశ!"

"ఫరవాలేదు, పెద్ద నష్టం ఏమీ కాదులే!" అంది కొలంబా.

"ఏమి టిదంతా?" అని కర్నల్‌గారు అడిగారు.

"మా దేశం ముసలివాడెవడో ఇక్కడికి వచ్చి ఉంటున్నాడుట. అతని సంగతి నేను కొంత కాలంగా కనుక్కుంటూనే ఉన్నాను" అంది కొలంబా నిర్లక్ష్యంగా. "కాని, కర్నల్‌గారూ మా అన్నయ్యకీ లిడియాకీ పళ్లు ఇవ్వరా ఏమిటి?"

కొలంబా ఆ ఇల్లు వదిలి రోడ్డు మీద నడిచి వెళ్ళిపోతూ ఉంటే ఆమె వంకే చూస్తూ తన కూతురితో అంది ఆ ఇంటి పరిచారిక: "ఈ అమ్మాయిని చూశావుగా, ఎంత అందంగా ఉందో! కాని ఆమె కంటి చూపు పడితే చాలు. దృష్టి తగిలి తీరుతుందనుకుంటాను."

**అయిపోయింది.**

ఆ అమ్మాయి పరిచయం చేసుకొనటం మంచి దనుకున్నాడు.

కుతూహలంగా అందరూ చూస్తున్న వైపే తనూ చూశాడు. వక్కబరిణె అమ్మాయిని తన పిన్ని హ్లో నడిపించుకుని వస్తోంది. ఆ అమ్మాయి తకాలపు బర్మా దుస్తులలో ఉంది. జుట్టు పైకి ఎగదోసి ముడివేసి ఉంది. నుదురుమీదికి రెండు మూడు ముంగురులు వేళాడుతున్నాయి. చెవుల చుట్టూ రెండు పేటలుగా అందంగా చుట్టి ఉంది ఆమె కేశసంపద. ఒకచేత్తో చొక్కా అంచు పట్టుకుని, కిందికి దించిన కళ్లతో నడిచివస్తోంది. ఆమె ఎర్రటి పాదాలమీద వేళ్లాడే చొక్కా అంచు డేగ రెక్కలాగ ఉంది. హ్లో చేతిలో వక్క బరిణె ఉంది. కాని, ఆ అమ్మాయి ఉత్సవంలో చేరగానే ఆమె చేతికి ఇచ్చేస్తుంది.

కోకోటిన్ ఆశ్చర్యపడిపోయాడు. అలాగే చూస్తూ నుంచుని ఉండిపోయాడు. "ఆహా! ఈ కంటికి ఇంత మనోహరమయిన దృశ్యం కనిపించలేదే! స్త్రీ అందం అంటే ఇలా ఉండాలి! మెయిసీలాగ మగవారిని సవాలుచేసి ఏం లాభం! ఆమె కేవలం సంపాదనలో మునిగిపోయిన స్త్రీ!"

# ఆసియా కథ

27 వ పేజీ తరువాయి

హ్లో పిన్ని—అతన్ని చూసి ఆనందంతో చిరనవ్వు నవ్వింది. బరిణె అతనికి ఇచ్చింది. అతని మనస్సులోని కోరిక గ్రహించింది. కోకోటిన్ బరిణె 'వాహిని' ముఖంలోకి నిండుగా చూశాడు. "నువ్వా! మెయిసీ!" అని అరిచాడు కోపంగా. "నన్ను ఇలా చెయ్యటానికి ఎలా బుద్ధిపుట్టింది నీకు!"

మెయిసీ వెంటనే సమాధానం చెప్పింది. "నామీద అరవక! ఇప్పుడు నిన్నెవరేం చేశారు? వక్క బరిణె మొయ్యాలని నా కెప్పుడూ ఆశగా ఉండేది! మా అమ్మా వాళ్లు నడిచినట్లే ఉత్సవంలో నడవాలనుకునేదాన్ని. నిన్నే అడుగుదామనుకున్నాను. కానీ, నీ వాలకం నాకు నచ్చలేదు. ఏమిటో మీవారిని చూసి సిగ్గు పడిపోతున్నట్లు. ఈ వాతావరణం, ఈ ప్రజలు చూసి ఎంత ఆనందించావో నీ తల కెక్కేటట్లు చెప్పలేక!..... మీ హ్లో పిన్నికి మాత్రం అర్థం అయింది..... అందుకని ....."

"మీ రిద్దరూ నన్ను తెలివితక్కువ వాడినిగా చేసేశారు ...." అని పూర్తిచేశాడు కోకోటిన్.

"ఇంద బరిణె. కాని దాని అర్థం తెలుసా నీకు—" వాద్యాల ఘోషలో అతని మాటలు మునిగిపోయాయి.

ఎవరో పాట మొదలుపెట్టారు, ఆశ్రమం వదలివచ్చిన ప్రియుడికి స్వయంగా అల్లిన ఆకాశం రంగు పాసో (వస్త్రం) తో సిద్ధంగా ఉన్న అమ్మాయిని గురించి.

మెయిసీని ఉత్సవం గుంపులోకి నడిపించి తీసుకుని వెడుతున్న కోకోటిన్ అడిగేశాడు:

"నాకోసం ఆకాశం రంగు వస్త్రాలతో సిద్ధంగా ఉంటావా?" మెయిసీ తడుముకోకుండా జవాబు చెప్పింది. "ఆకాశం రంగు పాసోతో కాదు, కొత్త సూటు, టై లతో. నీ బోడిగుండుతో నవ్వొచ్చేటట్లుంటావు—యూల్ బ్రిన్నర్ ననుకోక!"

కోకోటిన్ నవ్వుకుంటూ తనకి ఉత్సవంలో నిర్ణయించిన చోటికి వెళ్లిపోయాడు. ఏ వంశంలో నయినా వక్క బరిణెని ఒక గయ్యాళి మోసుకు వెళ్లిందా, అని ఆలోచిస్తూ ఉండిపోయాడు. ★

ఈ నరములు పెరిగ్రాఫు తీగెల్లాగా నేరుగా పోవు కొన్ని నరములు, కొన్ని గేంగ్లియానుల కూడలులలో అంతమై, అక్కడనుండి వేరే శాఖలుగా మారి, వివిధాంగములకు పోతవి. వక్ష, ఉదర భాగములలో ఉండే సింపతెటిక్ నర కేంద్రములు అతి ముఖ్యములైనవి. అవి క్రమంగా (1) హృదయ కేంద్రము (2) సీలియక్ కేంద్రము (సీలియస్ అంటే సూర్యుడు. దీనినే సోలార్ ప్లెగ్జస్ అని కూడా అంటారు. సోలియస్ అన్నా సూర్యుడే) (3) ఊర్ధ్వాంత్ర కేంద్రము (Superior Mesenteric Plexus) (4) నీచాంత్ర కేంద్రము (Inferior Mesenteric Plexus) (5) హైపోగేస్ట్రిక్ కేంద్రము, (6) శ్రీకల్ కేంద్రము, (7) వాలకేంద్రము.

వెన్నుపాముకు రెండు వైపులా ఉండే రెండు సింపతెటిక్ దండలూ, వెన్ను చివర భాగమైన కాక్సిక్స్ వద్ద, ఒక దానితో ఒకటి లీనమౌతవి. ఆ లీన ప్రదేశంలో ఒక నర కేంద్రము ఉన్నది. దానిని ఇంపార్ గేంగ్లియాన్ (Ganglion Im Par) అంటారు. 'ఇమ్' (Im) అన్న ఉపసర్గకు 'కానిది' అని అర్థము. పార్ (Par) అంటే సమమైనది అని అర్థము. 'సమము కానిది' అని ఈ మాట కర్థము. పార్ అన్న మాట 'పరము' అన్న మాటకు కూడా సమమైనది. అపరమైనది. అని ఈ మాట కర్థము. పయామేటరులో ఆరంభించిన సింపతెటిక్ దండ ఈ ఇంపార్ గేంగ్లియాను వద్ద ఇంకొక ప్రక్కనుంచి వచ్చిన సింపతెటిక్ దండ అంతముతో కలిసి తావళీకృతి పొందుతున్నది. దానికి "పర"మైన దేదీ శరీరానికి సంబంధించినంతవరకు లేదు.

మొన్న మొన్నటిదాకా పాశ్చాత్య శరీర శాస్త్ర విజ్ఞానులు, మెదడులో ఉండే అధిష్ఠాన కేంద్రములకు, కాండగతమైన సింపతెటిక్ కేంద్రములకూ ఉండే సంబంధాన్ని తెలుసుకోలేదు. ఈమధ్యనే హైపోతేలమస్ అనే మెదడు భాగానికీ, మెదడు ఫాల భాగంలో ఉన్న మేధస్సుకు సంబంధించిన మెదడు భాగంలో ఉన్న కేంద్రాలకూ, సంబంధం ఉన్నదని

# మనమూ-మన దేహస్థితి

19 వ పేజీ తరువాయి

గ్రహించారు. ఇందువల్లనే మెదడు గౌర భాగమును ఆశ్రయించినదీ, ఊహ్యమైనదైనా అదృశ్యమైనది యైన "మనస్సు"కూ, వక్ష, ఉదర కుహరాలలో వున్న అంగములకూ సంబంధము ఉన్నదని గ్రహించారు. ఇది జీర్ణకోశ వ్యాధుల చికిత్సా మార్గంలో ఒక అతి ముఖ్యమైన మైలురాయి.

పాశ్చాత్య శాస్త్రజ్ఞ దృష్టితో కుడి సింపతెటిక్ దండకూ, ఎడమ సింపతెటిక్ దండకూ భేదం లేదు. కాని ప్రాచీన మహర్షులు, నరాశయంలో ఉండే కుడి ఎడమ భాగములు వేరు వేరు ధర్మాలను నిర్వర్తించేవని సందేహించి కొన్ని ప్రక్రియలతో అది సత్యమని నిరూపించారు. ఈ రెంటికీ 'ఇళ' 'పింగళ' అని వేరు వేరు పేర్లు పెట్టేరు.

ఆయుర్వేదంలో 'నాడి' అన్న మాటను ఆర్టెరీలకూ, నరములకూ సమానంగానే వాడినట్లు కనిపిస్తుంది. సింపతెటిక్ దండ ఆరంభ దశలో రక్తనాళం లాగా ఎర్రగా ఉండడము గమనించదగ్గ విషయము.

సింపతెటిక్ సిస్టము అన్ని ఇంద్రియముల తోనూ సంబంధం కలది.

ఎడ్రినల్ గ్రంథులు రెండు వైపులా రెండున్నవి. అవి కిడ్నీలమీద ఉన్నందున వాటికి సూప్రారీనల్ గ్రంథులు అని కూడా పేరు. 'రెన్' అంటే లేటిన్ భాషలో కిడ్నీ అని అర్థము. 'సూప్రా' అంటే 'మీద ఉన్నది' అని అర్థము. ఇందులో, కుడి ఎడ్రినల్ (Adrenal) గ్రంథి స్థూపాకృతి గలది. ఎడమ ఎడ్రినల్ గ్రంధి అర్ధ చంద్రాకృతి కలది. వీటిలోనూ కార్టెక్స అనే ఉపరి భాగమూ, మెడుల్లా అనే అంతర్భాగమూ ఉన్నవి. ఎడ్రినలిన్ అనే స్పందనమును ఇవి స్పందిస్తవి. ఈ స్పందనానికీ, ఉద్రేకాలకూ సంబంధం ఉన్నది. దీనికి సింపతెటిక్ శాఖ మాత్రమే పోతున్నది. ఆ సమయంలో కొన్ని పనులను నిషేధించే పేరాసింపతెటిక్ శాఖ ఈ గ్రంధికి ఎందుకు పోలేదు?

కామ క్రోధ, దుఃఖ ఆనందములనే అనుభూతులూ, వాటి అల్పత్వాతి రేకములూ, ఇంద్రియముల ద్వారా కలిగే అనుభూతులకు ఫలితంగానే కలుగుతున్నవి. విపరీతమైన కోపమో, దుఃఖమో, ఆనందమో కలిగినప్పుడు కన్నీరు వస్తుంది హృదయం వేగంగా కొట్టుకుంటుంది. కంఠం రుద్ధ తుంది. కడుపులో పీకినట్టు అనిపిస్తుంది. పసరు వాంతి అవుతుంది. అజీర్ణం చేస్తుంది. చెమట పోస్తుంది. ఇంద్రియములు భరించలేని అనుభూతులు 'షాక్' అనే మరణ సమానమైన స్థితిని కల్పిస్తవి. మానసిక ఉద్రేకాలను, మరీ హెచ్చకుండా మరీ మందం కాకుండా ఉంచే శక్తి, సాధనవల్ల రావలసిందే.

సింపతెటిక్ నరములను స్వాధీనం చేసుకుంటే ఉద్రేకములు అదుపులో ఉంటవి. అనిచ్ఛాధీన కండరములు, స్వాధీనంలో ఉంటవి. ఇంద్రియములు స్వాధీనంలోనే ఉంటవి. వాటి శక్తి అధికమై అతీంద్రియ స్థితి లభిస్తుంది. ఆధునికవిజ్ఞానం ఆ స్థితిని అందుకోలేదు. అందుకు మార్గాలను సూచించలేదు. ఈ రహస్యములు తెలుసుకున్న ప్రాచీన మహర్షులు, యోగ విద్యను నిర్మించారు. ధ్యానానికీ, శరీరానికీ ఉండే సంబంధాన్ని గ్రహించారు. శబ్దానికీ, శరీర ధర్మాలకూ ఉండే సంబంధాన్ని నిరూపించడంలో రష్యన్ శరీర శాస్త్రవేత్తలు చాలా కృషి చేశారు. చేస్తున్నారు. అచిరకాలంలోనే, ప్రాచీన యోగ మంత్ర శాస్త్రములు, కేవలం వైజ్ఞానికములనీ, రోగం, మనశ్శరీరాస్వస్థతల వల్ల కలుగుతున్నదనీ, ఆ మనస్సు బాగు పడనంతవరకు కొన్ని శరీర వ్యాధులు నయం కావనీ, అది కేవలం మందుతో మాత్రమే సాధ్యం కాదనీ, వైజ్ఞానికంగా ఋజువు కాక తప్పదు. జ్యోతిశ్శాస్త్ర రీత్యా సర్వ ఔషధులకూ కారకుడయిన చంద్రుణ్ణి శిరస్సులో ధరించిన పరమ శివుడు, యోగీశ్వరుడు కూడా! అందుకే మహా భిషగ్వరుడనే బిరుదు పొందాడు. అద్భుతమైన ఆ ప్రాచీన సంభావనను, మత విద్వేషాలతో కలుషితం చేసిన మందమతులు, నిందార్హులు! ★

# మనిషి - మిథ్య

18 వ పేజీ తరువాయి

అన్నాడు నిరంజనం.

ఉలిక్కి పడ్డారు హాల్లోని వ్యక్తులు.

"అర్థంలేని వ్రాతలు రాయడం ఆయ నొక్కడికే తెలుసనుకుంటున్నాడు కాబోలు. ఈ ఉత్తరం చదువు ఎంత దారుణంగా రాశాడో నిన్ను పెళ్ళి చేసుకున్నది బ్రతక లేకకాదు. ఈ బోడి హోదా కోసం అభిమానం చంపుకున్న వెధవని కాదు.

రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడిచిన తర్వాత మళ్ళా అతని కేకలతో గది దద్దరిల్లిపోయింది.

"చెప్పినట్టల్లా చేయడానికి మీరు పెంచుతున్న కుక్కనికాదు. నాకూ చీమూ, నెత్తురూ ఉన్నాయి. కంపెనీ ఆయనదైతే కావచ్చు. ఆ కంపెనీకి నేను బాధ్యతకల అధికారి నన్ను మాట మరిచిపోడం దారుణం. నా యిష్టానికి వ్యతిరేకంగా నేనే పనీ చెయ్యను. చెయ్యలేను. రేపు మీ నాన్నకి ఉత్తరం రాయి—తగిన గౌరవ మిచ్చి నన్ను కంపెనీ వ్యవహారాలు చూడమంటాడో—లేక ఈ ఉద్యోగానికి తిలోదకాలు ఇచ్చేయమంటారో" అని చెప్పేసి ఇంటినుంచి బయట కెళ్ళిపోయాడు.

రేణుకని పిలిచి కామాక్షమ్మగారు అడిగారు.

"అసలేం జరిగిందమ్మా!"

"నా ఖర్మ" అన్నది రేణుక. ఆ ఉత్తరాన్ని కామాక్షమ్మగారికిచ్చి తన గదిలోకి వెళ్ళిపోయింది రేణుక. ఆవిడ ఉత్తరాన్ని ఏగాదిగా చూచి శంకరాని కిచ్చింది. అతను చదివాడు.

"......శివానంద్‌గారితో అన్నావుట మన కంపెనీలో ఏ ఉద్యోగమూ ఖాళీ లేదని. నాకు చాలా బాధని పించింది. ఆయన ఆఫీసరు. అందునా ముందు ముందు ఆయనతో మనకు చాలా పనులుంటాయి పాపం, నువ్వన్న మాటకి ఆయన ఎంతో విచారిస్తూ నాకు ఉత్తరం రాశారు. కాబట్టి ఈ జాబు అందిన వెంటనే వాళ్ల కుర్రాడికి ఉద్యోగం ఇవ్వు. అది అన్ని విధాలా మంచి పని. కావలసినవాళ్లని దూరం చేసుకోడం తెలివి తక్కువ. వెంటనే వాళ్ల కుర్రాడికి ఉద్యోగంవేసి నాకు జాబు వ్రాయగలవు......"

ఉత్తరం విని ఎవరూ ఏమీ మాటాడలేదు. శంకరం గబగబా బయటకు నడిచేడు అన్నయ్యను కలుసుకునేందుకు. అప్పటికే అతను కారులో చాలా దూరం వెళ్లిపోయేడు.

ఆ రాత్రి అందరి భోజనాలూ ముగిసిన తర్వాత, ఎప్పుడో పది గంటలకి నిరంజనం వొచ్చాడు. అతనొచ్చిన పదినిమిషాలకి మళ్ళా గొడవ ప్రారంభమైంది. ఈ మాటు రేణుక తన వాదనని ప్రారంభించింది.

"ఆయన రాసిన దాంట్లో గూడా పెద్ద నేరమేమీ కనిపించడంలేదు మరి" అన్నది రేణుక.

"ఎందుక్కనిపించాలి? కనిపించదు. నువ్వో ఆ గూటి పక్షివేగా మరి. మీరు నన్ను కొనుక్కున్న మాట వాస్తవమే గదూ. అందుచేత మీ అడుగులకి మడుగు లొత్తడం నా విధి. తప్పుతుందా? ఛీ.....వెధవ జీవితం"

"లేనిపోనివన్నీ మీకు మీరే ఆపాదించుకుని బాధపడటం బాగోలేదు."

"రాణీగారికి కవిత్వ మల్లడం గూడా చాతనౌను. ఎవడో ఆఫీసరుట, ఆపద్బాంధవుడుట, సహాయం చెయ్యాలిటా. వాళ్ల ఆఫీసులో ఆ కుర్రాడికి ఉద్యోగం వేయించడం ఆయనకి నామర్దాట గానీ, ఆ పనేదో నేను చెయ్యాలిట. తనకి యోగ్యుడనిపించని వాడికి—యోగ్యుడిగా భావించి నేనో దారి చూపించాలిట. నాన్‌సెన్స్—ఎవరికీ బుద్ధుల్లేవు."

"అయిపోయిందేదో అయిపోయింది......గారితో చెప్పి"—

"ఓహో! తమరు నచ్చచెప్పడం, ఆయన తలాడించడమూను. సరిసరి. బాగానేఉంది. తమ ఔదార్యానికి కృతజ్ఞుడిని" అన్నాడు కసిగా నిరంజనం.

మొత్తానికి ఆ పూట దంపతు లిద్దరూ భోజనం మానుకున్నారు. ఇది చూచి జానకిరామయ్యగారు నొచ్చుకున్నారు. కామాక్షమ్మగారు "ఇలాటి రగడలు రావడం సహజం అన్నయ్యగారూ! అయితే సరిపెట్టుకోవడంలో ఉంటుంది తెలివి" అని అన్నారు.

ఆ మరునాటి ఉదయం కామాక్షమ్మగారు ప్రయాణ మైయ్యారు. వెడుతూ, జానకిరామయ్యగారితో అన్నారు.

"వీలుంటె ఎప్పుడైనా ఒకమాటు బెజవాడ వస్తారుగా అన్నయ్యగారూ"

ఆయన తలూపారు. వాళ్ళు వెళ్ళిపోయారు.

వాళ్లు వెళ్ళిన మరుక్షణంనుండీ జానకిరామయ్యగారికి తోచడంలేదు. అంతా వెలితిగాఉంది. దానికి తోడు ఈ ఇంట్లో రగడ ఒకటి. ఆయన మనసు చికాకుగా ఉంది. శంకరాన్ని కదిపి చూశారు. అతనూ వెళ్ళిపోదామనే చెప్పాడు.

ఆ సాయంత్రం నిరంజనం రాగానే జానకిరామయ్య అన్నారు.

"రేపు మేమూ వెళ్లాలనుకుంటున్నాంరా!"

నిరంజనం ఆయన మొహంలోకి చూస్తూ,

"ఎందుకనిట?" అని అడిగేడు.

"ఏమీలేదు" ఆయన నవ్వుతూ అన్నారు.

"సరే......మీ కిక్కడ ఉండటం కష్టమైతే అలాగే వెళ్లండి. నేను చెప్పేదే ముంటుందింక"

"మరోవిధంగా అర్థం చేసుకోవద్దు."

"అసలు ఒక అర్థమంటూ నాకు తెలిస్తే.....బాగుండిపోదును. సరే......వెళ్లండి. ఇక్కడ మీరు నాలుగు రోజులు గడిపినట్టు తెలుస్తే మావయ్య ఎంత దిగులు పడిపోతారో గదా"

"అవేం మాటలురా నిరంజనం? తప్పు కదూ?"

"ఏ......ఉన్నమాటే అన్నాను"

"చాల్లే ఊరుకో. మాటకుముందు నువ్విలా దెప్పి పొడుస్తే పాపం, ఆ పిల్లెంత బాధ పడుతుందో గ్రహించావా?"

"నా బాధ మాత్రం ఎవరికీ అవసరంలేదు"

"చూడు నాయనా! చెప్పవలసిన వాడిని కాబట్టి చెప్తున్నాను. సంసారమన్న తర్వాత అనేకమైనవి జరుగుతుంటాయి. కొన్ని మన కిష్టమైనవీ, మరికొన్ని సుతరామూ ఇష్టం కానివీను. మనిషికి ముఖ్యంగా కావలసింది ఓర్పు. ఓర్చుకున్నవాడికే సౌఖ్యం. నిన్నింతటి వాడిగా చేసిన ఆయనకి నీ బాగూ, నీ క్షేమమంటే కదా కావలసింది. కాబట్టి ఆయనచేసే ప్రతి పనీ నీ మంచి కోసమేగదా" అన్నారు జానకి రామయ్య.

"నేనెవరి హితోపదేశమూ వినదలుచుకోలేదు. ఆలోచించేపాటి జ్ఞానం నాకూ ఉంది" అన్నాడు

[illegible]

ఈ రకమైన జాబుతో జానకిరామయ్యగారు కొద్దిగా బాధ పడిన మాట వాస్తవం. ఆ బాధని కప్పిపెట్టుకుని—

"సరె నీ ఇష్టం......రేపు మా ప్రయాణానికి మాత్రం ఏర్పాట్లు చెయ్యి" అని చెప్పి వచ్చేశారు.

* * *

జానకిరామయ్యగారు ఇల్లు చేరగానే తెలిసిన ఘోరమైన విషయం—దీనబంధు అకస్మాత్తుగా పోయారని. ఈ వార్త వినగానే జానకిరామయ్యగారు నిలువునా కూలిపోయారు. కుళ్లి కుళ్లి ఏడ్చారు.

మొన్నటివరకూ గుండ్రాయిలా తిరిగిన దీనబంధుని మృత్యువు కడుపున పెట్టుకుంది. ఏ రోగమూ, రొష్టూ లేకుండానే కన్నుమూశారు. మొన్నవున్న దీనబంధు ఇవాళ లేడు! ఇది నమ్మలేనంత నిజం. నిజం, దీనబంధు మాస్టారు పోయారు.

ఆయన హంసలా బ్రతికారు. పదిమందితోనూ అవుననిపించుకున్నారు. తను నవ్వుతూ, తన పక్కన ఉన్నవాళ్లని నవ్వించేవారు. అంత సహృదయతా అంత నిర్మలత్వమూ ఆయన కొక్కరికే చెల్లుబడి!

ఇక దీక్షితులు లేరు.

దీనబంధు అందర్నీ వదిలి వెళ్ళిపోయారు.

గొడుగు దూరమయ్యింది!

ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా ఆగడం లేదు దుఃఖం.

ఆ ఇంటికి వెళ్లి చూస్తే తన కడుపు తరుక్కుపోయింది. ఎప్పుడు వెళ్ళినా, గంపెడు నవ్వుతో ఆహ్వానించే హితుడూ, స్నేహితుడూ లేడక్కడ. కళాకాంతులు వెదజల్లే ఇల్లు బోసిపోయి ఉంది. ఇంటిల్లిపాదీ గుండెలవిసేలా ఏడుస్తున్నారు. మరీ ఆ పెద్ద కొడుకు ఆడపిల్లకంటె ఎక్కువగా పరిసరాలు మరిచిపోయి ఏడుస్తున్నాడు. దీనబంధు కూతురు, ఆయన వ్యక్తిత్వాన్నీ, ఆయన్నీ పైకి తలుచుకుంటూ ఏడుస్తోంది. దీనబంధు భార్యకి స్పృహలేదసలు. తతిమ్మా పిల్లలందరూ గోడవారగా వాలిపోయారు. ఇక ఏడ్చేందుకు వాళ్లకి ఓపికలేదు.

తెలిసిన వాళ్లందరూ వచ్చారు. ఏడ్చేవాళ్లని ఓదార్చడం మరచి ఆ సహృదయుని స్నేహశీలతనీ, అతని అభిమానాన్నీ విశాల హృదయాన్నీ పొగుడుతూ కళ్లనిండా నీళ్లు నింపుకుంటున్నారు.

మనిషి పోయేడు 'అతని మంచితనం మిగిలింది.'

దీనబంధు దూరమైనా ఆయన ఛాయలు దూరంకాక, అమృత సమానమైన ఆయన నవ్వూ, తేజస్సూ దూరంకావు.

ఇంతమందిలోనూ 'మంచి' అని పించుకుని, ఇంతమంది గౌరవాన్నీ, ఆదరణనీ పంచుకున్న దీక్షితులు ధన్యుడు.

ఆ హృదయ విదారకమైన సన్నివేశాన్ని చూచేందుకు మనసొప్పక వెంటనే ఇంటి కొచ్చేశారు జానకిరామయ్య. ఇంటికొచ్చి తన డైరీలో రాసుకున్నారు. "మా దీక్షితులు స్వర్గస్థుడయ్యాడు భౌతికంగా వాడు మా ముందులేని మాట నిజమే—కాని 'స్నేహం' ఈ లోకంలో బ్రతికినంతకాలమూ వాడూ ఉంటాడు."

ఆ రోజు లగాయితూ జానకిరామయ్యగారితో [illegible] వచ్చింది. ఆయన [illegible] యాన్ని పట్టించుకునే స్థితిలో లేరు. ఎప్పుడూ ఏదో ఆలోచనలతోనే గడిపేస్తున్నారు. ఆయన మనసులో చాలా విషయాలు తన సంబంధం లేకుండానే తిరుగుతున్నాయి.

పోతే—శంకరం గురించి: తను గుంటూర్లో ఉండగానే కాకినాడనుంచి రంగారావ్ ఉత్తరం రాసేడు. నాలుగు వ్యాక్యాల్తో ఉత్తరం ముగించాడు.

"వచ్చావ్. వెళ్లావ్. వచ్చింది ఉద్యోగం కోసమైనా, వెళ్ళింది ఎందుకో తెలీదు. కారణం రాయాలని ఉంటే రాయి. లేకపోతే అదీ వద్దు. నీ మనసు నొప్పించాలని నా కెప్పుడూ లేదు. ఇది మాత్రం నిజం—

రంగారావ్".

ఉత్తరానికి జాబు రాయాలనిపించలేదు.

మధ్యలో ఆగిపోయిన నవలని తిరిగి ప్రారంభించాడు. ఈ వ్యాకపంతో అతను చాలా విషయాలు మరిచిపోయేడు. నాన్న ఆరోగ్యమూ, అన్నయ్య సంసారం, తన ఉద్యోగం—సమస్తం మరిచి మనసంతా నవల పూర్తి చేయడంలో లగ్నం చేశాడు దానికి తగ్గట్టు నవల గూడా వేగంగా, పట్టుగా నడుస్తోంది.

పదిహేను రోజుల్లో అతని నవల ముగిసింది. ఒక మంచి రచన చేశాననే తృప్తితో గాలి పీల్చుకున్నాడు.

కోరుకున్నది నిజమై, తన ముందుంటె మనిషి తత్తరపాటు చెందడం సహజం. నవల పూర్తయిందన్న సంతోషానికి, ఉద్యోగం దొరిందన్న ఆనందం తోడై శంకరాన్ని ఉక్కిరి బిక్కిరి చేశాయి.

రెండు నెలల క్రితం బెజవాడలో ఒకానొక ఉద్యోగం కొరకు ఇంటర్వ్యూకి వెళ్లి తిరిగొచ్చేడు. ఫలితంకోసం చాలా రోజులు ఎదురు చూచి, తెలీకపోవడంతో ఆశని చంపుకున్నాడు గూడాను. అలాటిది కాస్తా, రాదనుకున్న ఉద్యోగం రావడంతో అతను తల దిమ్మెత్తేలా ఆశ్చర్యపోయాడు.

జానకిరామయ్యగారు కొడుకు ఆనందాన్ని చూచి సంతోషించేరు. ఆయనే అన్నారు—

"చదువుకున్నవాడికి, వాడి చదువు ఎప్పటికైనా పని కొస్తుంది. వెళ్లిరా! చక్కగా ఉద్యోగ చేసి అభివృద్ధిలోకి రా నాయనా"

శంకరం కళ్లల్లో ఆనందం తొణికిసలాడింది!

"చివరికి నీ మాటే నిలబెట్టుకున్నావురా! నీ యోగ్యతా, అర్హతా గమనించి ఇచ్చిన ఉద్యోగానికే వెడుతున్నావ్. నాకు చాలా సంతోషంగా ఉంది" అన్నా రాయన.

ఇన్నాళ్లూ చిన్నన్నయ్య అవస్థని అర్థం చేసుకున్న సుశీల ఆ రోజు ఒక పర్వ దినంగా భావించింది. చిన్నన్నయ్య గూడా ఒక ఉద్యోగస్థుడయ్యాడని గర్వించింది.

బెజవాడ వెళ్ళిన తర్వాత భోజనం వసతి, మొదలైన విషయాల్లో ఎంత జాగ్రత్త తీసుకోవాలో తనకు తెలిసినదంతా చెప్పింది సుశీల.

ఆ రోజే శంకరం బెజవాడ వెళ్ళిపోయాడు. కొత్త చోటులోకి, కొత్త జీవితంలోకి అడుగు పెట్టాడు

(పశేషం)

## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

### 7 వ పేజీ తరువాయి

ఆయన ఆయన తమ ఆలోచనలను మరీ అయో మయం చేసుకుంటున్నారన్నమాట. మహాత్మా గాంధీ కాలంలో ఏ పద్ధతిలో అనుసరించారో అది వప్పగించటం వినా, ఏ పార్లమెంటరీ రాజ్యాంగంలో ఏ సూత్రాన్ననుసరించి, పార్టీ పెద్దల సంఘంకు మంత్రివర్గనిర్మాణంలో జోక్యం కలిగించుకునే హక్కు వస్తుందో ప్రధానమంత్రి చెప్పనేలేదు. ఈ పద్ధతి ఏ కమ్యూనిస్టు దేశంలోనో జరగాల్సిన విషయం గాని, ప్రజాస్వామ్య పద్ధతులు పుట్టి పెరిగి పైకి వస్తున్న దేశంలో జరగాల్సింది కాదు. భారత పార్ల మెంటరీ ప్రజాస్వామ్యానికి సంబంధించినంత వరకు కాంగ్రెస్ అధిష్ఠానవర్గం అనేదానికి అధికారబలం అనేది లేనేలేదు.

కాంగ్రెస్ అనుసరిస్తున్న ప్రజాస్వామ్యం స్థితి ఇలా ఉంది.

* * *

ముఖ్యమైన ప్రశ్న ఏమిటంటే సామ్యవాదం వైపు పురోగమనాన్ని నిరూపించటం ఎలా అనేదే? కాంగ్రెస్ సామ్యవాద ధ్వజం చేపట్టి పదేళ్లయింది. ఈ పదేళ్లలోను సాధించిన ఘనకార్య మేమిటిటా ? ప్రభుత్వరంగంలో ఏవో పది ఉత్పత్తి వ్యవస్థలు స్థాపించినంతమాత్రాన సామ్యవాదం కాదు. దీన్ని రెండు రూపాల్లో తేల్చుకోవాలి. సాధించినవి, సాధిం చాల్సిన వాటికి మధ్య గల అంతరం ఏమైనా తగ్గిందా అనే దొకటి. వర్గ, వర్గరహిత సమాజా నికి దారితీసేందుకు వీలుగా అవకాశ సమానత్వం సిద్ధిస్తోందా అనేది రెండోది. కాంగ్రెస్ మార్కు సామ్యవాదం వి. ఐ. పి. (అతిముఖ్య ప్రముఖ వ్యక్తులు) వర్గాన్నొకదాన్ని సృజించిందని ఇదివరకే చెప్పుకోవటం జరిగింది. వాళ్లు కాంగ్రెస్ జాగీ ర్దార్లు, కాంగ్రెస్ కోటీశ్వరులు, కాంగ్రెస్ పెట్టు బడిదార్లు. కాంగ్రెస్ క్రమపద్ధతి పథకాల పరి పాలనం లోగడ కనీ వినీ ఎరుగనంతగా సంపత్తి నంతటినీ ఓ ఇరవై కుటుంబాల చేతుల్లోకి తెచ్చి పెట్టింది. ఇంకోప్రక్క అవినీతి నూటికి 500 పాళ్లు పెరుగుతూ ఉంది. దేశం కావాలనుకుంటున్న వాటిలో మొదటిది సమర్థవంతమైన పరిపాలనం. ఇది మన దేశంలో ఎలా ఉందీ అనే విషయం ప్రపంచ బ్యాంకు తన నివేదికలో ఇలా పేర్కొంది.

"ప్రభుత్వోద్యోగుల (పబ్లిక్ సర్వీసెస్) లోపల బయటా కూడా అసంతృప్తి కనిపిస్తోంది. ఉత్పత్తి ప్రమాణాలు పెంచాలనుకుంటే, ప్రభుత్వ యంత్రాంగంలోనూ, దాని సాధనాల్లోను చాలా అతి ముఖ్య మైన మార్పులు అవసరంగా కన్పిస్తోంది,"

**అయినా పాలక వర్గం కించిత్తయినా మారి నట్లు ఇంతవరకు దాఖలాలు కన్పించటంలేదు!** ★

## "భరణీపిక్చర్సు" రెండు పాటలు రికార్డింగ్

భరణీ పిక్చర్సువారు నిర్మిస్తున్న తాజా సాంఘిక తెలుగు చిత్రంకు పి. నారాయణరెడ్డి వ్రాసిన రెండు పాటలను భరణీస్టూడియోలో భానుమతి పాడగా రికార్డు చేశారు. సంగీతం—ఎం. బి. శ్రీనివాస్. సంగీత పర్యవేక్షణ: భానుమతి, రచన: విశ్వేశ్వర రావు, ఛాయ: అన్నయ్య, కళ: రాజేంద్రకుమార్, కూర్పు: రాజన్, నిర్మాత, దర్శకుడు: పి. రామకృష్ణ. ఇటీవల ఓ 5 రోజుల పాటు వాహినీ స్టూడియోలో జరిగిన షూటింగ్‌లో యన్. టి. రామారావు, భానుమతి నాగయ్య, కన్నాంబ, ప్రభాకరరెడ్డి వాసంతి, పాల్గొన్నారు.

## అవీ - ఇవీ - అన్నీ

### వాసవీ పిక్చర్సు

వాసవీ పిక్చర్సువారు "బీదలపాట్లు" చిత్రాన్ని తీయడానికి స్క్రిప్టు పని పూర్తి చేస్తున్నారు. ఈ చిత్రంలో హీరోగా యన్. టి. రామారావు, సంగీత దర్శకుడుగా మాస్టర్ వేణు, దర్శకునిగా సి. యస్. రావు ఉంటారని తెలుస్తుంది. నిర్మాత—కె. వెంకటేశ్వరరావు.

### 'తోబుట్టువులు' రీరికార్డింగ్

సాధనావారి "తోబుట్టువులు" చిత్రానికి భరణీ స్టూడియోలో అక్టోబరు 27 వ తేదీ



'మారని మనసులు' లో దేవిక.

## 'శ్రీ కనక దుర్గమ్మ' డాక్యుమెంటరీ చిత్రం

యస్. కళ్యాణరావు అండ్ కంపెనీవారు అక్టోబరు 26, 27, 28 తేదీలలో విజయవాడ వెళ్ళి ఇంద్రకీలాద్రి పర్వతంపై "శ్రీ కనక దుర్గమ్మ" డాక్యుమెంటరీ చిత్రం తీశారు విజయవాడ పూర్వ చరిత్రను తెలుపుటకు కొన్ని ముఖ్య ప్రదేశాలు కూడ చిత్రీకరించినట్లు నిర్మాత తెలియజేస్తున్నారు. ఈ చిత్రానికి ఛాయ. బి. కె. కుట్టి, దర్శక, నిర్మాత యస్. కళ్యాణరావు.

నుండి రీ రికార్డింగ్ చేశారు. సంగీత, దర్శకుడు మోహన్‌దాస్, నిర్మాత, దర్శకుడు: సి. రంగనాధ దాస్.

ఈ చిత్రంలో సావిత్రి, జమున, శారద, శాంత కుమారి, యస్. వి. రంగారావు, జగ్గయ్య, కాంతా రావు, చలం మొదలగువారు నటించారు

### "రాముడూ - భీముడూ" రికార్డింగ్

సురేష్ ప్రొడక్షన్సువారు తమ ప్రథమ సాంఘిక చిత్రానికి [illegible] వాహినీ స్టూడియోలో "మహా భారతం"లోని ఒక పద్యాన్ని మాధవపెద్ది పాడగా రికార్డు చేశారు సంగీతం. పెండ్యాల నాగేశ్వర రావు, దర్శకత్వం: తాపీ చాణక్య, నిర్మాత డి రామయ్య నాయుడు, అసోసియేట్ ప్రొడ్యూసర్ జె మల్లారావు.

## కీ॥ శే॥ సి. ఎస్. ఆర్.

(గత సంచిక తరువాయి)

సి. ఎస్. ఆర్. కృష్ణుడుగా, సారంగధరుడుగా ఎక్కువగా వేషాలు వేశారు. పాదుక, రామదాసు, తులాభారం వీరి యితర నాటకాలు.

నటులే కారు వీరు, చక్కని చమత్కారులు కూడా. నటుడు రఘురామయ్యగారితో వీరి పరిచయం దేశానికి ఒక చక్కని—చిక్కని పిట్ట కథను కల్పించి, వదలింది. రఘురామయ్యగారు మరాఠీబాణీ సంగీతానికై మధనపడుతూ సి. ఎస్. ఆర్. ను సలహా అడిగేరు. వీరొక చక్కని ఉపాయం చెప్పారు. "ముక్కుపొడుం పీలిస్తే మరాఠీ సంగీతం బాగా వస్తుందన్నారు". అలా చేస్తే గొంతుకలాగా గమకాలు తిరుగుతుందని రఘురామయ్య అలాగే చాలా రోజులు పాడేరు చివరకొకనాడు సి. ఎస్. ఆర్‌ను రఘురామయ్య కలుసుకొని మీరు చెప్పినట్టుగా ముక్కుపొడుం పీలుస్తున్నాను. కాని, గొంతు సాధన కాలేదన్నారు. సి. ఎస్. ఆర్. నన్నగా నవ్వుతూ "అది కాదోయ్ ! రఘురామయ్యా ! ముక్కపొడుం పీలిస్తే సంగీతం రావడం ఏవిటోయ్? నాకు కావలసినప్పుడు సరఫరా చేస్తూంటావని" అన్నారు. ఆమాటకు రఘురామయ్యగారు కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వి నిజం తెలుసుకున్నారు. సి. ఎస్ ఆర్ ఎక్కడుంటే అక్కడే సందడి. అందరిమధ్యా ఉంటే ఇక చెప్పనక్కరే లేదు. పూనాలో "నరకాసురవధ" చిత్రం తీస్తున్నప్పుడు విజయవాడ మారుతీ టాకీసు అధినేత శ్రీ పోతిన శ్రీనివాసరావు రఘురామయ్యచేత పాడుంపట్టు మానిపించేంతవరకు ఈ అలవాటు తగ్గలేదు

సి. ఎస్. ఆర్. "తులాభారం" నాటకం షెంగళూరులో చూశాక సాగర్‌మూవీటోన్ (బొంబాయి) ప్రొప్రయిటర్ శ్రీ సాగర్ పటేల్ వీరి: రూ. 10,000 — యివ్వడానికి బొంబాయిలో పిక్చరు తీయడానికి ఆహ్వానించేరు

మాగంటి బాపినీడుగారి ప్రోత్సాహంతో "తుకారాం" నాటకం ప్రారంభించారు దేశం మీద విజృంభించారు దీనిలో వీరు చేసిన అమూల్య కృషికి దేశమంతటా అఖండ ఖ్యాతి బహుమతిగా లభించింది. వీరి నట జీవితంలో ఇదొక పెద్ద గీటురాయి. దీనికి పై స్థాయిలో కొంత కాలం తర్వాత శ్రీ టాండన్ దర్శకత్వాన వీరు వెండితెరపై "తుకారాం" గా కన్పించి సర్వ జనామోదరణ పొందగలిగేరు.

కలకత్తా నుండి "సక్కుబాయి" చిత్రంతో నటించేందుకు, వేల్ పిక్చర్సు (మద్రాసు నుండి) "సీతాకళ్యాణం" లోను నటించేందుకు ఆహ్వానింప బడ్డారు.

కాని, మొట్టమొదటి సారిగా "ద్రౌపదీ వస్త్రాపహరణం" చిత్రంతో కృష్ణుని పాత్ర వేశారు. వీరితోపాటు బి. ఎస్. ఆర్. కు కూడా ఈ చిత్రంలో ప్రవేశ [illegible]. ఈ చిత్రం

కోలంపూర్‌లో తీశారు. ఈ చిత్రానికి రచయిత వసుమర్తి యజ్ఞనారాయణగారు. సినిమా రంగంలో మొదటిసారిగా యీ చిత్రంలో నటించి, ఈ చిత్రం తాలూకు డబ్బుతో పొన్నూరులో ఇల్లు కొన్నారు. అది 1935 సం. రం.

సన్నిహితులకు సహకరించి, ప్రోత్సహించి ముందుకు నడిపించడంలో వీరికి వీరే సాటి.

పేకేటి, పద్మనాభం, బాలకృష్ణ, వడ్లమాని విశ్వనాథం మొదలగువారు వీరితో కలిసి అనేక సంవత్సరాలు నాటకాలు వేశారు.

1938 వం. లో. వీరి ఆరోగ్యం మందగించడం ప్రారంభమయి సుగర్ కంప్లెయింట్ వచ్చింది. అయినా వీరి కళాకృషిలో ఏ మార్పూ రాలేదు. తర్వాతనే పి. పుల్లయ్యగారి "వెంకటేశ్వర మహాత్మ్యం" లోనూ, "జయప్రద" లోనూ, రాజా శాండో గారి "చూడామణి" లోనూ, భవాని వారి "చండికలోను"—"తల్లిప్రేమ" లోనూ ముఖ్య పాత్రలు ధరించి, చిత్ర విజయాలే కాక, చిత్ర రంగ విజయానికే చాల దోహదం చేశారు. వీర్ల "సుమతి" లో వేసిన వేషం యింకా ఆంధ్ర ప్రేక్షకులు మరువరానిదే.

1940 సం. లో మద్రాసులో తేనాంపేట— వెంకటరత్నం రోడ్‌లో ప్రస్తుతం వారుంటున్న యింటిలోనే అద్దెకు దిగారు. వారి ఆఖరి క్షణం వరకూ దానిలో నివసించి, అందులోనే పరమప దించేరు

1946 సం. లో ప్రస్తుతం సినిమా రంగంలో ఆరితేరిన మేకప్‌మేన్ భద్రయ్యను



# కీర్తిశేషులు సి.ఎస్.ఆర్.

పాటలు పాడించటానికి తీసుకువచ్చారు. కాని, దాని వలన జీవనోపాధి కష్టం అని తెలుసుకొన్నందు వలన మేకప్‌మేన్ కె. గోపాలరావుగారు (ప్రస్తుతం అశ్వరాజ్ నిర్మాతలు) వద్ద సహాయకుడిగా ప్రవేశపెట్టేరు. సి. ఎస్. ఆర్. నిరాడంబరులు. చాల వరకు గుప్తదానాలు చేశారు చేసినట్లు ఎవరికి తెలియదు. వారి ఆఖరి క్షణం వరకు కొన్ని కుటుంబాలు వారి నాశ్రయించుకొని ఉన్నాయి.

అటు 'సాంఘిక'', "జానపద", "చారిత్రాత్మక" చిత్రాలలోనే కాక, ఉదాత్తమైన పవిత్ర "పౌరాణిక"చిత్రాలలో కూడా వీరిది అందెవేసినచెయ్యి.

స్వభాషలోనే కాదు. వీరు పరభాషలో నైనా ఉదాహరణకు మళయాళంలో "భక్త కుచేల" లో కుచేలుడుగా వేసి అశేష మలయాళదేశంలో కూడా అమూల్య కీర్తి నాపాదించేరు.

ద్రౌపది వస్త్రాపహరణంలో కృష్ణుడిగా చేసిన నటనకు, గృహప్రవేశంలో "తులసమ్మక్కాయ్" హాస్యానికి ఎంతో వ్యత్యాసం, ఎంతో సాన్నిహిత్యం కూడా ఉంది. యువకునిగా, వృద్ధునిగా, హీరోగా, విలన్‌గా, విదూషకునిగా ఎట్టి పాత్ర నయినా సజీవంగా ప్రాణప్రతిష్ట చేసిన "క్యారెక్టర్ యాక్టర్".

అటువంటి నటుడు, పవిత్రమూర్తి అక్టోబరు 8 వ తేదీ ఉదయం 11 గం. 30 ని. లకు స్వర్గస్థులు కావడంతో ఆంధ్ర చలన చిత్రరంగానికే ఒక పెద్ద లోటు కలిగింది. వారి పవిత్రాత్మకు భగవంతుడు శాంతి కలిగించుగాక. ★

—సి. ధర్మారావు

సమీక్ష:

# అందరికీ నచ్చే చిత్రం పెంచిన ప్రేమ

"బిడ్డ డుండియు దేవకి గొడ్డురాలు
బిడ్డ కనకుండియు పుత్రవతి యశోద"

అనుకున్న దేవకీదేవి ఒకప్పుడు. తన బిడ్డ పరుల పంచలలో అష్టయిశ్వర్యాలూ అనుభవిస్తున్నా 'నా బిడ్డ' అని చెప్పుకునే అవకాశంలేని తల్లి బాధ అంతా ఇంతా కాదు. ఆ దేవకి బిడ్డను తన బిడ్డగా యుక్త వయస్సు వచ్చేవరకు అన్ని అగచాట్లు పడి పెంచిన యశోదకు కృష్ణుడు తన బిడ్డకాదు, ఇంకొకరి సొత్తు అని తెలిసినప్పుడామె పడిన ఆవేదనను భాగవతంలో బాగా చదివి ఉంటాం. మరి తన బిడ్డ కాదని తెలిసి, కన్న తల్లిని ఒప్పించి తీసుకొని ఎంతో గారాబంగా మమకారంతో పెంచిన ఒక స్త్రీకి, ఆ కొడుకు అసలు తల్లిదండ్రులవైపు ఆకర్షితుడౌతుంటే పెంచిన తల్లి మనస్సు ఎలా ఉంటుందో 'పెంచిన ప్రేమ' లో భానుమతి నటించి చూపింది.

ఎ. వి. యం వారు తమిళంలో తీసి, భానుమతికి ప్రశంసలు, తమకు రాష్ట్రపతి మెప్పులు సంపాదించుకున్న 'అన్నై' చిత్రానికి తెలుగు రూపం శ్రీ కృష్ణ శాయి ఫిలింస్‌వారి 'పెంచిన ప్రేమ.'

కథలో ముఖ్యమైన భాగం మొదట్లోనే చెప్పుకున్నాంగనుక ఇప్పుడు టూకీగా చెప్పుకుందాం. **తమకు శాశ్వతగా సంతానయోగం లేదని తెలుసుకున్న సావిత్రి (భానుమతి), వేణు (రంగారావు) లు** సావిత్రమ్మ చెల్లెలు సీత జానకి కుమారుణ్ణి పెంచుకుంటారు. ఆపదలో ఆదుకున్నారన్న కృతజ్ఞతతో సీత, ఆమెభర్త గురుస్వామి రంగూన్ వెళ్తారు. మాతృత్వానికి నోచుకొని సావిత్రమ్మ మాతృప్రేమలో చంద్రం (హరనాథ్) పెరిగి పెద్దవాడౌతాడు. సావిత్రమ్మ చెల్లెలు సీత, ఆస్తి పాస్తులు పోగొట్టుకుని, కుంటివాడైన తన భర్తతో రంగూన్ నుంచి వస్తుంది. చెల్లెలిమీది మమకారంతో సావిత్రమ్మ ఆదరించినా, చంద్రంకు సీత తన తల్లి అని ఎక్కడ తెలిసిపోతుందో అనే భయంతో చంద్రం సీతా, గురుస్వామిలను కలుసుకోకుండా ఆంక్షలు విధిస్తుంది. గురుస్వామి సీతలు అనుకోకుండా చంద్రాన్ని కలుసుకొని తమ బిడ్డని తెలుసుకోవటం జరుగుతుంది. లోగడ సావిత్రమ్మకు చేసిన వాగ్దానంవల్ల తామెవరైంది చెప్పకపోయినా, చంద్రంకు వారిపట్ల ఆదరాభిమానాలు పెరగటం జరుగుతుంది.

భయం, అనుమానాలతో సావిత్రమ్మ చంద్రంను పెట్టే ఆరడులవల్ల హృదయవేదనతో గురుస్వామి మరణించటం, కొన్నాళ్ళకు చంద్రం వేణూవల్ల నిజం తెలుసుకొని తన తల్లిని వెతుక్కుంటూ పోవటం, చంద్రంను వదలి ఉండలేని సావిత్రమ్మకు ఉన్మాదం ఏర్పడి ప్రమాద స్థితిలో ఉండగా సీత పరిస్థితి అర్థం చేసుకుని తిరిగి రావటం, చంద్రం కల్యాణంతో కథ శుభంగా ముగుస్తుంది.

నటీ నటుల్లో రంగారావు, భానుమతి ఒకరికొకరు పోటీగా నటించి చిత్రానికి జీవం పోశారు. విషాదమూర్తిగా జానకి ప్రతిభతో నటించిందనే చెప్పాలి. చంద్రబాబు, నాగేష్‌ల హాస్యం, కథలో అతి అనిపించే విషాద వాతావరణానికి కొద్ది విరామం కల్గిస్తుంది.

పేరుకు తర్జుమా చిత్రమే అయినా చిత్రంలో రెండు విశిష్ట లక్షణాలున్నాయి. తమిళ చిత్రంలోని సన్నివేశాలను అలా ఉంచకుండా మార్చి వేరే స్థలాలలో కూరుస్తూ, కథాక్రమం తప్పకుండా ఫ్లాష్ బాక్‌లో చెప్పించటం ద్వారా కొత్త పద్ధతి నవలంబించ గలిగిన నిర్మాత, ఎడిటింగ్ శాఖ ప్రత్యేకంగా ప్రశంస నీయులు. తమిళ చిత్రం చూడని వారికి ఇదే అసలు చిత్రం అనిపిస్తుందేమో కూడా.

తమిళంలో నటించిన నటీ నటులే తెలుగు సంభాషణలు చెప్పుకోవటం ఇంకో ప్రత్యేక లక్షణం, దీనివల్ల అసలు చిత్రాన్ని చూస్తున్నామనే భావన కలగటమేకాక, తర్జుమా ప్రక్రియలోఉన్న లోపాలను కూడా ఈ పద్ధతి కప్పి పుచ్చింది. ముఖ్యంగా 'అతనికి అమ్మవు నీవేనా' అన్న పాట వింటూ చూస్తున్నప్పుడు 'తర్జుమా' భానుమతి పాడుతోందని అనుకోనే అనుకోం.

సాహిత్య రీత్యా అనిసెట్టి రచన విశిష్టస్థానం సంపాదించుకున్నా తర్జుమా విధానం అంత సంతృప్తి కలిగించలేదనే చెప్పాలి. కాని ఉత్తమ శ్రేణి సాహిత్యాన్నే అందించారు అనిసెట్టి. మొత్తంమీద తర్జుమా ప్రక్రియమీద ఇంకా కొంత పరిశోధన అవసరమేమో అనిపిస్తుంది.

మంచి పాటలు, మాటలు, చక్కని సంగీతం, బిగువైన కథతో నటీ నటుల సహకారంతో నిర్మాతల 'పెంచిన ప్రేమ' అందరికి అందుబాటులో ఉంటుందనటానికి సందేహంలేదు.

"నాగరాజ్" ★

# దేశ రక్షణకై ఆయుధాలు
## ఎంత అవసరమో ఉత్పత్తి కూడా అంత అవసరమే!
















Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Chief Editor S. Sambhu Prasad.



ప్రముఖతార సావిత్రి ప్రత్యేక చిత్రం.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.



విజయ